జాతీయ జీవిత చరిత్ర గ్రంథమాల

# గోపబంధు దాస్

రచన

శ్రీరామచంద్ర దాస్

అనువాదం

ఆర్. ఎస్. సుదర్శనం




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయ సూచిక

# తొలి పలుకు

గోపబంధు దాస్ సామాన్య ఛాందస బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. ఆయన పుట్టిన గ్రామం నేటి ఒరిస్సా రాష్ట్రంలో, బంగాళా ఖాత సముద్రతీర ప్రాంతంలో ఉన్నది. ఆయన మరణించిన ఎనిమిదేళ్ళకు ప్రత్యేక రాష్ట్రంగా ఒరిస్సా ఉద్భవించింది. దానికి ఆయన చేసిన కృషి ఎన్నదగినది. 1920లో నాగపూర్‌లో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ వార్షిక మహాసభలో ఆయన ఒరిస్సాకొక రాజకీయ స్వరూపాన్ని తీర్చిదిద్దారు. అటుపై రాష్ట్రీయ భావన అనే ఉపనదిని భారతజాతీయత అనే మహానదిలో సంగమింపజేశారు. ఒరిస్సా రాష్ట్ర కాంగ్రెస్ కమిటీని ఏర్పాటుచేయించి, తన రాష్ట్రంలో స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించారు. ఒరిస్సాలో భారత జాతీయ కాంగ్రెస్‌కు పితృత్వం వహించారు. మహాత్మాగాంధీ, లాలాలజ్‌పత్‌రాయ్‌గార్ల సన్నిహిత సహచరుడుగా, ఆయన ఇతర రాష్ట్రాలలో వలెనే, ఉద్యమ ప్రథముల కోవకు చెందినవాడు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత దేశంలో ఆయనకు రావలసిన గుర్తింపు రాలేదు. కారణం ఆయన అకాల మరణమే, 1928లో, యాభై ఒకటోఏటే, ఆయన దివంగతులయారు. అంతేకాదు, ఒక లేఖలో లాలాజీతో ఆయనఅన్నట్లు ''వార్తాపత్రికల్లోనాకార్యకలాపాల వివరాలు ప్రచురింపబడాలని మీరంటున్నారు గాని అటువంటి ప్రాచుర్యాన్ని కోరడం నా ప్రకృతికి విరుద్ధం. దేశంలో పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోవాలనే కోరిక సుతరామూ లేదునాకు. చేతనైన పని నిర్వహిస్తూ, చెయ్యగలిగిన సేవ చెయ్యడానికి నేను ఎప్పుడూ సిద్ధమే దాన్నిగూర్చి ప్రజలకు తెలియకపోతే వచ్చిన నష్టమేమీలేదు. జీవిత పర్యంతమూ ప్రజాసేవకుణ్ణని భావిస్తూ భగవంతుని మార్గదర్శకత్వంలో నాకుతోచిన సేవనేను చేశాను.'' ప్రజలకు ఆయన్ని గూర్చి బాగానే తెలుసు. ఒరియా వాళ్ళ హృదయంలో ఆయన సజీవుడే. కానీ ఇంతవరకు అధికారవర్గాల నుంచీ ఆయనకు లభించిన గుర్తింపు, 1964 జనవరిలో బారత జాతీయ కాంగ్రెస్ భువనేశ్వర్‌లో వార్షిక సమావేశం జరిగినప్పుడు సభాంగణానికి 'గోపబంధునగర్' అని పేరు పెట్టడమూ, ఆ సమయంలోనే స్మారక చిహ్నంగా ఆయన చిత్రంతో తపాలా బిళ్ళను ప్రభుత్వం విడుదల చెయ్యడమూ మాత్రమే.

అందుచేత ఇప్పుడు 'నేషనల్ బుక్ట్రస్ట్, ఇడియా' వారు ఆయన జీవిత చరిత్రను ప్రకటించ బూనుకున్నారంటే, ఒరియావాళ్ళందరకీయిదిఎంతో ముదావహమైన విషయం.

పండిత గోపబంధుదాస్ జీవిత చరిత్రను వ్రాయమని నన్ను మొదట ఆదేశించిన వారు పండిత పురుషోత్తమ దాస్ టాండన్- లోక్‌సేవక్ మండల్, ఇండియా సంస్థ పూర్వాధ్యక్షులు. ఆయన ఒరిస్సాలో లోక్‌సేవక్ మండల్ అధ్యక్షులైన శ్రీ రాధానాధ్ రధ్ ద్వారా నన్నాదేశించారు. కీర్తి శేషులు లాల్ బహదర్ శాస్త్రి గారు నా మొదటి రచనను కృతిపతిగా స్వీకరించి, ప్రశంసా వాక్యాలతో నన్ను ప్రోత్సహించారు. వీరందరికి నేను కృతజ్ఞతాబద్ధుణ్ణి. ఈ రచనలో ఉపయోగించిన విషయ సేకరణకు దయతో తమ తోడ్పాటు నొసంగిన వారు శ్రీ రాధానాధ్ రధ్. వీరు 'ది సమాజ్' పత్రికా సంపాదకులు, ఒరిస్సాలోక సేవక్ మండల్ అధ్యక్షులు. ఒరిస్సా ప్రభుత్వంలో విద్య ఆర్ధిక, అభివృద్ధి శాఖలకు మంత్రిగా పదవీ నిర్వహణ చేసినవారు, శ్రీ విశ్వనాధ్ దాస్ భారత లోక్‌సేవక్ మండల్ అధ్యక్షులు, ఉత్తర ప్రదేశ్ మాజీగవర్నరు, ఒరిస్సామాజీ ముఖ్యమంత్రి. శ్రీ ఉదయనాధ్ సారంగి, 'ది సమాజ్' పత్రిక నిర్వాహక సంపాదకులు శ్రీ సత్యవాది త్రిపాఠి, సత్యవాది ప్రెస్ ప్రథమ నిర్వాహకులు. వీరికీ, పండిత గోపబందు దాస్‌తో ప్రత్యక్ష సంబంధం కలిగి ఉండిన తదితరులకూ నేను ఎంతో ఋణపడి ఉన్నాను.

-ఎస్. సి. దాస్

# 1

# ప్రారంభ దశ

గోపబంధు దాస్ 1877 అక్టోబర్ 9వ తేది సువాందో అనే కుగ్రామంలో జన్మించాడు. ఈఊరు పూరీ జిల్లాలోని సాక్షిగోపాల్ ఫిర్కాకు చెందింది. పవిత్రతలో గంగా గోదావరీ నదులతో సమంగా భావింపబడుతున్న భార్గవీ నదీ తీరాన ఉన్నది. తండ్రి శ్రీ దైత్యారి దాస్‌కు నాలుగు వివాహాలు జరిగాయి. ఆయన మూడవ సారి వివాహమాడిన శ్రీమతి స్వర్ణమయీ దేవి నోములపంట గోపబంధు.

చాలక్లిష్ట పరిస్థితుల్లో గోపబంధు జన్మించినట్లు చెబుతారు. మూడు రోజులు వరుసగా పురిటి నొప్పులతో బాధపడిన తర్వాత ఆయన తల్లికి ఒక స్వప్నం వచ్చిందట. పుట్టబోయే బిడ్డ ఆమెకు చెందే యోగం లేదనీ, ఆమె స్వగృహం వదలి పొరుగింటిలో ఆశ్రయం పొందితేగాని సుఖప్రసవం కాదనీ ఆస్వప్న వృత్తాంతం. దాన్ననుసరించి ఆ గ్రామంలోనే శ్రీ చక్రధర్ దాస్ ఇంటికి ఆమెను తరలించారు. ఆయింట్లో కాలుపెట్టిన మరుక్షణమే ఆమె ప్రసవించగా గోపబంధు జన్మించాడని గాధ చెబుతారు. కనీసం తన బిడ్డ ముఖం చూసుకోవడానికైనా ఆమె నోచుకోవడం ఒక అదృష్టమే. కానీ ఎన్నోరోజులు గడవలేదు. ఆమె మరణించింది. దైత్యారికి నారాయణ్, గోపబంధు అని యిద్దరు కుమారులున్నా నారాయణ్ అదివరకే పెద్ద సోదరుడు దీనబంధుకి దత్తుడుగా వెళ్లాడు. మళ్లీ వివాహ ప్రసక్తి తలపెట్టకుండా దైత్యారి సర్దుబాటు చేసుకొని ఉండవచ్చును. కాని పిల్లలిద్దరూ పసివాళ్ళు. కుటుంబంలో ఆ పిల్లల్ని చూసుకొనే మరో ఆడదిక్కులేదు. స్నేహితులూ శ్రేయోభిలాషులు ఆయన్ని మళ్ళీ పెండ్లి చేసుకోమని సలహా ఇచ్చారు. దైత్యారికి నాలుగోపెళ్ళి జరిగిన తర్వాత భార్య కాపురానికి రావడానికి కొంతకాలం పట్టింది. ఆమధ్య కాలంలో గోపబంధు ఆలనాపాలనా చూసే బాధ్యతను శ్రీమతి కమలా దేవి అనే దైత్యారి వితంతు సోదరికి అప్పగించారు.

సువాందో చాలాచిన్న గ్రామం. నలభై కుటుంబాలూ, 250 మంది జనాభా, పూరీ జిల్లాలోని బ్రాహ్మణ గ్రామాలన్నింటికి మల్లేనే, ఈ గ్రామం కూడా రెండు రైతు కుటుంబాలూ, మూడు నేతవాళ్ళ కుటుంబాలూ, పదిహేను హరిజన

కుటుంబాలూ, మిగతా బ్రాహ్మణ కుటుంబాలూ కలిసిన ఒక స్వయంపూర్ణ వ్యవస్థ.

## వంశపారంపర్యం

గోపబంధు పూర్వీకులు జాజ్‌పూర్ నుంచి గాంగ వంశరాజుల ఆహ్వానం పురస్కరించుకుని వలస వచ్చి, బిలహణ హరిహర పూర్‌లో నివాసమేర్పరచు కొన్నారు.

గోపబంధు కౌశిక గోత్ర బ్రాహ్మణుడు. తాత భగవాన్ దైవభక్తి గలవాడు. చదువురానప్పటికీ ఆయన సరళాదేవి భక్తుడు. ఒరిస్సాలో ఆమె చదువులకు అధిష్ఠాన దేవత. ఆయన భక్తి తత్పరత ఎంతో గాఢమైనది. ఆయన ఒకసారి తననాలుకను తెగకోసి దేవతకు నైవేద్యమిచ్చి ప్రాణత్యాగానికే సిద్ధపడినాడట. అటువంటి భగవాన్ గోపబంధుకి తాత గారు కావడమేమి, గోపబంధు వ్యక్తిత్వంలోని గొప్పతనానికి ఆయన పూర్వీకులలో కనిపించే ఒకానొక గాఢమైన ఆధ్యాత్మిక తత్పరతయే కారణమని చెబుతారు. భగవాన్‌కు యిద్దరు కుమారులు. దీనబంధు, దైత్యారి. తండ్రి అధ్యాత్మిక తత్పరత దీనబంధుకి సంక్రమించింది. చిన్నతనంనుంచీ పారలౌకికమైన ఆసక్తి అతనిలో గోచరించేది. ప్రాపంచిక వైముఖ్యంతో ధ్యానంలో ఎక్కడ అంతర్ముఖుడవుతాడో అనేభయంతో తల్లి తండ్రులాతనికి చాలా చిన్నతనంలోనే పెండ్లి చేశారు. వారి బలవంతం వల్ల కొంతకాలం సాంసారిక జీవనంలో సుఖంగానే గడిపాడు. అతనికి ఒక కొడుకు పుట్టాడు కాని చాలాకాలం బ్రతకలేదు. కుమారుడి మృతి అతనిలో సన్యాసం మీద ఆసక్తిని రేకెత్తించింది. ఒకనాడు చీకట్లో ఇల్లువదలి వెళ్ళిపోయాడు. అలా దేశాటనం చేస్తూ దీనబంధు భారతదేశంలో ఎన్నో ప్రాంతాలు దర్శించి, చివరకు నవద్వీపధామ్ చేరుకొని శ్రీకృష్ణ భక్తుడైన ఒక గృహస్థుని ఇంటిలో ఆశ్రయం పొందాడు. దీనబంధు అతిథిగా ఉన్న ఆ రాత్రి గృహస్థునికి కలలో శ్రీకృష్ణ భగవానుడు కనిపించి తానాయింట్లో యిక ఉండజాలననీ, తన విగ్రహాన్ని తెల్లవారగానే అతిథికి యిచ్చివేయవలసిందనీ ఆదేశించాడట. ఆ విధంగానే దీనబంధుకి విగ్రహం యిచ్చాడాయన. దీనబంధు ఆనంద పరవశుడై తన దేశాటనం విరమించుకొని యింటికి తిరిగి వచ్చాడు. రావడమేమి యింటిలో విగ్రహాన్ని నెలకొల్పి ఆ దైవానికి సేవకునిగా భావించుకొని కొన్నాళ్ళు గడిపాడు. భక్తి పూరితమైన జీవితం గడుపుతున్నా, దీనబంధు మళ్లీ అసంతృప్తుడై ఏదైనా పవిత్ర క్షేత్రానికి వెళ్ళి తపస్సు చేసుకోవాలని వాంఛించాడు. తనకున్న భూమితోపాటు

ఆస్తి పాస్తులనూ ఐహికమైన సర్వ సంపదలనూ, శ్రీకృష్ణుని పేర, వినోద విహారి అని పిలిచే తన దేవుని పేర, అంకితమిచ్చి గృహత్యాగం చేసి వెళ్ళిపోయాడు. వినోద విహారిని అర్చించే బాధ్యత ఇప్పుడు దైత్యారి మీద పడింది. దీనబంధు అప్పటికే గోపబంధు కంటె పెద్దవాడైన నారాయణ్‌ని దత్తత స్వీకరించాడు. భక్తి శ్రద్ధలు నిండిన ఆవాతావరణంలో జీవిత ప్రారంభదశ గడిపిన బాలకుడు విశేష గుణగణాల్నీ సామాన్యంగా పిల్లల్లో కనిపించని శక్తుల్నీ, పెంపొందించు కోవడం సహజమే.

తల్లి పట్ల విధి చూపిని క్రూరత్వాన్ని గోపబంధు ఎన్నడూ మరచిపోలేదు. తాను పుట్టగానే ఆమె అకాల మృత్యువు పాలైంది. ఈవిషయాన్ని ఆయన జీవితంలో ఎన్నోసార్లు గుర్తు చేసుకున్నాడు. తల్లిప్రేమా దరాలను తనకు దక్కకుండా చేసిన విధి నిర్హేతుక కాఠిన్యాన్ని గూర్చి వాపోయాడు. బంధువర్గమూ స్నేహితులూ, ముఖ్యంగా మేనత్త కమలా దేవీ చూపిన ఆదరణకు తాను ఋణపడి ఉన్నట్లు మనసారా చెప్పుకొన్నాడు. కవిత్వ రూపంలో వెలువడిన యీ వ్యథిత హృదయ పరిదేవనలు ఆయన మాతృహీనుడుగా గడిపిన నికృష్ట జీవితాన్ని గూర్చి ఆయనలో నిభృతమై వున్న మనోభావాల్ని స్పష్టం చేస్తున్నవి. కష్టాలే జీవితంలో ఉత్తమ శిక్షణ నిస్తాయి. గోపబంధుకి అటువంటి శిక్షణ పుష్కలంగానే లభించింది. తద్వారా ఆయన లోకంలో అన్నిరకాలైన దురాగతాల్నీ ఎదుర్కొని పోరాడేందుకు వజ్ర సంకల్పుడయ్యాడు. అవి మానవ దౌష్ట్యం వల్లనో లేక ప్రకృతి వైపరీత్యాల వల్లనో సంభవించ వచ్చు. దీర్ఘమని చెప్పడానికి వీల్లేని యాభైయున్నొక్క సంవత్సరాల జీవితంలో ఆయన దుఃఖిత మానవుల సేవకే నిత్యమూ తనని తానర్పించుకొన్నాడు. బిడ్డలు, తల్లితండ్రుల అనురాగానికి దూరం కాకూడదన్నదే ఆయన ధ్యేయం. ఆయన మాతృభూమి అయిన ఉత్కళ దేశానికీ తద్వారా భారతదేశానికీ సేవావృత్తిలో మనస్ఫూర్తిగా అంకితమయ్యాడు.

## పల్లెటూరి బడిలో

గోపబంధు మధ్య తరగతి కుటుంబానికి చెందినవాడు. నేటి ఆర్థిక పరిస్థితుల్లోనైతే ఆయన్ని పేదవాడు గానే వర్గీకరించాలి. కాని 19వ శతాబ్ది చివరి పాతికేళ్లలో, అంటే ఆయన బాల్యావస్థలో, ఆయన్ని అప్పటికి కాస్త జరుగుబాటు ఉన్నవాళ్ళల్లోనే లెక్కవెయ్యాలి. తండ్రి దైత్యారి 'ముక్తియార్' గా పనిచేస్తూ ఉన్నచోట కాస్త గడిస్తూ ఉన్నవాడే. తన యిద్దరుకొడుకుల్నీ వంశానుగతమైన ఆధ్యాత్మిక సంప్రదాయంతో బాటు, ఆధునిక వాతావరణంలో పెంచి పెద్ద చెయ్యాలని ఆయన అభిమతం. ఆకాలంలో పల్లెకొక్కటి అంటూ, కనీసం కొన్ని గ్రామాలకు కలిసి ఒక్కటైనా

బడీ కాలేజీ ఏర్పడలేదు. అందువల్ల ఒక పల్లెటూరి పంతుల్ని తన కొడుకులకి చదువు చెప్పేందుకు ఏర్పాటు చేశాడు దైత్యారి. గ్రామీణ 'పాఠశాల'ల్లో విద్యావద్ధతి ఆధునిక ప్రైమరీ స్కూళ్ళల్లో అనుసరించే పాఠ్య ప్రణాళిక కంటే కొంత భిన్నంగా ఉండేది. అక్కడ బోధించే విషయాలు ఎక్కువగా ప్రయోజనాత్మకమై ఉండేవి. చదువుట వ్రాయుట, లెక్కలు చేయుట ప్రాథమికంగా అభ్యసింపజేసి గ్రామీణ పరిసరాల్లో జీవయాత్ర గడుపుకునేందుకు వీలనై చదువు చెప్పేవారు. గోపబంధు అక్షరమాల నేర్చుకోగానే, అతణ్ణి ప్రతిరోజూ జగన్నాథ దాస్ విరచిత 'భాగవతం' నుంచీ ఒక్క అధ్యాయం గానం చెయ్యమని నిర్దేశించారు. ఇంటి దైవమైన వినోదవిహారి సమక్షంలో దాన్ని రాగయుక్తంగా అతను చదవాలి. ఆ ప్రసిద్ధ గ్రంథంలోని భాషా, భావవ్యక్తీకరణా పిల్లవాణ్ణి సమ్మోహితుణ్ణి చెయ్యడంతో అతను స్వయంగా కవితల్లల్లి వాటిని గానం చేసే అభ్యాసంలో పడ్డాడు. 'భాగవతం'లో చాలాభాగం కంఠస్థమై పోయింది. ఆ పవిత్ర గ్రంథాన్ని అవగాహన చేసుకోనే విజ్ఞానం లేకపోయినా చిన్నవయస్సులోనే తన వాదం సమర్థించుకునేందుకు ఆ పుస్తకంలో నుంచీ వాక్యాలను ఉదాహరించడం ప్రారంభించాడు. గోపబంధు చిత్తవృత్తి వ్యక్తం చేసే ఈ కొత్త పోకడలు అతని పంతులికి నచ్చలేదు. జమీందారీ లెక్కల్ని గుణించడం అభ్యాసం చెయ్యమని ఆయన నిర్దేశిస్తే శిష్యుడు ఆకలంతో కవితలల్లుతూ కూర్చునేవాడు. పల్లెటూరి బడిపంతులిది సహించలేక, శిష్యుణ్ణి గట్టిగా మందలించే ఉద్దేశంతో అతని తండ్రితో పిల్లవాడు చదువు నిర్లక్ష్యం చేస్తున్నాడని ఫిర్యాదు చేశాడు. కాని తన కుమారుడేమిటో దైత్యారి, పంతులు కంటే బాగా ఎరుగును. గోపబంధుని చీవాట్లు పెట్టడం బదులు అతని బుద్ధి పరిణతిని మెచ్చుకున్నాడు దైత్యారి. తనేస్వయంగా సాయంసమయాల్లో తన కుమారుడు రచించిన గీతాల్ని పెద్దలందరూ చేరిన వేళ వారికి పాడి వినిపించడం ప్రారంభించాడు. ఈ ప్రథమ రచనలను వాళ్ళు మెచ్చుకొని, గోపబంధుని యింకా రచనలు చెయ్యమని ప్రోత్సహించారు. ఆ విధంగా బాల్యంలో గోపబంధు సాగించిన విద్యాకృషి ఆయన చిత్తవృత్తిమీద, వ్యక్తిత్వం మీద, చెరగని ముద్ర వేసింది. తర్వాత జీవితంలో ఆయన 'శ్రీమద్భాగవత' కర్త అయిన జగన్నాథ దాస్‌కి తానెంతో ఋణపడి ఉన్నట్లు చెప్పుకున్నాడు కూడా.

గ్రామ 'పాఠశాల'లో కుమారుని విద్యావ్యాసంగం 'ముక్తియార్' అయిన దైత్యారికి తృప్తికరంగా లేదు. ప్రాథమిక విద్యాస్థాయి నుంచీ క్రమ పద్ధతిలో గోపబంధు చదువుకోక పోతే, పాశ్చాత్య విద్యలో పై తరగతులకు వెళ్ళి కడతేరే అవకాశం ఉండదని ఆయన తెలుసుకున్నాడు. అప్పట్లో పాశ్చాత్య విద్య మీదే దేశంలో మోజు. కాని తన గ్రామానికి దగ్గర్లో 'స్కూల్' ఏదీ లేదు. మూడు

నాలుగుమైళ్ళ దూరంలో ఉన్న స్కూల్‌కి రోజూ రెండుసార్లు తన కొడుకుల్ని వెళ్ళి రమ్మనడం ఆయన కిష్టంలేదు. అందువల్ల తన సొంత ఊరైన సువాందో గ్రామంలోనే అప్పర్ ప్రైమరీ స్కూల్ ఒకదాన్ని స్వయంగా స్థాపించాడు. నారాయణ్, గోపబంధు ఇద్దరూ ఈ కొత్త స్కూల్‌లో చేరారు. గోపబంధు తన సోదరుని కంటె ప్రతి భావ్యృత్పత్తుల్లో పై చేయి అనిపించుకున్నాడు.

నవ్యమైన పాశ్చాత్య పద్ధతిలో గోపబంధు విద్యావంతుడు కావాలని దైత్యారి అభీష్టమైనప్పటికీ, పాత సంప్రదాయాల నుంచీ ఆయన తెగ తెంపులు చేసుకోలేకపోయాడు. బాల్యవివాహం ఆ రోజుల్లో బ్రాహ్మణ కుటుంబాల్లో అనూచానంగా అంగీకరించబడిన ఆచారము. దైత్యారి గోపబంధు పండ్రెండవ ఏటనే అతనికి పెళ్లి చేశాడు. అప్పటికింకా ప్రైమరీ స్కూల్‌లోనే ఉన్నాడతను. పిల్లపేరు ఆప్తి (మోతీ). బంగూర్‌బా (గదాధర్‌పూర్) అనే పరిసర గ్రామం ఆమెది. పెళ్ళి చదువుకి భంగం కలిగించలేదు. నిజానికి జరిగింది బొమ్మల పెళ్ళిలాంటిదే. భార్యాభర్తల సంయోగం యింకెప్పుడో జరగాలి. అందువల్ల అప్పర్‌ప్రైమరీ స్కూల్లో చదువుపూర్తి కాగానే గోపబంధు రూప్‌దే పూర్‌లో మిడిల్ వెర్నాక్యులర్ స్కూల్లో చేరాడు. ఆఊరు తన గ్రామానికి ఎనిమిది కిలోమీటర్లలో ఉన్నది. ఇప్పుడు ఆ మిడిల్ వెర్నాక్యులర్ స్కూళ్ళు రాష్ట్రంలో ఎక్కడా కనిపించవు. వాటి స్థానంలో మిడిల్ ఇంగ్లీష్ స్కూళ్లు ఏర్పడ్డాయి. వాటిని అలా ఏర్పాటు చెయ్యడానికి గోపబంధు రాష్ట్ర శాసన సభలో సభ్యుడైన తర్వాత చాలా కృషిచేశాడు. ఆనాటి స్కూళ్ళలో అనుసరించిన పాఠ్య ప్రణాళికకూ మిడిల్ ఇంగ్లీష్ స్కూళ్ళలోని పాఠ్య ప్రణాళికకు ఉండిన తేడా: అందులో ఇంగ్లీషు బోధన లేదు. లెక్కలూ సాహిత్యమూ బోధించడానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవారు.

## మిడిల్ వెర్నాక్యులర్ స్కూల్

గోపబంధు జీవితంలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమైంది. ఇక్కడ కొత్తగా ఏర్పడిన స్నేహాలు ఆయన జీవితాంతం నిలిచాయి. రూప్‌దేపూర్ ఎం.వి. స్కూల్ ప్రధాన పండితుడు పండిత్ సదాశివ మిశ్రా. ఆయనది వీర నరసింగపూర్. ఆయనకు సంతానంలేకపోవడంతో తన శిష్యుల్నే సొంత బిడ్డలుగా చూసుకునేవాడు. తల్లిలేని గోపబంధుకి పండిత్ సదాశివ ఆప్తుడయ్యాడు. గోపబంధు సాహిత్యాభినివేశము ఆయన్ని అలరించింది. సాయం సమయాల్లో గోపబంధు ఆయన యింటికి వెళ్ళి సాహిత్య చర్చలు చేసేవాడు. ఈ చర్చలు గోపబంధు మనస్సుమీద చెరగని ముద్ర వేశాయి. గోపబంధు పండిత్ సదాశివల

ప్రేమబంధం ఉదాత్తమైనది. తర్వాత గోపబంధు బారిపాడాలో సంస్థాన న్యాయవాదిగా పనిచేసే రోజుల్లో మయూర్ భంజ్‌కి నచ్చజెప్పి అక్కడొక అనాథ శిశుశరణాలయం స్థాపింపజేసి, దాన్ని నిర్వహించే బాధ్యత పండిత్‌సదాశివ మిశ్రాకు యిప్పించాడు. అప్పుడు పండిత్‌కు ఆయన వ్రాసిన లేఖలో యిలా వుంది. 'నేనొక్కణ్ణే పుత్రుణ్ణి మీకు. ఇక్కడ ఈ శరణాలయంలో పుత్రులు పుత్రికలు ఎంతో మంది వున్నారు. వారితో మీరు కులాసాగా గడపవచ్చు. అందుకే రమ్మని ఆహ్వానిస్తూ ఉన్నాను.'' ధర్మాచరణకైన ఆ పిలుపుని పండిత్ మిశ్రా కాదనలేక పోయాడు.

## హైస్కూల్

రూప్‌దేపూర్‌లో చదువు పూర్తి చేసుకుని గోపబంధు పూరీ వెళ్ళాడు. పూరీ జిల్లా స్కూల్‌లో (1893) చేరాడు. అప్పట్లో మిడిల్ వెర్నాక్యులర్ నుంచీ హై ఇంగ్లీష్ స్కూల్‌కి వెళ్ళడం వల్ల చదువులో కలిగే మార్పుకి విద్యాశాఖ ఎటువంటి సదుపాయమూ చెయ్యలేదు. ఎమ్. వి. పరీక్ష పాసైన గోపబంధుకి ఇంగ్లీషు భాషా జ్ఞానం లేకపోవడం వల్ల IV తరగతి ( ఇప్పటి VIII తరగతి) బదులు దాని క్రింది తరగతిలో చేరవలసి వచ్చింది. మిడిల్ ఇంగ్లీషు స్కూల్ పాసైన విద్యార్థులకా యిబ్బందిలేదు. గోపబంధు సాహిత్యంలో దిట్ట కావడంతో అందులో అందరి విద్యార్థుల మీద అతనిదే పైచేయిగా ఉండేది. కానీ ఇంగ్లీషు భాష రాని లోపంవల్ల విద్యలో పురోగతి మందకొడిగానే ఉండి ఆయనలో ఒక ఆత్మ న్యూనతా భ్రాంతి చోటుచేసుకున్నది. ఆ భావం ఆయన్ని చాలాకాలం వదలిపెట్టలేదు. ఇంగ్లీషులో ప్రావీణ్యం సంపాయించి తరగతిలోని సహాధ్యాయులతో సమానం కావడానికి తాను గట్టి ప్రయత్నమే చెయ్యవలసివచ్చింది. ఆ ప్రయత్నం ఎంతగా సఫలీకృతం అయ్యిందంటే, ఆయనకి 'డబుల్ ప్రమోషన్' యిచ్చి పై తరగతికి పంపించారు. అందువల్ల ఎమ్. వి. స్కూల్ చదువు వల్ల వెనుకబడిన కాలాన్ని పుంజుకోగలిగాడు.

## రామచంద్రదాస్‌తో పరిచయం

శ్రీరామచంద్ర దాస్ పూరీలో ఒక 'ముక్తియార్'. ఆయనతో గోపబంధుకి పరిచయం కలిగింది. ఆయన దేశాభిమానమూ, దుఃఖిత మానవాళిపట్ల ఆయన ప్రేమా, చిన్నవాడైన గోపబంధుని ప్రభావితుణ్ణి చేశాయి. రామచంద్ర ఉదార స్వభావుడు. కష్టంలో ఉన్నవాడెవడైనా సరే ఆయన్ని సమీపించే అవకాశం సులువుగా

లభించేది. దళితుల పట్ల ఆయనకు ఎంతో ఆదరం. ఉదారుడైన కార్యకర్తగా, నిర్వాహకుడుగా ఆయన కీర్తి జిల్లా అంతా వ్యాపించింది. రామచంద్ర వ్యక్తిత్వమూ, మంచిపేరూ తనని ఆకర్షించగా సహోద్యోగి అయిన దైత్యారి దాస్, కుమారుడు గోపబంధుని ఆయన పర్యవేక్షణలో ఉంచాడు. రామచంద్ర అప్పుడు దైత్ పరసాహిలో నివసిస్తూ ఉన్నాడు. ఆయన పర్యవేక్షణలో మరొక సంస్కృత విద్యార్థి కూడా ఉండేవాడు. అతనే తర్వాత పండిత్ వసుదేవరథ్‌గా ప్రసిద్ధుడయ్యాడు. కోర్టునుంచి వచ్చిన తర్వాత రామచంద్ర తన శిష్యులిద్దరితో ప్రాచ్య పాశ్చాత్య విద్యావిధానాలను పోల్చి వాటి బాగోగులను చర్చించేవాడు. ఆ విధంగా వ్యక్తిత్వం రూపుదిద్దుకునే యుక్త దశ నుంచీ గోపబంధు, వసుదేవ, యిద్దరూ విద్యపట్ల ప్రీతిని పెంపొందించుకున్నారు. ఆ రోజుల్లోనే పూరీ జిల్లా స్కూల్‌లో దివ్యసింఘ మిశ్రా అనే ఉపాధ్యాయుడుండేవాడు. ఆయన గోపబంధు వ్యక్తిత్వమూ, ప్రతిభా, కృషీ మెచ్చుకునేవాడు. పై చర్చలో ఆయన కూడా పాల్గొంటూ ఉండేవాడు. అధ్యయనంతో కూడి సంస్కృతికి సంబంధించిన వ్యాసంగాల్లో గోపబంధు తన ప్రతిభా విశేషాల్ని వృద్ధి చేసుకునేందుకు ఆ వాతావరణం ఎన్నో అవకాశాల్ని చేకూర్చింది.

## పూరీలో జీవితం

విద్యార్థిగా గోపబంధు స్కూల్లోనూ సామాజిక జీవితంలోనూ తన సమకాలికులను మించి ఉన్నతుడుగా భాసించాడు. సంఘాలను సమావేశాలను ఏర్పరచడంలో ఆయనకు ప్రత్యేకమైన అభినివేశం; సహకారయుత సమిష్టి కృషి పట్ల అభిరుచి పెంపొందించడం ఆయన ధ్యేయం. ఆయనలో నాయకత్వ లక్షణాల్ని అది పెంచింది. కలిసిమెలిసి కృషి చెయ్యడం నేర్పింది. రెండు సంఘటనల ద్వారా పూరీ పౌరులకు గోపబంధు వ్యక్తిత్వమూ, స్వాతంత్ర్య ప్రవృత్తీ తెలిసి వచ్చాయి. ఒకటి ఆ ఊళ్లోనే జరిగింది. రెండోది జిల్లా స్కూల్లో విద్యార్థిగా ఉన్నప్పుడు జరిగింది.

ఆయన పూరీలో విద్యార్థిగా ఉన్నప్పుడొకసారి జగన్నాథ స్వామి రథోత్సవ సమయంలో కలరా వ్యాధి వ్యాపించింది. పవిత్రోత్సవ సందర్భంగా అక్కడ చేరిన యాత్రికుల్లో చాలమంది చనిపోయారు. ప్రభుత్వమూ, పురపాలక సంఘమూ ఏమీ పట్టించుకోకుండా ఉండిపోయారు. చచ్చిన వాళ్ళశవాలు సంస్కారం లేకుండా వీధుల్లో క్రుళ్ళుతూ దుర్గంధాన్ని నింపుతున్నాయి. పుణ్యక్షేత్రమైన పూరీలో ఈ ఘోర దృశ్యాలను చూడలేక వ్యథితుడైన గోపబంధు 'పూరీ సేవాసమితి' అనే

పేరుతో ఒక స్వచ్ఛంద సేవా దళాన్ని సంఘటిత పరిచాడు. అనాథ మృత దేహాలకు అగ్ని సంస్కారం చెయ్యడం, మరణావస్థలో ఉన్న వారికి తోడ్పడడం సమితి చేపట్టిన విధులు. ఆ కార్య నిర్వహణలో హరిహరదాస్ గోపబంధుకి కుడి భుజమయ్యాడు. ఈ హరిహరదాస్ తర్వాత ప్రముఖ భూదానోద్యమ నాయకుడై ఆచార్య హరిహర్‌గా ప్రసిద్ధి పొందాడు. ఇద్దరూ ఎన్నో సంక్షేమ కార్యకలాపాల్లో పాల్గొంటూ గాఢ మిత్రులయ్యారు. ఆ స్నేహం ఆచార్య హరిహర్ మరణించేదాకా అలాగే కొనసాగింది. అలా సేవాసమితి నిర్ణీత పరిధిలో తనపని తాను నిర్వహిస్తూ ఉండగా, గోపబంధు స్నేహితుడైన దివాకర్ దాస్ పూరీలో వైద్య, ప్రజారోగ్య శాఖలు చూపిస్తున్న నిర్లక్ష్యవైఖరిని తీవ్రంగా దుయ్యబడుతూ పత్రికల్లో వ్రాశాడు. 'స్టేట్స్‌మన్' లో ప్రచురించబడిన అతని విమర్శ, స్థానిక ఉద్యోగుల్లో ఆగ్రహాన్ని కలిగించింది. సివిల్ సర్జన్‌గా ఉన్న చార్లెస్ బెక్ కోపోద్రిక్తుడై. దివాకర్ దాన్ని వ్రాశాడని తెలిసి అతణ్ణి వీధిలోక లాగి బెత్తంతో కొట్టాడు. ఒక పెద్ద ప్రభుత్వోగి అలా నిష్కారణంగా పైబడి కొట్టడంతో పూరీలోని యువకులు ఉద్రేకంతో పెట్రేగి పోయారు. సివిల్ సర్జను ప్రాణాలకే ముప్పు ఏర్పడింది. కాని గోపబంధు సహనం వహించమని వాళ్ళను అనునియించి, దివాకర్ చేత స్థానిక మేజిస్ట్రేట్ కోర్టులో సివిల్ సర్జన్ మీద దావా వేయించాడు. డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్ యూరపియన్ కావడం వల్ల సివిల్ సర్జన్ పట్ల అతనికి సానుభూతి ఉండటం సహజమే అయినా, పట్టణంలో విజృంభించిన ఆవేశ తీవ్రతను గమనించిన తర్వాత మేజిస్ట్రేట్‌కి దావాను త్రోసిపుచ్చే ధైర్యం లేకపోయింది. అతను ఆ దావా విచారించి, దావాలోని యథార్థాన్ని గ్రహించి, సివిల్ సర్జన్‌కి ఎదుటి పక్షంతో ఏమైనా సరే రాజీపడమని హితవు చెప్పాడు. సివిల్ సర్జన్‌ని ప్రాసిక్యూట్ చేసే ఉద్దేశం గోపబంధుకి లేదు. అంత కంటె భారతీయుల గౌరవ మర్యాదలను రక్షించి నిలబెట్టడమే, ప్రజల్ని హీనదృష్టితో చూసే అధికార గర్వితులైన యూరపియన్‌లను ఎదురొడ్డి నిలవడమే, ఆయన లక్ష్యం. అందువల్ల ఆయన సివిల్ సర్జన్ క్షమాపణ చెప్పుకొవాలని పట్టుబట్టి, అతనిచేత దివాకర్‌కు ఒక బహిరంగ ప్రదేశంలో క్షమాపణ యిప్పించాడు. గోపబంధు మెట్రిక్‌లో ఉన్నప్పుడు సాహిత్య వ్యాసంగాల్లో ఎక్కువ అభినివేశం చూపిస్తూ, ప్రసిద్ధ పత్రికలకు రచనలు పంపుతూ ఉండేవాడు. ఆరోజుల్లో సాహిత్య రచనా విధానంలో ప్రాచీనతా వాదులకూ ఆధునికతా వాదులకూ ఒక వివాదం జరుగుతూ ఉండేది. అది 'ఇంద్రధను', 'బిజిలి' (మెరుపు) అనే రెండు పత్రికల్లో సాగేది. మొదటి పత్రిక ప్రాచీన సాహిత్యరీతుల్ని సమర్థించే వారికి పట్టుగొమ్మ, అంటేఛందస్సూ, అలంకారాలూ, పదాడంబరము వంటి వాటికి ప్రాముఖ్యాన్ని యిచ్చేది. ఆ పద్ధతికి ఉపేంద్ర భంజ్ రచనలు ప్రాతినిధ్యం వహించేవి. ఈ నాటికీ

ఆయన్ని 'కవిచక్రవర్తి' గా వర్ణిస్తారు. ఆధునికులకు నాయకుడు రాధానాథ్‌రాయ్, ప్రసిద్ధ ఒరియా కవి. ఆయన అప్పట్లో ఒరిస్సాకు విద్యాధికారి (ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్) గా ఉండేవాడు. ఈ ఆధునికులను 'బిజిలి' సమర్థించేది. ఏజాతిగానీ, సాహిత్యంగానీ సంప్రదాయాలను వదలి జీవించలేదనీ, కొత్త సంప్రదాయాలను సమకాలీన రచయితలు రూపొందిస్తున్నంత మాత్రాన, పాతవాటిని నిరసించడం వివేక మనిపించుకోదనీ, గోపబంధు గ్రహించాడు. ఈనాడు మనం నిర్మించే జాతీయతా సౌధం గతానికి చెందిన వారసత్వం అనే గట్టి పునాది మీద నిర్మిస్తే తప్ప అది చిరకాలం నిలిచి ఉండదనే విశ్వాసం, ఆంగ్లరాజకీయవేత్త బర్క్‌కి వలెనే, గోపబంధుకీ ఉండేది. ఆధునికుల పట్ల ఆయనకు వైరస్యం ఏమీలేదు. వాళ్ళు గతాన్ని నిరసించడాన్ని మాత్రం ఆయన గర్హించాడు. ఆభావంతోటే 'ఇంద్రధను' పత్రికలో ఒక హేళనాత్మక వ్యంగ్యపద్యరచనను ఆయన ప్రకటించాడు. ఆ పద్యంలో వస్తువు – ఒకనాడు తనకు కలవచ్చిందట. ఆ కలలో సమకాలీన కవుల రచనలన్నీ చెదపట్టి ఒక మూల మూలుగుతూండగా ప్రాచీన కవుల రచనలు భద్ర పరుపబడి సముచిత స్థానంలో ఉన్నట్లు కనిపించినవట. రాధానాథ్ రాయ్ ఈ పద్యాన్ని ఓ అపచారంగా ఎంచి, గోపబంధుకి శిక్షవిధింపజేశాడు. పూరీజిల్లా స్కూల్‌ని 1894 జనవరి 25 తేదీ నుంచి ఫిబ్రవరి 2 తేదీ వరకు తణిఖీచేస్తూ, పూరీలో ఉన్న ఆ వారం రోజుల్లో ఆయన పద్యకర్త ఎవరో తెలుసుకునేందుకు గట్టిగా ప్రయత్నించాడు. పూరీ జిల్లా స్కూల్ హెడ్ మాస్టరు మీదా, ఉపాధ్యాయుల మీదా అధికార హోదాలో ఒత్తిడి చేస్తూ, ఆ పద్య రచయిత ఎవరో తెలిపేందుకు వాళ్ళు సాయపడకపోతే తీవ్రఫలితాల్ని అనుభవించ వలసి ఉంటుందని కూడా ఆయన బెదిరించినట్లు, 'ఉత్కళదీపిక' పత్రికలో 'లేఖలు' శీర్షిక చూస్తే మనకు విదితమవుతున్నది. తరగతులన్నింటికీ వెళ్ళి ఆయన ప్రతి తరగతిలోనూ తరుచు పత్రికలకు రచనలు పంపే విద్యార్థులెవరని గుచ్చి ప్రశ్నించాడు. ఆ సమయంలో విద్యాధికారిని మంచి చేసుకునే ఉద్దేశంతో ఒక ఉపాధ్యాయుడు గోపబంధుదాస్ పేరును బయటపెట్టాడు. రాధానాథ్ పిలిపించి ప్రశ్నించగా గోపబంధు ఒప్పుకోలేదు. కాని కొంతమంది ఉపాధ్యాయులూ విద్యార్థులూ చెప్పిన సాక్ష్యాన్ని బట్టి హెడ్ మాస్టరు విద్యాధికారితో గోపబంధు నిజం చెప్పలేదనీ, అతనే ఆ పద్యాన్ని వ్రాసిన రచయిత అనీ ఒక నివేదిక యిచ్చాడు. దాని ననుసరించి గోపబంధుకి వారం రోజుల స్కాలర్‌షిప్‌కు సరిపడే మొత్తాన్ని జుల్మానా విధించవలసిందనీ, ఆ ఏడాది అతనికి రావలసిన బహుమతి యివ్వకుండా నిషేధించ వలసిందనీ విద్యాధికారి హెడ్ మాస్టర్‌కి ఆదేశాలు యిచ్చాడు. ఆ సందర్భంలో గోపబంధు నిజమే చెప్పదలిచాడనీ, కాని కొందరు ఉపాధ్యాయులు విద్యాధికారి

ఆగ్రహావేశాన్ని, 'ఇంద్రధను' పత్రికా పాఠకుల పట్ల రచయితల పట్ల ఆయన ద్వేషాన్నీ గమనించి ఉండడం వల్ల అలా చెప్పవద్దని సలహా యిచ్చారనీ తెలుస్తున్నది. తర్వాత గోపబంధుని తన పద్యాన్ని పత్రిక నుంచి ఉపసంహరించుకొమ్మని, పత్రికా ముఖంగా క్షమార్పణ కోరుకొమ్మనీ, అలా చేస్తే విధించిన శిక్ష తప్పించుకోవడానికి అవకాశం ఉంటుందనీ తెలియజేశారు. కాని అలా చెయ్యడానికి ఆయన నిరాకరించాడు. ప్రాచీనుల్ని సమర్థించి, ఆధునికుల మీద వారికి గల ఆధిక్యతను వ్యక్తం చేయడంలో తాను చేసిన అపరాధమేమీలేదని ఆయన అన్నాడు.

# 2

# కటక్‌లో కళాశాల జీవితం

1899లో గోపబంధు పూరీ జిల్లా స్కూల్ నుంచీ మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థుడై, రేవన్‌షా కాలేజిలో 'కళ'ల్ని అధ్యయనం చెయ్యడానికి చేరాడు. అతని వయస్సు యిర్వై మూడేళ్ళు. తాను పంద్రెండవ ఏట 1889లో పెళ్ళాడిన బాలికతో పునస్సంధానం జరగడంతో కాలేజికి వివాహితుడుగా వచ్చాడు. దురదృష్టవశాత్తు కాలేజి చదువు ప్రారంభంలోనే తండ్రి దైత్యారిదాస్ మరణించాడు. కాని ఆస్తి వ్యవహారాలూ కుటుంబ విషయాలూ అన్నగారైన నారాయణ దాస్‌కి అప్పగించి రావడంతో ఆయనే కుటుంబ బాధ్యత వహించి, గోపబంధు తన వ్యాసంగాల్ని స్వేచ్ఛగా కొనసాగించేందుకు అవకాశం కల్పించాడు.

గోపబంధుకి కటక్ కొత్తచోటు. గ్రామీణ ప్రాంతంనుంచి రావడం వల్ల కొత్త వాతావరణంలో జంకు కలగడం సహజమే. కాని అతనిలోని ఆకర్షణాశక్తి స్నేహితుల్నీ సహాధ్యాయుల్నీ ఆకట్టుకొన్నది. కటక్ చేరిన కొన్నాళ్ళకే 'కర్తవ్యబోధినీ సమితి' అనే సమాజాన్ని తోటి వారితో కలిసి స్థాపించాడు. ఆ సమాజంలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యలపై చర్చలు జరిగేవి. ప్రతి సభ్యుడూ స్వేచ్ఛగా నిర్భయంగా అభిప్రాయాల్ని వ్యక్తం చేసే అవకాశం ఉండేది. కాలేజి అధ్యాపకులు కూడా కొందరు ఆ సమాజ కార్యక్రమాల్లో పాల్గొని విద్యార్థుల్ని ప్రోత్సహించేవారు. ఆ రోజుల్లోనే ఒరియా భాషని త్రోసిపుచ్చి బెంగాలీ భాషను ఒరిస్సా ప్రజల్లో వ్యాపింపజేయాలనే ఉద్యమాన్ని ఒరిస్సాలో నివసిస్తున్న బెంగాలీ వాళ్ళు ప్రారంభించారు. రేవన్‌షా కాలేజి కలకత్తా విశ్వవిద్యాలయనికి అనుబంధ కళాశాల కావడం వల్ల ఒరియా విద్యార్థులకుక్కూడా విశ్వవిద్యాలయం వాళ్ళు పరీక్షల్లో ఇంగ్లీషులోకి తర్జుమా నిమిత్తం ఒరియా పాఠం బదులు బెంగాలీ పాఠాన్నే యిస్తూ ఉండేవారు. ఇది ఒరియా ప్రజలకు అవమానకరంగా ఉండేది. 'సమితి' వాళ్ళు ఈ ఆందోళనలో పాల్గొని గట్టిగా ఆక్షేపణ ప్రకటించడం వల్లనే, కలకత్తా విశ్వవిద్యాలయం వాళ్ళు ఒరియా భాషలో కూడా అనువాదనిమిత్తం పాఠాన్ని యిచ్చే పద్ధతి ఏర్పడింది. ఈ కాలంలో గోపబంధు స్నేహితులు హరిహర్, వ్రజసుందరదాస్ అతనికి తోడ్పడ్డాడు. ఈ ముగ్గురూ ఒక స్వచ్ఛంద సేవాదళాన్ని

ఏర్పాటు చేశారు. ఒరిస్సాలో ఆర్తజనాన్ని, ముఖ్యంగా వరద బాధితుల్ని వీరు అదుకున్నారు. నగరమంతా తిరిగి విరాళాలు సేకరించి, ఆ సొమ్ముతో వరద వచ్చిన ప్రదేశాలకు సేవాదళంవారు గుంపులుగా వెళ్ళి వరద బాధితులకు సహాయం అందజేశారు.

1901లో ఎఫ్. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడైన తర్వాత ఆయన చదువుకు స్వస్తి చెప్పాలని నిశ్చయించుకున్నాడు. కాలేజిలో ఉండగానే తన బిడ్డ మరణించినట్లు వార్త వచ్చింది. తల్లి తాను పుట్టగానే గతించింది. తండ్రి తాను కాలేజిలో చేరే ముందు పోయాడు. కుటుంబంలో ఈ మరణాలూ, దేశప్రజల దుస్థితీ ఆయన్ని చదువు చాలించి, సంక్షేమ కార్యక్రమాన్ని చేపట్టడానికి పురికొల్పాయి. అన్నగారైన నారాయణా, కొంతమంది స్నేహితులూ బలవంతం చెయ్యగా ఆయన బి.ఏ. తరగతిలో చేరాడు. అయినప్పటికీ చదువు మీద మనస్సు లగ్నం చెయ్యలేకపోయాడు. దేశ సమస్యలు ఆయన హృదయంలో ప్రథమ స్థానం ఆక్రమించేవి. తన కాలాన్ని చాలావరకూ సంక్షేమ కార్యకలాపాలకే వినియోగించేవాడు. తత్ఫలితంగా 1903లో బి.ఏ. పరీక్షలో కృతార్థుడు కాలేకపోయాడు. విఫలుడైన వార్త ఆయనకు బాధ కలిగించింది. ఆ సమయంలోనే తన ఒక్కగానొక్క కొడుకు చనిపోయిన వార్త కూడా తెలిసింది. ఇలా ఒకదాని వెంట మరొకటిగా ఆపదలు వచ్చినా, పరీక్షకు మళ్ళీ చదివి 1904లో కృతార్థుడయ్యాడు. అటుపై స్వచ్ఛంద వృత్తి చేపట్టి జీవించే ఉద్దేశంతో ఆయన న్యాయశాస్త్ర తరగతుల్లోనూ, ఎం.ఏ.లోనూ చేరాడు.

# 3

# కలకత్తాలో

బి.ఏ. పరీక్షలో పాసైన తర్వాత గోపబంధూ, ఆయనతో బాటు గోపీనాథ దాస్, వైద్యనాథ మిశ్రా అనే సహాధ్యాయులూ వెళ్ళి గురువైన రామచంద్రదాస్‌ను కలుసుకున్నారు. పూరీలో దైత్ పరసాహీలో ఆయన స్వగృహంలో తమ భావికర్తవ్యాన్ని గూర్చి సలహా యిమ్మని కోరారు. సలహా చెప్పడానికి బదులు రామచంద్ర, ''జీవితంలో మీ లక్ష్యం ఏమిటి?'' అని వాళ్లను ప్రశ్నించాడు. వైద్యనాథ్ గోపీనాథ్‌లు ఏకకంఠంతో ''ప్రభుత్వోద్యోగం'' అన్నారు. కాని గోపబంధు చెమ్మగిల్లిన కళ్ళతో ''సాంఘికసేవ, స్వచ్ఛంద జీవనమూ'' అని సమాధానం చెప్పాడు. గోపీనాథ్ వైద్యనాథ్‌లు రాష్ట్రీయ సివిల్ సర్వీస్‌లో చేరి డిస్ట్రిక్టు, సబ్ డివిజినల్ మేజిస్ట్రేట్లుగా పదవీ విరమణ చేసారు. గోపబంధు స్వచ్ఛంద జీవనాన్ని ఆశించి మొదట కటక్‌లోనూ తర్వాత కలకత్తాలోనూ న్యాయశాస్త్ర అధ్యయనం సాగించాడు.

గోపబంధు దృష్టిలో విద్యాసముపార్జన అంటే ధనసంపాదనకు అనుమతి పత్రం పొందడం కాదు. విద్యార్థి జీవితం అంటే భవిష్యత్తులో సాంఘిక సేవా పరమైన జీవితానికి తర్ఫీదు నిచ్చేది. అది ఆయన అభిప్రాయం. అదే ఆయన ధ్యేయం. ఆ ధ్యేయంతో గోపబంధు కలకత్తాలో కేవలం పుస్తక పఠనంతో సరిపెట్టుకోలేదు. కలకత్తా వీధుల్లో, సందుగొందుల్లో, ఒరియా వాళ్ళున్న చోట్లన్నీ వెతుకుతూ తిరగడం ఆయనకు అలవాటు. వాళ్లలో చాలామంది వంట వాళ్ళుగా, కూలీలుగా పని చేస్తూ జీవితాన్ని వెళ్ళబుచ్చుతున్నారు. వాళ్ళ స్థితిగతుల్ని అవగాహన చేసుకోవడమే తన కర్తవ్యంగా పెట్టుకున్నాడాయన. బెంగాలీ యజమానులు నీచ వృత్తుల్లో వుంటున్న ఈ ఒరియాలను చాలా హీనంగా చూసేవాళ్ళు. వీళ్ళలో ఒక సమైక్యత ఏర్పడితే తప్ప, వీళ్ళ పరిస్థితుల్ని మెరుగు పరిచే అవకాశం లేదని గోపబంధు గ్రహించాడు. 'ఐకమత్యమే బలము' అన్న సూత్రం విద్యార్థి దశనుంచీ తనకు మార్గదర్శక సిద్ధాంతమే. ఒరియావాళ్ళ బృందాలనూ సమాజాలనూ ఏర్పాటు చెయ్యడం ప్రారంభించాడు. చదువు చెప్పేందుకు రాత్రి పాఠశాలలను ఏర్పాటు చేశాడు. అటువంటి పాఠశాలల్లో ఒకటి 'గోపబంధునైట్ స్కూల్' పేర ఈ నాటికీ

కలకత్తాలో ఉన్నది. అది కలకత్తాలో నివసించే ఒరియావాళ్ల సామాజిక జీవనానికి ముఖ్యకేంద్రంగా ఉంటున్నది. ఆయన చెవుల్లో ఒరిస్సా రాష్ట్రం తనని పిలుస్తున్నట్లుగా సందేశం నిరంతరమూ మారుమ్రోగేది. ప్రియతమ జన్మభూమి ఒరిస్సా నుంచి దూరంగా ఉంటున్నా, అక్కడి సమస్యలు మాత్రం మరుపున పడిపోలేదు. మూడువందల మైళ్లలో ఉంటున్నా, అక్కడ వరదలు వచ్చాయన్న వార్త కలకత్తాలో తెలియగానే, స్నేహితులతో సహచరులతో కలసి వరద బాధితుల సహాయార్థం నిధుల్ని సేకరించేవాడు. ఇటువంటి సంక్షేమ కార్యక్రమాలు చేపట్టడమే కాకుండా, కలకత్తాలో విద్యార్థులుగా ఉంటున్న ఒరియా యువకులను కూడా శ్రద్ధగా కనిపెట్టేవాడు. పూనాలోని 'దక్కన్ఎడ్యుకేషన్ సొసైటీ' వలెనే విద్యాభివృద్ధి సంస్థనొకదానిని నెలకొల్పవలెనన్న నిశ్చయం చేసుకుని అందుకు సహకరించడానికి యిష్టపడిన వారితో తన పథకాన్ని గూర్చిన వివరాలు చర్చించడం ప్రారంభించాడు.

## హింసా విప్లవ వాదంతో భేటీ

1905లో కలకత్తా విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉండగానే ఆ ఏడు వేసవి సెలవుల్లో గోపబంధు భువనేశ్వర్ వచ్చి, తన బాల్యస్నేహితుడైన వసుదేవరథ్ యింట మకాంచేశాడు. గోపబంధు, వసుదేవ, యిద్దరూ ఒకప్పుడు పూరీ ముక్తియార్ అయిన రామచంద్రదాస్ వద్ద ఛాత్రులుగా ఉండిన విషయం పాఠకులకు విదితమే. భువనేశ్వర్‌లో తన ఛాత్రులిద్దరూ కలిసి సెలవు రోజులు గడుపుతున్నారన్న విషయం విని రామచంద్ర కూడా వారితో ఉండటానికి వచ్చాడు. గురువూ ఛాత్రులూ కలిసి ఉండిన చివరి తరుణం అది. రామచంద్ర తర్వాత అనతికాలంలోనే మరణించాడు. గోపబంధుకి అది తీరని లోటు. భువనేశ్వర్‌లో గడిపిన ఆసెలవురోజుల్లో రామచంద్ర, ఆయన ఛాత్రులూ, నగరం చుట్టుపట్ల ఉన్న చారిత్రక నిర్మాణాలనూ శిథిలాలనూ దర్శించారు. వారితో విద్యార్థులను బృందాలుగా తీసుకువెళ్ళి ఒరిస్సాపట్ల ఒరిస్సాపురాతన వైభవంపట్ల వారిలో ప్రేమాభిమానాలను పాదుకొల్పారు. ఈ సమయంలోనే గోపబంధుకి వంగదేశపు హింసా విప్లవవాదుల్లో ఒకరైన శశిభూషణ్ రాయ్ చౌధురితో పరిచయం కలిగింది. అతను భువనేశ్వర్‌లో ప్రయివేట్ ట్యూటర్‌గా పని చేస్తున్నాడు. అతని జీవనోపాధి అదికాదు. అది కేవలం అతని ముసుగు మాత్రకమే. ఆ ముసుగుతో శశిభూషణ్ ఒరిస్సా నుంచి హింసావాదుల్ని తయారు చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు. భువనేశ్వర్‌లో ఉంటూ శశిభూషణ్ శరీర వ్యాయామమూ, కర్రలతో కత్తులతో పోట్లాడటమూ యువకులు

అభ్యసించేందుకు ఒక కేంద్రాన్ని ఏర్పాటు చేశాడు. మిడ్నపూర్‌కు చెందిన విఖ్యాత విప్లవ కారుడు ఖుదీరామ్ అనుచరుడుగా శశిభూషణ్ ఒరిస్సా యువతలో విప్లవోత్సాహాన్ని రేకెత్తించేందుకు ప్రయత్నం చేశాడు. అతను గోపబంధు రామచంద్రలతో స్నేహం కలిపాడు. సుందర్ పారాకు చెందిన పండిత్ సుదర్శన్ నందా, పండిత్ వసుదేవరథ్ కూడా సహకరించగా, అందరూ కలిసి ఉమ్మడి ప్రయత్నంగా 'ఏకామ్ర అకాడెమీ' అనే పేరుతో హైస్కూలు నొకదాన్ని స్థాపించారు. జాతీయ పాఠశాల పద్ధతిలో దాన్ని ఏర్పాటు చేశారు. కాని ధనాభావం వల్ల కొన్ని సంవత్సరాల తర్వాత మూసి వెయ్యవలసి వచ్చింది.

తర్వాత, వంగదేశంలో వందేమాతరం ఉద్యమకారుల వలెనే ఒరిస్సాలో కూడా యువతలో ఒక ఉద్యమకారుల బృందం తయారై, వాళ్ళు రామకృష్ణ మిషన్ వాళ్ళకు మల్లే కాషాయవస్త్రాలు ధరించి గ్రామసీమల్లో 'స్వదేశీ' భావాన్నీ, విప్లవాన్నీ ప్రబోధిస్తూ సంచారం చెయ్యాలని గోపబంధు ఉద్దేశించాడు. సంఘసంస్కరణ వాదులుగా చలామణీ అవుతూ వాళ్ళు విద్య, సంఘసేవ, క్రీడ, శరీర వ్యాయామం వంటి వాటిని పెంపొందింప జేసే ప్రయత్నం చెయ్యాలి. ఆచార్య హరిహరదాస్, పండిత్ నీలకంఠదాస్, జగన్నాథ్ మహాపాత్ర, అనంత మిశ్రా మొదలైన వారు కొంతకాలం ఈ ప్రచారక భిక్షువులుగా ఉండినవాళ్ళే. రేవన్‌షా కాలేజీలో గోపబంధుకి స్నేహితుడైన వ్రజసుందర్ దాస్ కూడా ఈ బృందంలో చేర్చుకోబడ్డాడు. 1905లో లార్డ్ కర్జన్ వంగదేశ విభజన చేసినప్పుడు దానికి ప్రతికూలంగా పెచ్చురిల్లిన స్వదేశీ ఉద్యమాన్ని కలకత్తాలో స్వయంగా చూసినవాడు కాబట్టి గోపబంధుకి వంగ దేశ యువకుల దేశభక్తీ, విప్లవ కార్యాచరణమూ క్షుణ్ణంగా తెలుసు. అందువల్ల సంఘసేవాసక్తికి దేశస్వాతంత్ర్య పిపాస తోడై, మహాత్మాగాంధీ రంగంలో అడుగుపెట్టక పూర్వం పదిహేనేళ్ళ క్రితమే, గోపబంధు సంఘసేవ ద్వారానే ప్రజల్లో దేశభక్తిని ప్రేరేపించచేయాలనే మార్గాన్ని గుర్తించి దాన్ని ప్రచారంలోకి తెచ్చాడు. సంఘసేవ సాధనమై, గ్రామ పునర్నిర్మాణం జరిగితేనే పునరుజ్జీవన పరిణామం అనేది సాధ్యమవుతుంది.

1906లో గోపబంధు న్యాయశాస్త్రంలో డిగ్రీ పొందాడు. బి.ఎల్. పరీక్షలో ఉత్తీర్ణుడు కావడంతో ఆయన జీవితంలో ఒక అధ్యాయం ముగిసింది. తాను ఉత్తీర్ణుడైన వార్త వస్తుందని ఆతురతతో నిరీక్షిస్తున్న తరుణంలో అదే పోస్టులో ఆయన విజయవార్తతో పాటు భార్యమరణ వార్త కూడా వచ్చింది. రామచంద్రదాస్ సన్నిధిలో తాను స్వతంత్ర జీవనోపాధి కోరుతున్నట్లు ఆనాడు ప్రకటించాడు గాని, రామచంద్ర దాస్ ఈయన న్యాయవాద వృత్తి చేపట్టడం చూడకుండానే మృత్యువు వాత పడ్డాడు. కుటుంబంలో కలిగే సంసార బాధలను మించిన అవరోధం స్వతంత్ర

జీవనానికి మరొకటి ఉండబోదు. చూస్తే దైవేచ్ఛే అలా ఉన్నదా అని పిస్తుంది! ఆయనకు ఉండిన ఒక్క బంధమూ అంతటితో విడిపోయింది. అది స్వచ్ఛంద జీవితాన్ని కోరి ఆయన అందులో ప్రవేశించ బోయే తరుణంలో జరిగింది.

భార్యావియోగం సంభవించినప్పుడు గోపబంధు వయస్సు ఇరవై ఎనిమిదేళ్ళు మాత్రమే. పంద్రెండేళ్ల వైవాహిక జీవితంలో ఆయనకు ముగ్గురు కూతుళ్లూ, యిద్దరు కొడుకులూ కలిగారు. భార్య చనిపోయే నాటికే కొడుకు లిద్దరూ పోయారు. కూతుళ్లు సారంగిణి, కేతకి మాత్రమే మిగిలారు. వాళ్లిద్దరికీ తర్వాత వివాహాలు జరిగాయి.

ఇరవై ఎనిమిదేళ్ల యువకుడు మళ్లీ పెళ్లాడే ఉండవచ్చును. అన్నగారైన నారాయణతో బాటు ఆత్మీయులైన స్నేహితులు కూడా మళ్లీ పెళ్లి చేసుకోమనీ, పసివాళ్లయిన పిల్లల సంరక్షణ కోసరమైనా చేసుకోమనీ, ఆయన్ని బతిమలాడారు. కాని గోపబంధు చలించలేదు. ఒకసారి ఈ రెండవ పెళ్ళి విషయమై, రఘునాథరావు అనే మిత్రుడు (ఈయన 'భక్తకవి' మధుసూధనరావు అన్నకొడుకు), నారాయణ ప్రోత్సాహంతో గోపబంధు వద్ద ప్రస్తావించాడు, అతను చెపుతున్నంత సేపూ గోపబంధు గంభీరంగా మౌనం వహించాడు. రఘునాథ్ చెప్పడం పూర్తయ్యాక గోపబంధు అతణ్ణి ఇలా ప్రశ్నించాడు. ''ఆమెగాక నేనే మొదట పోయినట్లయితే నా భార్యను మళ్ళీ వివాహం చేసుకొమ్మని సలహా యిచ్చేవాడివేనా?'' దానికి రఘునాథ్ ''అదెట్లాసాధ్యం?'' అన్నాడు. వితంతు పునర్వివాహం ప్రసక్తే లేదు ఆ రోజుల్లో, గోపబంధు దృఢస్వరంతో మళ్లీ అన్నాడు ''ఆమె మళ్లీ పెళ్ళి చేసుకునే ప్రసక్తే లేకపోతే, నన్ను పెళ్ళి చేసుకొమ్మని మాత్రం ఎలా అడుగుతున్నావు?''

గోపబంధు సామాన్య మానవుడు కాడు. ఆయనలో అతీత మానవత్వం నిహితమై ఉండేది. ప్రాపంచిక జీవితానికి ఆయన ప్రాముఖ్యం యివ్వలేదు. ఇది 1904లో మిగిలిన ఒక్క కొడుకూ చనిపోయినప్పుడూ సువ్యక్తమైన సంగతి. దైల్ పరసాహిలో ఒక చిన్న యింటిలో గోపబంధు కొడుకు రోగగ్రస్తుడై మంచం పట్టి ఉన్నాడు. స్నేహితులూ, బంధువులూ ఎంతో మంది తనని ఊరడించడానికి వస్తూపోతూ ఉన్నారు. రఘుబాబు మరి కొందరూ ప్రక్కనే ఉన్నారు. ఆ సమయంలో ఒకవార్త చేరింది. దోవార్‌లో పెద్ద విపత్తుగా వరదలు వచ్చాయనీ, మనుష్యులు ఇంటి కప్పుల మీదా చెట్లకొమ్మల మీదా ఎక్కి పస్తులుండిపోయారనీ. ప్రజలకు వచ్చిన కష్టం గోపబంధుని నిశ్చేష్టుణ్ణి చేసింది. కొంత సేపు అలానే ఉండిపోయి కన్నీళ్లు పెట్టుకున్నాడు. ఉన్నట్లుండి స్నేహితులతో అన్నాడు. ''మిత్రులారా, నేను వరదలో చిక్కుకున్న వాళ్ళ దగ్గరకు వెళుతున్నాను. జబ్బుతో ఉన్న నా కొడుకు బాధ్యతను మీకు అప్పగిస్తున్నాను. ''దానికి వాళ్ళన్నారు ''గోపా,

నీకొడుకు నిట్లా ప్రమాదస్థితిలో జబ్బులో వదలి వెళ్లాలనుకోవడం, నీదెంత కఠినమైన మనస్సు! ఒకటి రెండు రోజులు ఆగివెళ్లు. ఈ విషమస్థితిలో కన్న కొడుకుని వదలి పెట్టి, ఏ తండ్రి వెళ్లగలడు?'' గోపబంధునిశ్చల కంఠంతో సమాధానమిచ్చాడు. ''చావు బ్రతుకులు మనిషి చేతుల్లో లేవు. అదిభగవంతుని సంకల్పం. నాకొడుకుని నేను ఆసర్వేశ్వరుని హస్తాల్లో ఉంచుతున్నాను. ఒక్క కొమారుని ప్రాణం రక్షించేందుకు నేనిక్కడ నిలబడిపోతే, వందలాది కొమారులు ఆ వరద వచ్చినచోట మరణిస్తారు. పుత్రశోకంతో నా గుండె తల్లడిల్లుతుందని మీరంటే, వందలాది తండ్రులకు అటువంటి వ్యధే కలిగించడానికి నాకేమి హక్కుఉన్నది? వాళ్లందరూ నావలె ఒక్కగానొక్క బిడ్డల్ని పోగొట్టుకోవడం లేదా? నా బిడ్డ పట్ల నా కున్న మమకారమే వాళ్ల పిల్లల పట్ల వాళ్లకూ ఉన్నదని మీరు గ్రహించాలి. నేను వెంటనే వెళ్లక తప్పదు.'' అలా చెప్పి, ఆయన యిల్లు వదలి వెళ్లిపోయాడు. ఆయన్ని అడుకోవడం స్నేహితుల తరం కాలేదు. కొందరు గోపబంధు అలా చెయ్యడాన్ని తీవ్రంగా విమర్శించారు. అనవసరంగా గొప్పలు పోయే ప్రవర్తనగా దాన్ని విమర్శించారు. సామాన్యులకు మహాత్ముడైన గోపబంధు, హృదయపు లోతుల్ని తరచడం ఎలా సాద్యం!

తల్లిదండ్రులు, భార్య, గురువు, పుత్ర సంతానం, అందరూ తనకు దూరమవడంతో ఆయన ఒంటరి వాడయ్యాడు. అటుపై స్వచ్ఛంద జీవన పథాన్ని అనుసరించాడు. చిన్న పిల్లలైన కొమార్తె లిద్దరినీ అన్నగారు నారాయణ సంరక్షణంలో ఉంచి, పూర్తిగా సేవకు అంకితమైన జీవితమే ప్రారంభించాడు. అదే ఆయన్ని ఆధునిక ఉత్కళ దేశపితను చేసింది. 'ఉత్కళమణి' అనే బిరుదు తెచ్చింది. ఆ బిరుదుని వంగ దేశపు ఆచార్య ప్రఫుల్ల చంద్రరాయ్ యిచ్చాడు. ఒరిస్సాలో యింటింటా గోపబంధు 'ఉత్కళమణి' గా వెలిశాడు.

# 4

# రాజకీయాలతో ప్రథమ పరిచయం

కటక్‌లో గోపబంధు విద్యార్థిగా ఉంటున్న సమయంలోనే మధుసూదనదాస్ 'ఉత్కళసమ్మేళని' లేక 'ఉత్కళ యూనియన్ కాన్ఫరెన్స్'ని సమావేశపరిచాడు. మధుసూదన దాస్ అంటే తర్వాతి రోజుల్లో ఒరిస్సాదేశపు కురువృద్ధుడుగా ప్రసిద్ధి చెందిన వ్యక్తి. సమావేశం యొక్క ఉద్దేశాలు – ఒరియా మాట్లాడే ప్రాంతాలు, ఆనాటి బెంగాల్, తమిళ నాడు (మద్రాస్), మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో చెదరిపోయి ఉన్నవాటిని సమైక్యం చెయ్యడం! ఆ ప్రాంతాలలో సామాజిక, సాంస్కృతిక చైతన్యాన్ని పెంపొందిస్తూ ఒరియా జాతీయతను ప్రతిష్ఠించడం. 1903లో ఉత్కళయూనియన్ కాన్ఫరెన్స్ పర్లాకిమిడిలో సమావేశమైనప్పుడు గోపబంధు విద్యార్థి నాయకుడుగా ఆ కార్యక్రమాల్లో పాల్గొన్నాడు. ఒరియా బాషాప్రాంతాల ఏకీకరణ విషయంలో అప్పుడు ఒరియా వాళ్లలో రెండు అభిప్రాయాలు వ్యక్తమయాయి. మధుసూదన్‌దాస్ నాయకత్వం వహించిన పక్షంవారు ఒరియా భాషాప్రాంతాల ఏకీకరణ, ఆ ప్రాంతాలు బెంగాల్‌లో విలీనం కావడం ద్వారా జరగాలని వాదించారు. అందుకు భిన్నంగా గోపబంధు, బెంగాలీలు అభివృద్ధి చెందినవాళ్ళు కావడం వల్ల ఒరియాలు బెంగాల్‌లో ఉండిపోతే, బెంగాలీల ఆధిపత్యమే కొనసాగుతూ ఉంటుందని వాదిస్తూ, ఆ ప్రాంతాల ఏకీకరణ అవి. మధ్యప్రదేశ్ రాష్ట్రంలో (ఆరోజుల్లో సెంట్రల్ ప్రావిన్సస్, బీరార్) విలీనం కావడం ద్వారా జరగాలని అభిప్రాయపడ్డాడు. కారణం, ఆ రాష్ట్రప్రజలు వెనుకబడి ఉండటం మూలాన, ఒరియాలకు వాళ్ళ మధ్యనైతే తమ వ్యక్తిత్వాన్ని నిలదొక్కుకోవడానికి అవకాశం ఉంటుందని ఆయన వాదం. ఈ అభిప్రాయాన్ని సభాముఖంగా అగ్రనాయకుల సమక్షంలో నిర్భీతితో ప్రకటించడమే కాకుండా, గోపబంధు అదే ధోరణిలో తన భావాలను ఆనాటి పత్రికల్లో వ్రాసి ప్రకటించాడు. అప్పటినుంచీ గోపబందు ఉత్కళయూనియన్ కాన్ఫరెన్స్‌కి సన్నిహితుడయ్యాడు.

విద్యార్థిగా గోపబంధు చాల నిరాడంబరంగా జీవించేవాడు. ఒరిస్సాలో చేనేత పరిశ్రమ అభివృద్ధి నాకాంక్షించి తను చెయ్యగలిగింది చేసే ఉద్దేశంతో, ఆయన చేనేతలో తయారైన ధోవతీ, చొక్కా ధరించేవాడు. కాలేజీలో చదువుకుంటున్న

రోజుల్లో ఒకసారి ఆచార్య హరిహరదాస్ ఆయన కోసరం రెండున్నర రూపాయలు పెట్టి స్వప్టలమైన రాణ్‌పూర్ నుంచి చేనేత బట్టలు ఒక జత తెచ్చియివ్వగా, గోపబంధు ఆ బట్టలు తనవంటి పేద విద్యార్థి ధరించదగిన వాటికంటె ఎక్కువ విలువైనవిగా ఉన్నాయని వాటిని ఉపయోగించలేదని చెబుతారు.

బి.ఏ. పరీక్షపాసైన తర్వాత ఆయన ఎం.ఏ. ఇంగ్లీషూ, ఎల్‌ఎల్.బీ, చదివేందుకు కటక్ రేవన్ షా కాలేజిలో చేరాడు. స్నాతకోత్తరవువిద్య (పోస్ట్‌గ్రాడ్యుయేట్ స్టడీస్) ని, అవసరాన్నిమించిన అదనపు సౌకర్యంగా బావించిన గోపబంధు, దానికోసరం తన అన్నగారి మీదగాని, శ్రేయోబిలాషుల మీదగాని ఆధారపడటం భావ్యం కాదని నిశ్చయించుకొని, స్వీయ సంపాదనతోటే చదువుకోదలిచాడు. ఆ సమయంలో ఆయనకు ప్రముఖ సాహితీ వేత్తలూ, విద్యాశాఖలో అధికార పదవిలో ఉన్నవారూ అయిన రాయ్‌బహదర్ రాధానాథ్ రాయ్, రాయ్ బహదర్ మధుసూదన రావులతో పరిచయం ఉండినది. గోపబంధుకి ప్రభుత్వంలో నౌకరి చెయ్యడం యిష్టం లేకపోవడంతో, తన ఎం.ఏ. చదువుకి స్విస్తి చెప్పి, న్యాయశాస్త్రం మీదే దృష్టి కేంద్రీకరించాడు. రేవన్‌షా కాలేజిలో ఏడాదిన్నర న్యాయశాస్త్రం చదివిన తర్వాత ఆయన మిగిలిన అధ్యయనం పూర్తి చెయ్యడానికీ, పరీక్ష వ్రాయడానికీ కలకత్తా చేరాడు. అక్కడ బారాబజార్‌లో ఒక బెంగాలీ పూటకూళ్ల యింటిలో బస చేశాడు. కలకత్తా విశ్వవిద్యాలయంలో చదివే విద్యార్థులూ, వేర్వేరు వాణిజ్య సంస్థల్లో ఉద్యోగాలు చేసుకుంటున్న వాళ్ళూ ఒరియా వాళ్లందరూ అక్కడే ఉండేవారు. కొంతమంది బెంగాలీలూ ఉండేవాళ్ళు. నాగరకతలో అభివృద్ధి చెందిన కలకత్తా నగరంలో నివసిస్తూ ఉన్నప్పటికీ, తన సాంప్రదాయిక ఒరియా పద్ధతుల్ని ఆయన విడనాడలేదు. గంగానదిలో స్నానం చేసివచ్చి, బసలో కూర్చుని, భగవద్గీత శ్లోకాలు పెద్ద గొంతుతో వల్లించేవాడు. బెంగాలీ స్నేహితులు కొందరు ఆయన చాదస్తుపు పోకడ చూసి విమర్శించినా, ఇతరులు ఆయన నిర్మల వర్తననూ, దేశాబిమానాన్నీ, పాండితీ గరిమనూ మెచ్చుకునేవారు. ఆరోజుల్లో బాగా చదువుకుని ఉన్నత పదవుల్లో ఉన్న బెంగాలీలకే, ఒరియా వాళ్ళంటే కేవలం ఒక జాతిగానే వాళ్లు వంట వాళ్లూ, కూలీలూ అనే అభిప్రాయం ఉండేది. గోపబంధుకిది తెలియగానే, వాళ్లతో ఆ విషయాన్ని చర్చించాడు. వాళ్లకు ఒరిస్సా గతవైభవ విశేషాలను వివరించి, ఆ అపోహల్ని పోగొట్టాడు. గోపబంధు చేసిన ఈ కృషి వల్లనే బెంగాలీ యజమానులు తమ క్రింద పనిచేసే ఒరియాలను మర్యాదతో చూడటం ప్రారంభించారు.

1904లో ఉత్కళ్ యూనియన్ కాన్ఫరెన్స్ కటక్‌లో సమావేశమైంది. రాయ్ బహదర్ రాజకిషోర్ దాస్ దాని ఆహ్వాన సంఘకార్యదర్శి. గోపబంధు స్నేహితులైన

బెంగాలీలు చాలమంది దానికోసం కలకత్తా నుంచి వచ్చారు. కాన్ఫరెన్స్ ఉన్నత లక్ష్యాలను గూర్చి విని వాళ్లు ఆ సమావేశానికి వచ్చారు. కాని కాన్ఫరెన్స్‌ని సమావేశపరిచే విషయంలోనే తీవ్ర భేదాభిప్రాయాలు తలెత్తాయి. అందులో ఒకవైపు ఒరియావాళ్ల నాయకుడైన మధుసూదన్‌దాస్. మరొక వైపు నేతాజీ సుభాష్ చంద్రబోస్ తండ్రి రాయ్ బహదర్ జానకీ నాథ్ బోస్. ఆయన ఒరిస్సాలో నివసించే బెంగలీవాళ్లకు నాయకత్వం వహించాడు. మధుబాబు ప్రోద్బలం వల్ల కాన్ఫరెన్స్ పందిరి లోకి బెంగాలీ వాళ్ల నెవ్వరినీ అడుగుపెట్ట నీకుండా కట్టడి జరిగింది. కాన్ఫరెన్స్ ముఖద్వారం దగ్గర గోపబంధు తన బెంగాలీ మిత్రులతో కనిపించగానే మధుసూదన్ కేక వేశాడు. ''బెంగాలీ వాళ్లను పందిరిలోకి ఎవరు ప్రవేశపెట్టారు? వాళ్ళిక్కడనుంచి వెళ్లి పోవాలి.'' ఇలాంటి సంకుచిత భావం అక్కడ వ్యక్తమైనందుకు గోపబంధు చింతించాడు. ఆయన దృష్టిలో అది జాతీయ సమావేశం. వెంటనే ఆయన తన స్నేహితులతో బాటు వెలుపలికి వచ్చేశాడు. కాన్ఫరెన్స్‌లో పాల్గొనలేదు. ఆ రోజే మదుసూదన్ పేర తన ఆగ్రహాన్ని వ్యక్త ంచేస్తూ లేఖవ్రాసి, దానితోబాటు సమ్మేళనానికి సంబంధించిన శిరస్త్రాణాన్ని కూడా త్రిప్పి పంపి వేశాడు. ఆ లేఖతో మదుబాబు తన పొరపాటు గ్రహించి, గోపబంధుకూ అతని స్నేహితులకూ క్షమాపణ చెప్పుకున్నాడు. మరుసటి రోజు కాన్ఫరెన్స్ ముఖద్వారం దగ్గర మధుబాబు గోపబంధులు కలుసుకున్నప్పుడు, ఇద్దరూ ప్రేమతో కౌగలించుకున్నారు. అలా గోపబంధు తన ధైర్యాన్ని, నిర్భీతినీ ఎంత పెద్దవారైనా, శక్తి మంతులైనా సరే, వారి నెదుర్కొగల నైతిక శక్తినీ, విద్యార్థి దశలోనే ప్రదర్శించాడు.

# 5

# న్యాయవాద వృత్తి

చదువు పూర్తికాగానే గోపబంధు ఒక అంతస్సంఘర్షణలో పడ్డాడు. తనగురువైన రామచంద్రదాస్‌కి ఎప్పుడో మాటయిచ్చాడు, సాంఘిక సేవకూ, స్వచ్ఛంద జీవితానికీ అంకిత మవుతానని, అందుకే న్యాయవాద వృత్తికి తగిన చదువుకూడా చదువుకున్నాడు. కాని బోధనా వృత్తి అన్నింటి కంటె ఆయనకు యిష్టమైనది. విద్యార్థి దశలోనే దక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీ పద్ధతిలో ఒక స్వతంత్ర సంస్థను ఏర్పాటు చేసి, విద్యావ్యాప్తికి కృషి చెయ్యాలని ఆలోచించాడు. యువమేధావులు చాలమంది ఆయనను సమర్థించారు. జాతీయతా భావన భూమికగా ఏర్పాటు చేసే అలాంటి విద్యా సంస్థలో ఖర్చుతో కూడిన భవన నిర్మాణం అసాధ్యమని గోపబంధు గుర్తించాడు. అది అనవసరం అనికూడా గ్రహించారు కూడా. ఒరిస్సావంటి పేద ప్రాంతంలో ఖర్చుతో కూడిన భవన నిర్మాణం అస్థ్యామని గోపబంధు గుర్తించాడు. అది అనవసరం అని కూడా గ్రహించాడు. గ్రామీణ పరిసరాల్లో పాఠశాలలు నెలకొల్పితే, ఎక్కువ ఖర్చు లేకుండా ప్రకృతి సుందర దృశ్యాల మధ్య విద్యాబోధన చేయవచ్చు. నాటి సామాజిక వ్యవస్థ ఆమోదిస్తున్న విద్యా ప్రయోజనాలను ఆయన గ్రహించాడు. ఒక ప్ల్యాన్ కొడుకు పదకొండవ తరగతి వరకు చదువుకోగానే, తనతండ్రి ఉద్యోగం చేపట్టడంగాని, వ్యవసాయం చేస్తూ గ్రామంలో ఉండిపోవడంగాని, నీచంగా భావించి విముఖత చూపుతూండడం, విద్యపట్ల ఆయన అభిప్రాయాల్ని బలపరిచింది. యూరపియను పద్ధతుల్లో నడిచే విద్యాలయాల్లో సగంసగం చదువులు చదివి తయారవుతున్న బాబులు (గుమాస్తాలు) తమ సాటి ప్రజలతో కలసి ఉండటానికీ, వారి ఆశల పట్ల సానుభూతి చూపటానికీ యిష్టపడక పోవడం, కాయకష్టమంటే ఏవగించుకోవడమూ ఆయన గమనించాడు. అందువల్ల విద్యను చేపట్టాలని ఆయనకు ప్రథమంగా అభిమానం ఉండేది. ఒక విద్యాసంస్థను నడిపే అనుభవం గడించాలని కుతూహలం ఉండేది.

అదృష్టవశాత్తూ, నీలగిరి అనే స్వదేశీసంస్థానంలో కొత్త విద్యా సంస్థను ప్రారంభించే ప్రతి పాదన ఒకటి వచ్చింది. దాన్ని స్థాపించదలచుకున్నవారు పట్ట

భద్రుడైన హెడ్ మాస్టరు కోసరం గాలిస్తూ గోపబంధు దగ్గరకు రాగా, ఆయన ఉమాచరణ దాస్‌ని సూచించాడు. దాస్ హెడ్ మాస్టరుగా చేరాడు. అక్కడే హరిహరదాస్ (ఇప్పుడు ఆచార్య హరిహర్) వెళ్లిరెండవ మాస్టరుగా చేరాడు. హరిహర్ క్రమశిక్షణలో గట్టి విశ్వాసం కలవాడు. విద్యార్థులకు ప్రాచీన 'గురుకుల' పద్ధతుల్లో శిక్షణ గరపాలనీ ఆయన కెన్నో ఊహలుండేవి. కాని ఆ ఊహల్ని ఆచరణలో పెట్టే ప్రయత్నం అభివృద్ధి చెందని ఆ ప్రాంతంలో చెయ్యడం, హెడ్ మాస్టరు ఉమాచరణ్‌కి నచ్చలేదు. అందువల్ల అసమ్మతిని సూచిస్తూ ఆయన తన పదవికి రాజీనామా యిచ్చి, డిప్యూటీ కలెక్టరు ఉద్యోగంలో చేరిపోయాడు. గోపబంధు మొదటి నుంచి సంస్థతో సంబంధం కలిగి ఉన్నవాడవటం చేత, స్వయంగా ఉమాచరణ్ స్థానంలో తానే హెడ్ మాస్టరు అయాడు. ఆరు నెలల పాటు ఆ పదవి నిర్వహించాడు. ఆ సమయంలో పాఠశాలను స్థిరపరచడానికి ఆయన శక్తి వంచన లేకుండా ప్రయత్నించాడు. కాని ఆ కృషి ఫలించలేదు. కారణం అప్పుడు ఒరిస్సాలోని స్వదేశీ సంస్థానాలకు పొలిటికల్ ఏజెంట్‌గా ఉండిన కోబ్డెన్ రామ్సే అడ్డురావడమే. గోపబంధు దీక్షకు విరామం లేదు. రాష్ట్రాన్ని ప్రగతి పథంలో నడిపేందుకు ఆయనకు ఒకటే కాదు, ఎన్నో పథకాలు. ఒకానొక సంస్థానంలోని హైస్కూలు అందుకు అల్పపరిధి. అయన విస్తృత కార్యకలాపాలకు తగిన రంగంకాదు. ఆరు నెలలు అక్కడ కృషిచేసిన తర్వాత తిరిగివచ్చి ఆయన కటక్‌లో న్యాయవాద వృత్తి ప్రారంభించాడు.

నీలగిరిలో ఉంటున్న రోజుల్లోనే ఆయన ఆచార్య హరిహర్‌తో కలిసి ఒక స్వచ్ఛంద సేవాదళాన్ని ఏర్పాటు చేశాడు. ఒకసాయంత్రం వారిద్దరూ వాహ్యాళికి వెళుతుండగా, దారిప్రక్కన వారికొక ముసలమ్మ చాల దీనావస్థలో కనిపించింది. ఆమెది ఆ ఊరుగాదు. పూరీ యాత్రవెళ్ళి తిరిగి వస్తున్నది. కొడుకు చిన్న వయసువాడు, కలరా తగిలి మరణించాడు. ప్రక్కన ఆమె ఏడుస్తూ కూర్చున్నది. గోపబంధు హరిహరులు ఆమె వృత్తాంతం తెలిసికొని ఆమె కొడుకు మృతదేహానికి అగ్ని సంస్కారం జరిగే ఏర్పాట్లు చేశారు. కులం పోతుందన్న భీతితో ఆమె వాళ్లను శవాన్ని తాక నివ్వలేదు. అందుచేత ఆ దేశాభిమానులిద్దరూ దహన సంస్కారానికి కావలసిన వస్తువుల్నీ కట్టెల్నీఆ చోటుకే చేరవేసి, దారిప్రక్కనే చితి పేర్చి ముట్టించి, ఆముసలమ్మనే స్వయంగా శవాన్ని చితిలో పెట్టమని చెప్పారు. అటుపై ఆవిడకు అనునయ వాక్యాలతో దుఃఖోపశమనం కలిగించి, కొంత ధనసాహాయ్యం అందజేసి, ఆమె తన దారిన తాను వెళ్లేలా తోడ్పడ్డారు. గోపబంధు హరిహరులు చేసిన యీ పని నీలగిరి లోని ఛాందస బ్రాహ్మణ వర్గానికి సహింపరాని దయింది. వాళ్ల దృష్టిలో అది క్షమింపరాని పాతకం. ఊరూ పేరూ తెలియని ఆగంతుకుని

శవానికి అగ్ని సంస్కారం చెయ్యడం కారణంగా వీళ్లని పంక్తి బాహ్యులను చేశారు. ఆ బ్రాహ్మణ వర్గం కుతంత్రాలకు జడిసిపోకుండా వీళ్ళు తమ సేవా కార్యక్రమాన్ని యథావిధిగా సాగిస్తూనే వచ్చారు. తర్వాత తర్వాత ఆ బ్రాహ్మణులే తమ ప్రవర్తనకు సిగ్గుపడి గోపబంధుకి క్షమాపణలు చెప్పుకున్నారు. నీలగిరిలో ఉండిన ఆ కొద్ది కాలంలోనే గోపబంధు సంస్థాన ఉద్యోగులలో కొందరికి సంఘసేవా ప్రవృత్తీ, జాతీయతా అలవడేటట్లు చేయగలిగాడు. నీలగిరిలో ఉంటున్న రోజుల్లోనే, గోపబంధు, హరిహర్, మరికొందరు ఒరిస్సా నుంచి ప్రతినిధులుగా ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ వార్షిక సమావేశానికి కలకత్తా వెళ్ళారు. ఆ సమావేశానికి దాదా భాయ్ నౌరోజీ అధ్యక్షుడు. అధ్యక్షోపన్యాసంలో ఆయన 'స్వాతంత్ర్యమే కాంగ్రెస్ లక్ష్యం' అన్నాడు. ఆ ప్రకటన గోపబంధుని ఎంతగానో ఆకర్షించింది. తక్షణమే కాంగ్రెస్‌తో తన సంబంధాన్ని కొనసాగిచాలనే దృఢనిశ్చయానికి వచ్చాడు. గోప బంధు నీలగిరిలో ఉంటున్నప్పుడే ఆయనకు భార్య మరణ వార్తా, న్యాయ శాస్త్ర పరీక్ష పాసైన వార్తా, రెండూ ఒకసారే అందేయి.

1906లో గోపబంధు నీలగిరి వదలి కటక్ చేరి న్యాయవాద వృత్తి ప్రారంభించాడు. కొంతకాలం మధుసూదనదాస్, గోకులానంద చౌధురి, వైకుంఠనాథ దత్త వంటి ఆనాటి ప్రముఖ న్యాయవాదుల దగ్గర జూనియర్‌గా పనిచేశాడు. తన వృత్తి ధనాన్ని ప్రసాదిస్తున్నప్పటికీ, ఆర్తులైన వారిని ఆదుకోవడానికి తగిన అవకాశం యివ్వడం లేదని ఆయనకు అసంతృప్తిగా ఉండేది. ఆ ఏడాది ఆగస్టులో వరదల వల్ల చాల నష్టం సంభవించింది. బ్రాహ్మణి, వైతరణి, ఖారసోర్ నదులు భయంకరంగా పొంగాయి. ఫలితంగా కటక్ జిల్లాలోని జాజ్‌పూర్ కేంద్రపారా తాలూకాల్లో చాల భాగాలు సర్వ నాశనం పొందేయి. అసంఖ్యాకంగా యిండ్లూ, మనుష్యులూ, పశుసంపదా నష్టమయాయి. వరదల భీభత్సాన్ని గూర్చిన హృదయవిదారక గాథలు గోపబంధుని విచలితుణ్ణి చేశాయి. వెంటనే ఆహారమూ, బట్టలూ సేకరించే పని ప్రారంభించి, రేవన్‌షా కాలేజి విద్యార్థులను స్వచ్ఛంద సేవకులుగా సమకూర్చుకొని ఆయన వరద ప్రాంతాలకు తరలి వెళ్లాడు. వరదలు కలిగించిన అపారనష్టాన్నిచూసి ఆయన హృదయం క్షోభించింది. వరద బాధితులకు తాత్కాలిక సాహాయం ఒక్కటే పరిష్కారం కాదని ఆయన గుర్తించాడు. వాళ్ళు భవిష్యత్తుని ధైర్యంగా ఎదుర్కోవాలంటే, మళ్ళీ పంట చేతికి వచ్చేదాకా వాళ్లని ప్రాణాలతో నిలిపి పోషించే ఏర్పాటు కూడా ఒకటి జరగాలి. ఈ లక్ష్యంతో కేంద్ర ఉత్కళ యువక సమాజాన్ని ఆయన స్థాపించాడు. దానికి రేవన్‌షా కాలేజి ప్రిన్సిపాల్ అయిన ఆర్. షా అధ్యక్షుడు. తాను ప్రధాన కార్యదర్శి. ఆ సమాజం లక్ష్యాల్లో శరీర వ్యాయామమూ, నైతిక ప్రబోధమూ, ఆర్థికాభివృద్ధీ, సాహిత్యవికాసమూ

చేరేయి. ఒక్కొక్క దానికి ఆయా విభాగాలకు కార్యదర్శులను నియమించారు. వీరుగాక సమాజాన్ని మొత్తం మీద నడిపిస్తూ పర్యవేక్షించేందుకు మరొక కార్యదర్శి నియమింప బడ్డాడు. ఆ సమాజమే ఒరిస్సాలో వివిధ ప్రాంతాలలో బాధితులకు సాహాయ్యాన్ని సమకూర్చే కేంద్రంగా పనిచేయాలని ఉద్దేశించారు. పడకకుర్చీలో కూర్చుని కబుర్లు చెప్పే రాజకీయవాదుల సంస్థగా రూపొందలేదీ సమాజం. గోపబంధు ఒరిస్సాలో అన్ని ప్రాంతాలలో, అన్ని హైస్కూళ్లలో ఈ సమాజానికి శాఖల్ని ఏర్పాటు చేశాడు. ఈ సమాజం తర్వాత చాలా ఏళ్ల విద్యార్థుల కార్యక్రమాలకు కేంద్ర సంస్థగా పని చేస్తూనే వచ్చింది. కటక్ వదలి వెళ్లి పోయిన తర్వాత కూడ గోపబంధు ఈ సంస్థతో తన సంబంధం వదలుకోలేదు. తాను ఎక్కడ ఉంటున్నా సమాజ కార్యక్రమాలకు మార్గదర్శకత్వం వహిస్తూనే వచ్చాడు.

వరదలు సృష్టించిన పరిస్థితులు ఆయన్ని, కలవరపెట్టేయి. ఆయినా, మధుసూదనదాస్, కలకత్తాలోని, 'స్టేట్స్‌మన్' పత్రికకు పంపిన వివరాలు ప్రకటింపడగానే, దేశం నలుమాలలా దిగ్భ్రాంతి వ్యక్తమైంది. దేశం వివిధ ప్రాంతాల నుంచీ కారుణ్యస్వభావులు, దాతలు స్వయంగా వచ్చి పరిస్థితి చూసి సాయాన్ని ఎన్నో రూపాల అందజేశారు. కాని సువ్యవస్థితమూ, సుస్థిరమూ అయిన ఒక ఏర్పాటు రూపొందించడం కూడా అప్పటి అవసరమే. ఆ సమయంలో పూరీలో ఉత్కళ యూనియన్ కాన్ఫరెన్స్ సమావేశం జరిగింది. 1908 ఏప్రిల్ 8 తేదీన ఆసమావేశంలో గోపబంధు ఈ క్రింది తీర్మానం ప్రవేశపెట్టాడు.

''విపరీతమైన వరదలు కారణంగా ఒరిస్సాలో సర్వత్ర ఏర్పడిన క్షామం దృష్ట్యా, ఈ కాన్ఫరెన్స్ పదిమంది సభ్యులతో ఒక కమిటీని ఏర్పాటు చేస్తూ, వారికి అదనంగా సభ్యులను చేర్చుకునే అధికారం ఇస్తూ, శాశ్వతమైన నివారణోపాయాలనూ, పరిష్కార మార్గాలనూ కమిటీ రూపొందించవలెనని తీర్మానించడమైనది.''

# 6

# మయూర్ భంజ్ సంస్థాన న్యాయవాది

ఒరిస్సాలోని స్వదేశీ సంస్థానాలు యిరవై నాలుగింటిలో మయూర్ భంజ్ అన్నింటికన్నా పెద్దది. దాని పాలకులు సూర్య వంశ రాజులు. బెంగాల్ రాష్ట్రానికి చేరువలో ఉండటం వల్ల, ఆ సంస్థానంలో బెంగాలీ మాట్లాడే వాళ్లే అధికార పదవుల్లో ఉంటూ వచ్చారు. ఇరవయ్యో శతాబ్ది ప్రథమ భాగంలో మహారాజ శ్రీరామ భంజ్ దేవ్ వంటి ఉదార దృక్పథంగల వ్యక్తి రాజ్యాధి పత్యం వహించడం, అది సంస్థానం చేసుకున్న అదృష్టమే. అభివృద్ధిని గూర్చి ఆయన కెన్నో ఊహలు. ప్రజ్వలించే దేశాభిమానం ఆయన్ని ఉత్కళయూనియన్ కాన్ఫరెన్స్‌ని సంఘటిత పరచడంలో కార్యదీక్ష వహించేలా చేసింది. ఒరిస్సాకు చెందిన ఆ సంస్థానంలో బెంగాలీలు ఉద్యోగులుగా ఉండటం, కాలదోషం పట్టిన ఒక అసంగత విషయంగా ఆయన గుర్తించాడు. కాని విద్యావంతులైన ఒరియాలు అప్పట్లో చాలా తక్కువ సంఖ్యలో ఉండటంచేత, ఆయనకు బెంగాలీలనే నియమించక తప్పిందికాదు.

1909లో కటక్‌లో పేరు మోసిన న్యాయవాది మదుసూదన దాస్, మహారాజాకు రాజకీయ సచివుడుగా ఉంటూ రాజావారికి ఒక నివేదిక సమర్పించాడు. మయూర్‌భంజ్ ముఖ్యపట్టణ మైన బారిపాడాలో బెంగాలీల ప్రాబల్యం కారణంగా ప్రజలలో చాలా అసంతృప్తి వ్యాపించిందని తెలియజేస్తూ, ఒరియావారిలో అర్హతలున్నవారికి పై ఉద్యోగాలలో ప్రథమంగా స్థానం కల్పించాలని ఆయన రాజాతో చెప్పి ఒప్పించారు. ఆ సమయంలో ప్రభుత్వ న్యాయవాది పదవి ఖాళీ ఏర్పడటంతో, ఒక ఒరియా న్యాయవాదిని ఆ ఉద్యోగానికి ఎంపిక చేయవలసిందని మహారాజా మధుబాబుని కోరాడు. మధుసూదనదాస్ ప్రోద్బలంవల్ల గోపబంధు పూరీలో తన న్యాయవాద వృత్తిని మానుకొని బారిపాడాలో ప్రభుత్వ న్యాయవాదిగా ఉద్యోగంలో చేరాడు.

పూరీలో అప్పటికీ ఆయనకు మంచి ప్రాక్టీసే ఉండేది. ఒరియా లాయర్ల సంఖ్య పూరీలో చాల తక్కువ. తనుకావాలనుకుంటే గోపబంధు ఎంతో రాబడిగల ప్రాక్టీస్‌ని సంపాదించుకొని ఉండవచ్చును. కాని అంతకంటె సంఘసేవ పట్ల ఆయనకు నల్లమాలిన అభిరుచి. న్యాయవాద వృత్తి 'ఆయన వింటికి రెండవ నారి'

లాంటిది మాత్రమే. ఎవరైనా ఒక పార్టీ యింటికి వస్తే, అతని కేసేమిటో తెలుసుకుని వకాల్తా పుచ్చుకునే బదులు, కోర్టుకు వెళ్లి వ్యవహారాల్లో ధనవ్యయం చేసే ప్రవృత్తి మానుకొమ్మని నచ్చజెప్ప ప్రయత్నించేవాడు. నిజాయితీ, సత్ప్రవర్తన అనేవి సంపద, అధికారం కంటె ఉన్నతమైన విలువలు గోపబంధు దృష్టిలో. ఒకసారి ఏమి జరగిందంటే, ఆయన కక్షిదారుల్లో ఒకరు, నేరంలో నిందితుడు, పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కి సిపారసు చేయించుకొని, అతణ్ణి తనపక్షం తిప్పుకున్నాడు. అది గోపబంధుకి తెలియకుండా చేశాడు. ఆసంగతి ఆయన చెవిలో పడగానే, ఆయన ఆ వ్యక్తి వకాల్తా తిరగ్గొట్టడమే కాకుండా, డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్‌కి ఒకరహస్యలేఖ ద్వారా పబ్లిక్ ప్రాసిక్యూటర్ పార్టీకి లోబడిన విషయం తెలియ జేశాడు. దానితో ఆ పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఉద్యోగం పోయింది. అతనికి ఆ ఉద్యోగాన్ని మళ్లీ పొందే అర్హత కూడా లేకుండా పోయింది.

సంఘసేవపట్ల గోపబంధుకు గల అభినివేశం డిస్ట్రిక్ట్‌మేజిస్ట్రేట్ దృష్టికి వచ్చింది. ఆయన స్థానిక కుష్ఠురోగుల శరణాలయానికి కార్యదర్శిగా పనిచేయమని గోపబంధుని ఆహ్వానించాడు. ఏ కార్యభారాన్ని వహించినా సరే, దాన్ని నిజాయితీతో, మనస్ఫూర్తిగా నిర్వహించడం గోపబంధు జీవిత మార్గసూత్రాలలో ఒకటి. కుష్ఠశరణాలయం కార్యదర్శిగా నియమితుడు కాగానే, చందాలు పోగుచేసి ఆసంస్థకు ఆయన సుస్థిరత చేకూర్చాడు. తన సంపాదనలో కొంతభాగాన్ని ఆ శరణాలయం మూలనిధి ఏర్పరచేందుకు సమర్పించాడు. ఈ కార్యకలాపాల వల్ల ఆయన మునిసిపల్ కౌన్సిలర్‌గా నియమితుడయ్యాడు. సాక్షిగోపాల్ దేవాలయ ధర్మకర్తల సంఘంలో ఆయనకు సభ్యత్వం లభించింది. విద్యార్థులకు శరీర వ్యాయామంలో శిక్షణ నిచ్చే గరిడీ నొకదాన్ని ఆయన ఏర్పాటు చేశాడు. పూరీలో తాను ఉండిన కాల్ ముగిసేనాటికి, సాక్షి గోపాల్‌లో ఒక హైస్కూలు నెలకొల్పడానికి పూనుకొని, 1909 ఆగస్టు 12 తేదీన అందుకు ప్రారంభ చర్యగా ఒక మిడిల్ ఇంగ్లీషు స్కూల్‌ను స్థాపించాడు. పందొమ్మిది మంది విద్యార్థులతో, తాను కార్యదర్శిగా ఆ స్కూల్ ప్రారంభమైంది. నిజంగా యిది సత్యవాది నికుంజ విద్యాలయ మహోద్యమానికే నాందీ ప్రస్తావన అని చెప్పాలి. ఆ ఉద్యమం ఒరిస్సా జాతీయ జీవనం మీద మహత్తర ప్రభావాన్ని చూపింది. ఏడాదిన్నర కాలం పూరీలో ప్రాక్టీస్ తర్వాత గోపబంధు మధు సూదన దాస్ ఆదేశాన్ని తలదాల్చి బారిపాడాలో ఉద్యోగంలో చేరేందుకు వెళ్లాడు.

మయూర్‌భంజ్‌లో గోపబంధు వ్యక్తి కాదు, వ్యవస్థే అయాడు. ఉద్యోగం సంస్థాన న్యాయవాదిగా మాత్రమే అయినప్పటికీ, అక్కడ ప్రతి విషయంలోనూ

ఆయన ఎరుగును. బారిపాడా చేరిన కొన్ని రోజులకే స్థానిక హైస్కూలు విద్యార్థులతో పరిచయం ప్రారంభించాడు. అదృష్టవశాత్తూ ఆ స్కూలు ప్రధానోపాధ్యాయుడైన శైలేంద్రనాథ్ సర్కార్ గోపబంధు వలెనే సాంఘిక సంక్షేమ కార్యక్రమాలపై బహుప్రీతి కలవాడు. గోపబంధు శైలేంద్రులు కలిసి మయూర్ భంజ్ యువతలో సంఘసేవ పట్ల అభినివేశం పెంపొందించే కృషి ప్రారంభించారు.

గోపబంధు మయూర్ భంజ్‌లో ఉండిన కాలంలో అనగా 1910మే నెలలో, మహారాజా శ్రీరామ భంజ్ దేవ్ ప్రపంచ పర్యటన వెళ్లడానికి ఉద్దేశించాడు. ప్రజలకు తమరాజా మీదా గల ప్రేమాభిమానాలు కారణంగా ఆయన తమని వదలి విదేశాలలో పర్యటించడం వాళ్లకు నచ్చలేదు. కాని గోపబంధు అభిప్రాయం అందుకు భిన్నంగా ఉంది. మహారాజా ప్రపంచంలోని అభివృద్ధి చెందిన దేశాల్ని వెళ్ళిచూస్తే, తన రాజ్యంలో సంస్కరణలు ప్రవేశ పెట్టే ఉద్దేశాలు ఆయనకు కలుగుతాయని గోపబంధు అభిప్రాయపడ్డాడు. అందుచేత మహారాజాను తన పథకం ప్రకారం వెళ్లమని ప్రోత్సహించి, ఆయనకు చక్కని వీడ్కోలు ఏర్పాటు చేశాడు. మహారాజా తరిగి వచ్చినప్పుడు కూడా అలాగే ఒక స్వాగతసమావేశాన్ని ఏర్పాటు చేశాడు.

మహారాజాకు తమ సంస్థాన న్యాయవాది అంటే విశేష గౌరవం. గోపబంధు దాస్ నిజాయితీ, విశ్వాసపాత్రత, స్వార్థత్యాగనిరతి, దేశాభిమానం ఆయన్ని ముగ్ధుణ్ణి చేశాయి. ఒకసారి గోపబంధు ఎదుటే ఆయన అన్నాడు. ''ఎంతో కాలానికి మీవంటి నిజాయితీ పరుడైన సలహాదారు లభించినందుకు నేను సంతోషిస్తున్నాను.'' ఈ గౌరవభావం, పూర్తి నమ్మకం, తమ న్యాయవాది మీద ఉండటం వల్లే, మహారాజా ఎన్నో రాజకీయ పరమైన సంస్కరణలను, గోపబంధు సలహామీద, తన సంస్థానంలో ప్రవేశ పెట్టాడు. తత్ఫలితంగా చాల కాలం మయూర్ భంజ్ స్వదేశీ సంస్థానాలలో ఆదర్శ ప్రాయమై వెలుగొంద గలిగింది. ఒక శాసన సభ, ఒక మంత్రివర్గమూ (కేబినెట్) ఏర్పాటయ్యాయి. గోపబంధుకి రెండింటిలోనూ సభ్యత్వం కల్పించాడు మహారాజా. గోపబంధు బారి పాడాలో ఉద్యోగుల వర్గంలో ఉండిన కాలుష్యాన్ని పోగొట్టి నైర్మల్యాన్ని నెలకొల్పి, సంస్థాన సేవకులందరిలో కర్తవ్య నిర్వహణలో నిర్భయత్వాన్ని పెంపొందించే ప్రయత్నం చేశాడు. ప్రజలు గ్రుడ్డిగా ఆజ్ఞాపాలన చెయ్యడమూ, వారి బానిసత్వపు లొంగుబాటూ సత్పరిపాలన లక్షణాలు కావు. మెచ్చుకోదగిన పని జరిగి నప్పుడు దాన్ని గుర్తించి సత్కరించే శక్తి విజ్ఞాన సంపన్నుడైన మహారాజా లోనూ పుష్కలంగా ఉంది. అందువల్ల గోపబంధు మూలంగా పరిపాలన పూర్తిగా

సంస్కరింపబడి, ప్రజలు కొత్తరకం జీవితాన్ని చవిచూడసాగారు.

మయూర్ భంజ్‌లో యితర జీవిత రంగాలపై కూడా గోపబంధు ప్రభావం మహత్తరంగా గోచరమైంది. ఒరిస్సాలోని అన్ని ప్రాంతాల నుంచి ఆయన మేధావుల్ని ఆకర్షించాడు. అప్పుట్లో కలకత్తా విశ్వవిద్యాలయంలో విద్యార్థులుగా ఉంటూ, తర్వాతి కాలంలో సుప్రసిద్ధులైన పండిత్ నీలకంఠదాస్, పండిత్ గోదావరీశ్ మిశ్రా, పండిత్ కృపాసింధు మిశ్రా వంటి వారు తరుచు బారి పాడా వచ్చి, గోప బంధు ప్రారంభించిన కార్య కలాపాల్లో పాల్గొంటూ ఉండేవారు. యంగ్ ఉత్కళ్ ఎసోసియేషన్ ఆధ్వర్యంలోనూ, హైస్కూలు డిబేటింగ్ క్లబ్‌లోనూ, యిలా వచ్చిన పండితులు విజ్ఞాన ప్రదమైన ప్రసంగాలు చేసేవారు. అందుమూలంగా వాళ్లకూ మయూర్ భంజ్ సంస్థానానికి ఒక అనుబంధం ఏర్పడింది. విద్యార్థులు తరుచువచ్చి గోపబంధుతో తమ సమస్యలు చర్చించేవారు. ఆయన యింట్లో వాళ్లు యదేచ్ఛగా ప్రవేశించ గలిగేవారు, నిర్ధనులై అర్హతలున్న విద్యార్థులకు ఆయన సొంత ఖర్చుమీద కొందరికీ, సంస్థానం ఖర్చుమీద కొందరికీ, చదువు చెప్పించే ఏర్పాటు చేశాడు. బారిపాడాలో ఒక అనాథ శరణాలయం స్థాపించి, దాన్ని క్రమ పద్ధతుల్లో అభివృద్ధి పరచేందుకు ఆయన తన చిన్ననాటి గురువైన పండిత్ సదాశివ మిశ్రాను పర్యవేక్షణాధికారిగా నియమింప జేశాడు. సత్యమూ, నిజాయితీ, వీటిపట్ల ఆయన కున్న గౌరవాన్ని ఈ క్రింది సంఘటన తెలియజేస్తుంది. బారి పాడాలో ఉన్న ఆ రోజుల్లోనే, ఒక డాక్‌బంగ్లాకు చెందిన చౌకీదారు దొంగ తనం నేరం మీద ప్రాసిక్యూట్ చేయబడినట్లు ఆయనతో తన గోడు చెప్పుకున్నాడు. అది వినగానే గోపబంధు తాను ప్రభుత్వ న్యాయవాది అయినప్పటికీ ప్రాసిక్యూషన్ వదలి పెట్టి, ఆ వ్యక్తి కేసుని ముద్దాయి తరఫులాయర్‌గా, డబ్బుతీసుకోకుండా చేపట్టి స్వయంగా నడిపించాడు. అలా చేసేందుకు కావలసిన గుండె ధైర్యం, అది కేవలం గోపబంధు ఒకడి సొమ్మే అని చెప్పుకోవాలి.

గోప బంధుని వివాహానికి సుముఖుణ్ణి చెయ్యడానికి మళ్ళీ ప్రయత్నం జరిగింది. ఈ సారి ఆయన మనసుకు నచ్చేవాదాన్నే అందు కోసం ప్రయోగించారు. ఆయనకు మొదటినుంచి పరిసర రాష్ట్రాలలో చెదిరిపో ఉన్న ఒరియా భాషా ప్రాంతాలను సమైక్యపరిచే ఉద్యమంమీద ఎంతో మక్కువ. సింగ్‌భూమ్. మిడ్నపూర్ జిల్లాల్లో ఒరియా మాట్లాడే ప్రజలు ఎక్కువ సంఖ్యలో ఉన్నప్పటికీ, ఒరియావాళ్లతో సంబంధాలు లేక పోవడం మూలాన, ఆప్రాంతాల ప్రజలు ఒరియా భాషను, సంస్కృతినీ మరచిపోయే స్థితికి వచ్చారు. అలాగే చాలా కాలం కొనసాగితే, పరిస్థితి విషమించి సింగ్‌భూమ్, మిడ్నపూర్ జిల్లాలు భవిష్యత్తులో రూపొందే ఒరిస్సా రాష్ట్రంలో అసలు చేరకుండానే పోవచ్చు నన్న

భయం కూడా కలిగింది. అందుచేత ఆ ప్రాంతాల ప్రజలకు ఒరస్సా ప్రజలకూ సంబంధ బాంధవ్యాలు, వివాహం రూపేణాకూడా కల్పించడం అవసరమని గోపబంధుకి నచ్చ చెబుతూ, ఆయనే మిడ్నపూర్ నుంచికాని, సింగ్‌భూమ్ నుంచీకాని, ఒక అమ్మాయిని పెళ్ళిచేసుకుని, మార్గదర్శకత్వం వహించాలని మిత్రులు సూచించారు. అంతే కాకుండా ఒక మిత్రుడు మిడ్నపూర్‌కు చెందిన ఒరియా న్యాయవాది రాధానాథ్‌పతి గారి కొమార్తెను గోపబంధుకి నిశ్చయించే ప్రయత్నం కూడా చేశాడు. కాని గోపబంధు తన నిరాకృతి తెలిపాడు. ఉద్దేశం మంచిదే అయినప్పటికీ, స్త్రీకి జీవితసర్వంతం ఒకే భర్త అనుకున్నప్పుడు, పురుషునికి కూడా ఒకే భార్య అనే సూత్రం వర్తించక తప్పదని చెబుతూ ఆయన మిత్రుల వాదాన్ని త్రోసిపుచ్చాడు.

1912 ఫిబ్రవరి 22 తేదీ మహారాజా శ్రీరామచంద్ర దివంగతుడయ్యాడు. ఆయన కొమారుడు పూర్ణచంద్రభంజ్‌దేవ్ మైనరు కావడం వల్ల సంస్థానం కోర్ట్ ఆఫ్ వార్డ్స్ స్వాధీనం లోకి వెళ్ళింది. ఇండియా ప్రభుత్వ రాజకీయశాఖ ఒకతెల్ల వాణ్ణి సంస్థాన పర్యవేక్షణాధికారిగా నియమించింది. ఈ పెద్ద మనిషి సంస్థానం ఖర్చు పొదుపు చేయాలనే నెపంతో ప్రభుత్వన్యాయవాది పదవినే రద్దు చేశాడు. 1912 జూలై నెలలో పొలిటికల్ ఏజెంటుకోబ్డన్ రామ్సే బారిపాడా వచ్చాడు. కొత్తగా ఏర్పడిన బీహార్ ఒరిస్సా రాష్ట్ర లెఫ్టినెంట్ గవర్నరు పర్యటన సందర్భంగా ఏర్పాట్లు చూడటానికి వచ్చాడు. అక్కడ హైస్కూలు నుంచి బాలికల స్కూలుకి వెడుతూ ఆ పొలిటికల్ ఏజెంట్ తన వెంట రమ్మని సంస్థాన విద్యాధికారిని ఆదేశించాడు. ఆ అధికారి భారతీయుడు కావడంవల్ల పొలిటికల్ ఏజంట్ అతణ్ణి తనతో బండిలోపలకాకుండా, వెలుపల కోచ్‌మన్ ప్రక్కన, కూర్చొమ్మని చెప్పాడు. గోపబంధు తన సహోద్యోగికి జరిగిన ఈ అవమానం గూర్చి విని, తన ఆక్షేపణ తెలుపుతూ రాజీనామా యిచ్చాడని చెబుతారు. పోలిటకల్ ఏజంట్ తాను ఉద్దేశపూర్వకంగా ఆ భారతీయ ఉద్యోగిని అవమానించలేదని క్షమాపణ చెప్పి, రాజీనామా ఉపసంహరించుకొమ్మని కోరాడుట. కాని గోపబంధు అంగీకరించలేదు. అంతకు పూర్వమే జారీ అయిన ఆదేశంవల్ల పదవి రద్దుచేయబడింది. మహారాజాశ్రీ రామచంద్ర మరణానంతరం ప్రారంభమైన కొత్తపాలనా వ్యవస్థలో, ఆత్మగౌరవం కలిగిన గోపబంధు వంటి వ్యక్తి, బారిపాడాలో ఉద్యోగంలో కొనసాగేందుకు తగిన పరిస్థితి లేకపోయింది. అందుచేత ఆయన 1912లో ఆ సంస్థానాన్ని వదలి, మళ్లీ కటక్ చేరి న్యాయవాద వృత్తి చేపట్టాడు.

# 7

# విద్యారంగంలో ప్రయోగం

## సాక్షిగోపాల్ వ్యవస్థాపన

ఒకసారి నిర్ణయం జరిగాక, సమస్యవివరాలను క్షుణ్ణంగా పరిశీలించి తెల్సుకోవడమే మిగిలింది. పూరీజిల్లాలోని సత్యవాది, సాక్షి గోపాల్ దగ్గర కొంత పట్టణ తరహా కలిగిన ప్రాంతం. కాని దాన్ని గూర్చి ఆయన వెంటనే అనుకోలేదు. ఒరిస్సా, అంటే బ్రిటిషు పాలితప్రాంతమూ స్వదేశీ సంస్థానాల ప్రాంతమూ కలిసిన ఒరిస్సా, నలుమూలలకూ మనుష్యులు వెళ్లారు. ఆయన తలపెట్టిన ఆదర్శ విద్యాసంస్థకు తగిన ప్రదేశాన్ని ఎంపిక చెయ్యడానికి చివరకు రాయ్‌బహదర్ మధుసూదనరావు సూచనమేరకు సాక్షిగోపాల్‌లో వకుళనికుంజాన్ని, విద్యా రంగంలో తమ వినూత్న ప్రయోగం నిమిత్తం ఎన్నుకున్నారు.

సత్యవాది ఎన్నోవిధాల అనుకూలమైన ప్రదేశం. అక్కడ 'ఠాణా' ఉండటమే కాదు, అది యాత్రాస్థలంకూడా. దేశం మొత్తం నుంచీ అక్కడికి యాత్రికులు వచ్చేవారు. బెంగాల్ నాగపూర్ రైల్వేలో పూరీ-ఖుర్దా బ్రాంచిలైన్‌లో ఉన్న సాక్షిగోపాల్ స్టేషన్‌కి పదినిమిషాలు నడవాలి. అంతేకాకుండా అది బ్రాహ్మణ అగ్రహారాలకు కేంద్రం. అక్కడి సనాతన వైదికులు మూఢ విశ్వాసాలకూ, వర్ణ దురహంకారానికీ పెట్టిన పేరుగా ప్రసిద్ధి పొందారు.

సాక్షి గోపాల్‌ను ఎన్నుకోవడానికి మరోకారణం కూడా ఉన్నది. చేరువనే ఉన్న శ్రీరామచంద్రపూర్ గ్రామస్థుడైన హరిహరదాస్ అనే మనిషి పేరుతో కూడా ఆ ప్రదేశానికి సంబంధం ఉన్నది. ఆయన పూరీ సంస్కృత కళాశాల వ్యవస్థాపకుడు. హరిహరదాస్ గారితో గోపబంధు మధు సూదన రావులకు సన్నిహిత పరిచయం ఉంది. హరిహరదాస్ గారు పండిత్ నీలకంఠదాస్ పెత్తండ్రి. హరిహర్ ఆంగ్ల విద్యాధికుడు. చాలామంది యూరపియన్ అధికారులతో స్నేహసంబంధాలు కలవాడు. ఛాందసాన్ని లెక్కచెయ్యని హరిహర్ కృషి, సంప్రదాయబద్ధులైన బ్రాహ్మణుల్లో కలవరం కలిగించింది. తనవాళ్ళని

స్నేహసంబంధాలు కలవాడు. ఛాందసాన్ని లెక్కచెయ్యని హరిహర్ కృషి సంప్రదాయబద్ధులైన బ్రాహ్మణుల్లో కలవరం కలిగించింది. తనవాళ్ళని ఉద్ధరించేందుకు ఆయన అధిగమించిన ఎన్నో అవరోధాలు గోపబంధుకి ఆయన యెడల గౌరవభావన్ని పెంపొందించాయి. మధుసూధనరావు సాక్షిగోపాల్ పేరు చెప్పగానే గోపబంధు దాన్ని వెంటనే ఆమోదించడానికి కారణం- మహనీయుడైన హరిహరదాస్ స్మృతిని బలపరుస్తూ ఆయన ఆశయాలను ఆచరణలో పెట్టే ఉద్దేశం తనలో కలగడమే.

ఆ సమయంలోనే శ్రీరామచంద్రపూర్‌కు చెందిన గోపీనాథదాస్ తన ఊళ్లో ఒక మిడిల్‌వెర్నాక్యులర్ స్కూల్ స్థాపించే ప్రయత్నంలో ఉన్నాడు. ఆ గోపీనాథదాస్ గోపబంధుతో కలిసి చదువుకున్నవాడు. అప్పుడే డిప్యూటీ మేజిస్ట్రేట్ అయారు. గోపబంధు తనకార్యం నిమిత్తం ఆయన దగ్గర చందా వసూలు చెయ్యడమే కాకుండా, ఒక మిడిల్ యింగ్లీషు స్కూల్ సాక్షిగోపాల్‌లో ఏర్పాటు చేసేందుకు కూడా నచ్చజెప్పాడు. అప్పట్లో ఆ పరిసరాల్లోని రెండు ఎమ్.వి. స్కూళ్ళ మూసివెయ్యబోతున్నందువల్ల ఒక ఒక కొత్త స్కూలు స్థాపించవలసిన గట్టి అవసరం కూడా ఏర్పడింది. గోపబంధు పంధొమ్మిదీ మంది విద్యార్థులతో సత్యవాది మిడిల్ యింగ్లీషు స్కూల్‌ని 1909 ఆగస్టు 12 వ తేదీన ప్రారంభించాడు. ఇది ఆయన బారిపాడాకు ప్రభుత్వ న్యాయవాదిగా తరలివేళ్లేముందు జరిగింది. ఆ స్కూలే తర్వాత, సత్యవాది నికుంజ పాఠశాలా ఉద్యమానికి బీజమైంది. దానితో అవినాభావ సంబంధం కలిగి ఒరియాదేశాభిమానం కూడా వృద్ధి పొందింది.

ఆ ప్రదేశంలో అప్పుడు స్కూలుకి భవనమంటూ ఏమీలేదు. దేవాలయావరణలో స్కూలు ప్రారంభమైంది. స్కూలు కార్యదర్శిగా గోపబంధు సాక్షిగోపాల్ దేవాలయనిర్వహణ సంఘాన్ని అర్థించాడు- దేవాలయానికి వాయవ్యదిశలో రెండెకరాల స్థలాన్ని అద్దెకు యివ్వమని. ఆ స్థలంలో దట్టంగా అందమైన వకుళ నికుంజం ఉండేది. దాన్ని చూడగానే ఆ చెట్ల నీడల్లో తరగతులు నడపవచ్చు నన్న ఊహ వచ్చింది గోపబంధుకి. కాని వాతావరణం అనిశ్చితంగా ఉండే కారణంవల్ల ఆ ఉద్దేశానికి స్వస్తి చెప్పి, భవనం నిర్మించాలనే అనుకున్నారు. స్నేహితులతో కలిసి గోపబంధు గ్రామాల వెంబడి తిరిగి స్కూలు కోసరం చందాలు పోగు చేస్తూ, ఖర్చు తగ్గించే నిమిత్తం తరగతుల్ని ఆరుబయటే నడపమనీ, ఒక్క వర్షాకాలంలో తప్ప మిగతా ఋతువుల్లో అలా చెయ్యవచ్చుననీ, ఆదేశాలిచ్చాడు. వర్షాకాలంలో మాత్రం నిర్మించే భవనాన్ని ఉపయోగించవచ్చును. ప్రభుత్వ విద్యాశాఖ ఈ మిడిల్ యింగ్లీషు స్కూల్‌కి గుర్తింపు యిచ్చింది. తర్వాత 1911

అక్టోబరు 11 తేదీ పండిత్ నీలకంఠదాస్ వచ్చి చేరడంతో దాన్ని హైస్కూలుగా మార్చే ప్రయత్నమూ ప్రారంభమైంది. 4వతరగతి (ఈనాటి 8 తరగతి) 1912 జనవరిలో పెట్టారు. హైస్కూలు స్థాపించాలన్న గోపబంధు కోరికకు యిది నాందీ ప్రస్తావన అయింది.

## పాఠశాల లక్ష్యాలు

పాఠశాల స్థాపించే సందర్భంలో గోపబంధు దాస్ వివరించిన ఉద్దేశాలను బట్టి అందులో అనుసరించే విద్యావిధానాన్ని మనం గ్రహించవచ్చు. దక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీ వరవడిలో ఒక సంఘాన్ని ఒరిస్సాలో స్థాపించి, దానికి విశ్వవిద్యాసమితి (యూనివర్సల్ ఎడ్యుకేషన్‌లీగ్) అని నామకరణం చేసి దాని ఉద్దేశాలను ఆయన ఈవిధంగా ప్రకటించినట్లు తెలుస్తున్నది. '' ఈ సమితి వ్యవస్థాపకుల విశ్వాసం- ప్రతిమనిషికీ విద్య నేర్చుకోవడానికి సమానమైన హక్కు ఉన్నది. సూర్య చంద్రుల కాంతి సౌభాగ్యాన్ని అందరూ పంచుకుంటున్నట్లే, మతబోధ అన్ని యుగాలలో సమాజంలో వెదజల్లబడుతూ ఉన్నట్లే, విద్య అనే మనస్సంబంధమైన వికాసం కూడా అందరికీ సమానంగా అందుబాటులో ఉండాలి. విద్యాప్రమాణాలను తగ్గించకుండానే, విద్యాబోధన కయ్యే వ్యయాన్ని తగ్గించేందుకు ఎన్నో మార్గాలున్నాయి. అందుకోసమై, ప్రాచీన గురుకుల పద్ధతిలో ఒక నికుంజ పాఠశాలను ఏర్పాటు చేసేందుకు కృషి జరుగుతున్నది. ఈ పాఠశాలలో విద్యార్థులు చెల్లించవలసిన రుసుము కనీస పరిమాణంలో ఉంటుంది. పాఠశాల వసతి గృహంలో వాళ్ల జీవన విధానం కూడా నిరాడంబరంగానే ఉంటుంది. పాఠశాల అంటే కేవలం భవనాలు, కుర్చీలు, బల్లలుకావు. సుశిక్షుతులై, ఆదర్శభావ ప్రేరితులై, నిజాయితీగల ఉపాధ్యాయులు ఉండాలి. ఈనాటి విద్యావిధానం దేశంలోని యువతరాన్ని జీవిత సమస్యల నెదుర్కొనేందుకు సిద్ధ పరచడం లేదు. కుర్చీలు బల్లలూ ఎందుకు ఉపయోగిస్తాయో అంతకంటే మించిన యితరమైన కార్యసాధనకు వాళ్లు అసమర్థులుగానే ఉంటున్నారు. వాళ్లకు తగిన వృత్తి విద్యల్ని నేర్పి. వారి జీవనోపాధి వాళ్ళు గడించుకునే విధంగా శిక్షణ నివ్వడం నేటి ముఖ్యసమస్య. అందుకోసమై వట్టి శరీరవ్యాయామమే కాకుండా. పారిశ్రామిక, వ్యావసాయిక కృషి కూడా వాళ్ళకు నేర్వలసి ఉన్నది. అధ్యాత్మిక నైతిక ప్రబోధం యొక్క ఆవశ్యకత కూడా ఎంతో ఉన్నది. ఎందుచేతనంటే వ్యాపారం వాణిజ్యం వంటి ప్రాపంచిక వ్యవహారాల్లో నీతికి ఎంతో విలువ ఉన్నది.

''సత్యవాది విద్యావ్యవస్థ దాని లక్ష్యంలో గాని, స్వరూపంలో గాని

దాని మొదటి ఆశయం. సమగ్ర విద్యాప్రబోధానికి యిది నాందీ ప్రస్తావన మాత్రమే. దీని కోసం చాల కాలంగా మేము తయారవుతూ వచ్చాము. ఇటువంటి విద్యాసంస్థలను పలుచోట్ల నిర్మించాలని మా ఉద్దేశం. ఇది అందులో ఒకటి మాత్రమే. కాలాను గతంగా, యిటువంటి పాఠశాలలు రాష్ట్రమంతటా తలెత్తుతవి. ఈ సంస్థల్లో ఆర్థిక సంపదకూ, విద్యకూ, శీలానికి సమైక్యత ఉంటుందని మా ఆశయం. ఈ పథకాన్ని చేబట్టి నిర్వహించేందుకే 'విశ్వ విద్యాసమితి' స్థాపించబడింది.''

## ప్రగతి నిరోధకుల వ్యతిరిక్తత

ఆయన పాఠశాల నిరాఘాటంగా సాగలేదు. ప్రగతి దానిలక్ష్యం కావడంతో, కొన్ని సంస్కరణ పద్ధతుల్ని ప్రవేశపెట్టడం అనివార్యం. భిన్న కులాలకూ, వివిధ వర్గాలకూ చెందిన విద్యార్థులు కలిసిమెలిసి ఉండటం, ఏకపంక్తిగా భోజనం చెయ్యడం వంటివి ఆ ప్రాంతంలోని ఛాందస బ్రాహ్మణుల్లో అలజడి కలిగించాయి. ఇటువంటి పాఠశాల శాశ్వత సంస్థగా కొనసాగితే, హిందూమతం యొక్క వైశిష్ట్యాన్ని చెరచి, బ్రాహ్మణ కులాన్ని నాశనం చేస్తుందని వాళ్ళు భయపడ్డారు. అందువల్ల సంస్థను ఉనికి లేకుండా చెయ్యాలని వాళ్లు నిశ్చయించుకొన్నారు. 1912 మార్చి 22 తేదీ కొందరు దుండగులు పాఠశాలకు చెందిన పూరిగుడిసెలకు నిప్పంటించారు. దానివల్ల యాజమాన్యానికి రూ.5000 నష్టం కలగడమే కాకుండా, అమూల్యమూ అలభ్యమూ అయిన పుస్తకాలు, పాఠశాల గ్రంథాలయం కోసరం సేకరింపబడినవి, దగ్ధమైపోయాయి. సంస్థ నిర్వాహకులు ఆ నష్టంతో నిశ్చేష్టులై, ఆ పరిస్థితుల్లో ఏం చెయ్యాలో తోచక స్తబ్ధంగా ఉండిపోయారు.

గోపబంధు, నీలకంఠ యిద్దరూ గుండె ధైర్యం గల వ్యక్తులు. ఎంతటి కష్టం వచ్చినా అది దుర్గమంగా కనిపించలేదు వారికి. బారిపాడాలో ఉన్న గోపబంధు స్కూలు తగులబెట్టిబడిన వార్త విని వెంటనే సత్యావాదికి వచ్చాడు సహచరులతో సంప్రదించడానికి. ఆయన విచారంతో క్రుంగిపోలేదు. తనే స్నేహితుల్ని ఊరడించాడు. '' ఎందుకు ఆందోళన? పాఠశాల యిలా పూరిండ్లలో నడుపుతూ ఉండటం భగవంతునికి సమ్మతం కాలేదు కాబోలు! పక్కా కట్టడం ఉండటం స్కూలుకి అవసరమనే తోస్తున్నది. ఈ నిశ్చయంతో ధనసేకరణ కోసరం ఒక వినతి పత్రం తయారుచేసి, అందులో సంస్థకు చెందిన ప్రముఖులందరూ సంతకాలు చేశారు. దానితో ఒరిస్సా అన్ని వైపులనుంచీ సాహాయ్యం రావటం మొదలైంది. అది ధారపాతంగా వచ్చింది. సంస్థానాలనుంచీ కూడా వచ్చింది.

ఉపాధ్యాయులూ, నిర్వాహకులూ చూపిన పట్టుదలనే విద్యార్థులూ చూపారు. వచ్చిన విపత్తు కారణంగా పాఠశాల నిత్యకార్యక్రమం ఒక్కరోజు కూడా ఆగిపోకుండా యథావిధిగా జరిగేట్లు చూశారువాళ్ళు. అగ్ని సంస్కారం జరిగిన ఆరుగంల లోపల, పొరుగూళ్ళకు వెళ్లి కొబ్బరి మట్టలు సంపాయించి తెచ్చి వాళ్లు తాత్కాలికంగా ఒక ఆశ్రయం ఏర్పాటు చేసుకున్నారు. తర్వాత కొన్ని రోజులలోనే ఇటుకలతో కట్టిన రెండు వరుసల నిర్మాణాలు, ఏ-బ్లాక్, బి-బ్లాక్ అనే పేర్లతో తయారయాయి. వర్షాకాలం ప్రారంభం కావడంతో యివి అవసర మయాయి. తర్వాత 1913లో శాశ్వత భవనాలు పూర్తి చేసినప్పుడు. ఈ రెండు బ్లాకులనూ భోజన గృహాలుగా మార్చాడు.

## ఆరుబయట పాఠశాల

కట్టడాల వసతిలేని పరిస్థితే పాఠశాలనొక నవ్య సంస్థగా రూపొందించేందుకు దోహదం చేసింది. పరశురామ ప్రీతి జరిగినతర్వాత, గోపబంధు వకుళ నికుంజాన్ని సొంతం పరిశీలించాడు. కట్టడాలు తయారయ్యేలోపుగా తరగతులు నిర్వహించేందుకు వీలవుతుందేమో చూడటానికి. తత్ఫలితంగా ఒకచోట మర్రి, రావి, వకుళ వృక్షాల కొమ్మల వ్యాప్తితో దట్టంగా కప్పబడి, మంచి నీడగల ప్రదేశం కనిపించింది. ఎండ తీవ్రత సోకకుండా నిరంతరమూ చెట్ల ఆకుల ఆచ్ఛాదన అక్కడ లభిస్తోంది. దీన్ని 'గుప్త బృందావనం' అనీ, 'రహస్యనికుంజం' అనీ వ్యవహరించేవారు. గోపబంధు నీలకంఠలు ఈ ప్రదేశాన్ని కొన్ని విభాగాలుగా చేసి, ఒక్కొక్క విభాగంలో ఇటుక, సున్నంతో ఒక తిన్నె నిర్మించి, ఉపాధ్యాయుడు కూర్చుని పాఠం చెప్పడానికి ఏర్పాటు చేశారు. వ్రాసేందుకు ఉపయోగించే నల్లబల్లల్ని చెట్ల మొదట్లో కట్టారు. విద్యార్థుల్ని ఆకులతో నేసిన చాపల మీద కూర్చోబెట్టారు. ఈ నికుంజాని కిరువైపులా నీడగల ప్రదేశాలు ఉండటంతో, ఒకవైపు దాన్ని ఉపాధ్యాయుల విశ్రాంతి స్థలంగానూ, రెండోవైపు దాన్ని విద్యార్థుల సమావేశ స్థలంగానూ నిర్దేశించారు.

## పాఠశాల పునర్నిర్మాణం

1913 ప్రారంభంలో కొత్త కట్టడాలకు పునాది వేశారు. ఆ పునాదిలో రూపాయి, అర్థరూపాయి, పావలా, రెండణాలు, అణా నాణెములు, అప్పుడు చలామణీలో ఉన్నవాటిని వేశారు. వాటితో బాటు పాఠశాల ఉపాధ్యాయవర్గం పేర్లు వ్రాసిన

చీటీని ఒక సీసాలో భద్రపరచి దాన్ని కూడా అందులో పాతిపెట్టారు. గోపబంధు, నీలకంఠ తదితర సహచరులు ఆ సందర్భంలో ఉపన్యాసాలు చేశారు. పాఠశాల విద్యార్థులు, వారి ప్రయత్నాలు ఆ విధంగా ఫలోన్ముఖం కావడాన్ని చూసి పులికించిపోయారు. ఒక్క ఏడాది తిరిగే లోపుగానే కట్టడాలు తయారై, 1914 నాటికల్లా అది సర్వాంగ పరిపూర్తి గల సంస్థ అయింది.

అగ్ని ఉదంతం జరిగినప్పటికీ, పాఠశాల క్రమాభివృద్ధి సాధించింది. ఆచార్య హరిహరదాస్ నీలగిరిని వదలి పెట్టిన తర్వాత కటక్ 'పియరీ మోహన్ అకాడెమీ' లో ఉపాధ్యాయుడుగా పనిచేసి, 1912లో ఈ పాఠశాలలో ప్రవేశించాడు. రెండుమూడు తరగతులు ( అంటే ఈనాటి తొమ్మిది పది తరగతులు) 1913లో ప్రారంభించారు. ఆ సంవత్సరమే పండిత్ గోదావరీశ్ మిశ్రా ఉపాధ్యాయుడుగా వచ్చాడు. ఆయన కలకత్తా విశ్వవిద్యాలయం నుంచీ అర్థిక శాస్త్రంలో ఎం.ఏ. డిగ్రీ పొందాడు. పండిత్ నీలకంఠ, పండిత్ గోదావరీశ్‌లు విద్యార్హతల్లో అత్యున్నత స్థాయిన పొందినవారు. ప్రభుత్వంలో ఉన్నత పదవులకు వెళ్ళే అవకాశాలు ఎన్నో లభించాయి. వారికి కావాలను కొని ఉంటే వాళ్లిద్దరూ బ్రిటీష్ ప్రభుత్వంలో అత్యున్నత స్థాయి అధికారులుగా పదవుల్లో రాణించి ఉండేవారు. కాని పండిత్ గోపబంధు వారి హృధయాల్లో రగిల్చిన దేశాభిమానం కారణంగా వారు దేశసేవను కాదని సంపదనూ అధికారాన్ని వెంబడించ లేకపోయారు. అటువంటి మనోవైఖరి గల వ్యక్తులతో ఉత్తమ విద్యావంతులతో, ఏ పాఠశాల అయినా త్వరితగతి అభివృద్ధి చెందడంలో ఆశ్చర్యం ఉండదు. సత్యవాది పాఠశాల ఒక విశిష్ట సంస్థ. దాని ఆదర్శం కారణంగా, ఆనాటి ఒరిస్సా క్షీణ సంస్కృతి మధ్య, ఆ పాఠశాల ఒక విద్య త్కేంద్రంగా వెలుగు విరజిమ్ముతూ తన ప్రయోజనాన్ని నిరూపించింది. అక్కడ చక్కగా చదువు చెబుతారన్న కీర్తి ప్రతిష్ఠల వ్యాప్తితో అన్ని వైపులనుంచీ విద్యార్థులు రావడం ప్రారంభించారు. సాక్షిగోపాల్ పాఠశాల అంటే మామూలు హైస్కూలు మాత్రమే కాదని అందరూ గుర్తించారు. అన్ని రంగాలలోనూ ఆదర్శభావన దేశాభిమానమూ, జాతీయతా, మనోవికాసమూ వ్యాపింపజేసే లక్ష్యశుద్ధి గల కేంద్రంగా పాఠశాల రూపొందింది.

8

# సత్యవాది విద్యావిధానం

## ఆదర్శాలు

ఒరిస్సా యువతకు యోగ్యమైన విద్యావిధానాన్ని రూపొందించడంలో గోపబంధు భావాలు నవీన మైనవి. మామూలు పద్ధతిలో ఒక మిడిల్ లేక హై ఇంగ్లీషు స్కూలు స్థాపించడం ఆయన అభిమతం కాదు. అంతకంటె ఉన్నతమైన లక్ష్యం ఆయనది. బహుళార్థ సాధక విద్యావిధానానికి ఒక కేంద్రాన్ని సృష్టించాలని ఆయన ఉద్దేశం. పాఠ్యవిషయాల్ని బోధించడమే కాకుండా, విద్యార్థులకు వృత్తి విద్యల్లో వ్యవసాయంలో శిక్షణ నిచ్చి తద్వారా వాళ్ళు స్వంతంత్రంగా జీవనోపాధి కల్పించుకునే అవకాశాన్ని యివ్వాలని ఆయన సంకల్పించాడు. ఆరకం విద్యావిధానం, అది కేవలం జీవనోపాధి కోసరమే అన్న స్థాయికి దిగ జార్చే ప్రమాదం ఉన్నా, గోపబంధు ఉద్దేశం మాత్రం అదికాదు. మనస్సునీ శరీరాన్ని రెండింటినీ సుశిక్షితం చెయ్యడం ద్వారా విద్యార్థి వ్యక్తిత్వాన్ని సమగ్రంగా సంపూర్ణంగా పెంపొందించాలనేది ఆయన ఉద్దేశం. అలా తయారైన వ్యక్తి ఎక్కడికి వెళ్లినా, 'సత్యవాది' ముద్రతో ఆమోదింప బడాలి. సత్యవాది మానవత్వంగల వ్యక్తుల్ని తయారు చెయ్యాలి, కేవలం శ్రామికుల్ని కాదు. అది గోపబంధు లక్ష్యం, ఆదర్శం. అలాంటి ఆదర్శాన్ని యథార్థంగా సిద్ధింప జేసేందుకు తగిన సామర్థ్యమూ, సంకల్ప బలమూగల మేధావంతులైన యువకుల్ని చేకూర్చుగోగలగడం ఆయన అదృష్టం. సత్యవాది పాఠశాలలోని ఉపాధ్యాయులు స్వచ్ఛందంగా తమ జీవిత సుఖాల్ని త్యాగం చేసి, సమాజ సేవకు అంకితమైన వారు. వారికి తగిన నాయకత్వాన్నీ, మార్గదర్శకత్వాన్నీ, గోపబంధు సమకూర్చడంలో, వారి ప్రగతి పథం సుగమం అయింది. అందువల్ల సత్యవాది హైస్కూలులో బోధనా పద్ధతి విశిష్టమైనదిగా రూపొందడమే కాదు, రాష్ట్రంలో యితర పాఠశాలలకు అది ఆదర్శ ప్రాయమూ, అనుసరణీయమూ అయింది.

## బోధనాపద్ధతి

ఈ పాఠశాల ఉపాధ్యాయులు కేవలం పాఠాలు చెప్పేపంతుళ్ల కారు.

పాఠ్యప్రణాళికను పూర్తి చేసి విశ్వవిద్యాలయ పరీక్షకు అభ్యర్థులను తయారు చెయ్యడంతో వాళ్ళ తృప్తి పడలేదు. విద్యార్థులూ ఉపాధ్యాయులూ అక్కడే నివసించవలెనన్న నిబంధనగల సంస్థ కావడంతో, ప్రధానోపాధ్యాయుడు కుటుంబ యజమాని వలె పరిగణింప బడేవాడు. పిన్న వయస్కులైన ఉపాధ్యాయులు విద్యార్థులకు అన్నయ్యలుగా మెలిగేవారు. తమ పర్యవేక్షణలోని చిన్న వాళ్ల కష్టసుఖాల్ని పంచుకునేందుకు సిద్ధపడేవారు. ప్రధానోపాధ్యాయుడు తన విజ్ఞానంతో, పలుకుబడితో ఉపాధ్యాయులకు వరవడి పెట్టేవాడు. ఉపాధ్యాయులు పాఠశాల తరగతుల్లోనూ, వసతి గృహంలోనూ, కృషినీ, జీవితాన్నీ, ఆసక్తి కరంగానూ, ఆనంద ప్రదంగానూ రూపొందించడం వల్ల విద్యార్థులు ఒరిస్సా రాష్ట్రం అన్ని మూలల నుంచీ వెల్లువగా వచ్చారు. ఉపాధ్యాయులు తరగతిలో చెప్పే పాఠ్యాంశ వివరాల్ని ప్రధానోపాధ్యాయుని పర్యవేక్షణకు నివేదిస్తే ఆయన వారి బోధనా పద్ధతిలోనూ, ఎంతమేర కృషిజరిగింది అనే అంచనాలోనూ, తేడాలూ హెచ్చుతగ్గులూ లేకుండా, సమన్వయపరచే బాధ్యత వహించేవాడు. మామూలు పాఠశాల అయితే, ఇటువంటి పద్ధతిని ఉపాధ్యాయులు తమ స్వేచ్ఛకూ, స్వయం నిర్ణయ ప్రతిపత్తికీ, అవరోధం, కల్పిస్తున్నదంటూ నిరసిస్తారు. కాని సత్యవాది పాఠశాలా కుటుంబంలో, తను లక్ష్యం దృష్ట్యా, ప్రయోజనం దృష్ట్యా, ప్రధానోపాధ్యాయుని ఆదేశాలను స్వీకరించేందుకు సమ్మతించారు వారు.

ఉపాధ్యాయులకొక ప్రత్యేక విశ్రాంతిశాల ఉండేదికాదు. ప్రధానోపాధ్యాయునితో బాటు అందరు ఉపాధ్యాయులూ కలిసి ఒక పెద్దగదిలోనే కూర్చుని, పాఠశాల తాలూకు సమస్యల్ని తమలో తాము చర్చించుకునేవారు. పీరియడ్ మొదట్లో ప్రతి ఉపాధ్యాయుడూ తరగతిలో క్రిందటి పర్యాయం జరిగిన పాఠ్యాంశాన్ని గూర్చి పది, పదిహేను నిమిషాలు చర్చించి, విద్యార్థులు వ్రాసి తెచ్చిన అభ్యాసాల్ని పుచ్చుకుని, వాటిని యింటికి తీసుకువెళ్ళి జాగ్రత్తగా దిద్దడం పరిపాటి. పీరియడ్ అంతంలో ఆపూట జరిగిన అంశాలపై విద్యార్థులను ప్రశ్నించేవారు. సీనియర్ విద్యార్థులు జూనియర్ విద్యార్థులకు అభ్యాసాలు వ్రాయడంలో వారిపని చేసిపెట్ట కూడదనీ, ప్రతివిద్యార్థీ బోధింపబడిన పాఠాలను తనే ప్రయత్నించి అవగాహన చేసుకోవాలనీ ఏర్పాటు. వసతి గృహంలో ఉపాధ్యాయులు ప్రతి విద్యార్థి దగ్గరకు వెళ్ళి, అవగాహనలో వెనుకబడిన వాళ్లకు, ప్రత్యేకంగా అవసరమైన వివరణలు యిచ్చేవారు. గణిత బోధకుడైన ఆచార్య హరిహరదాస్ చేతిలో బెత్తం, కాళ్లకు కర్ర చెప్పులూ ధరించి వసతి గృహంలో తిరుగుతూ ఉండడం తరుచు కనిపించే విశేష దృశ్యం. క్రమశిక్షణకు పేరు పడ్డ ప్రధానోపాధ్యాయుడు కూడా వసతి గృహం తనిఖీ చేస్తూ తిరుగుతూ ఉండేవాడు.

## సాహిత్య కార్యక్రమాలు

పాఠశాలలోని ప్రతితరగతి వాళ్లూ 'తరగతి-పత్రిక' నొకదాన్ని లిఖిత రూపంలో ప్రకటించే ప్రోత్సాహం ఉండేది. అటుపై ప్రధానోపాధ్యాయుని ఆధ్వర్యంలో ఒక పాఠశాలా పత్రిక నడిచేది. దాన్లో విద్యార్థులూ ఉపాధ్యాయులూ తమరచనలు ప్రకటించేవారు. నాటి తరగతి-పత్రికల్లో పదవతరగతి పత్రిక 'వాణి' పేరెన్నికగన్నది. విద్యార్థుల రచనల్ని ఉపాధ్యాయులు సరిచూసి సవరించేవారు. వారి సాహిత్య ప్రతిభా వ్యుత్పత్తుల్ని పెంపొందించడంలో శ్రద్ధవహించేవారు. అంతేగాక, తరుచు 'కవిసమ్మేళన' ములు నిర్వహించబడుతూ ఉండేవి. అందులో ఉపాధ్యాయులూ, విద్యార్థులూ స్వీయకవితల్ని గానం చేసేవారు.

## చర్చాసదస్సులు

విద్యార్థుల్లో వక్తృత్వ ప్రతిభ పెంపొందించేందుకు గోపబంధు ఎక్కువ ఆసక్తి చూపేవాడని ప్రతీతి. ఆయన ఎక్కడికి వెళ్లినా చర్చా సదస్సుల్ని ఏర్పాటు చేసేవాడు. సత్యవాది పాఠశాలలో చర్చాసదస్సు ప్రతి శనివారం సమావేశమై వివిధ సమస్యల్ని చర్చించేది. దానికి అందరూ తప్పక హాజరుకావలెనని నియమం ఉండేది. పాఠశాలను దర్శించడానికి వచ్చే అసంఖ్యాక ఆగంతుకుల్లో, దేశంలోనూ రాష్ట్రంలోనూపేరొందినపెద్దవాళ్లు, ఈసమావేశాల్లో పాల్గొని ఉపన్యాసాలిచ్చేవారు. గోపబంధు అధ్యక్షుడు గానో, సాధారణ వక్తగానో తరుచు పాల్గొనేవాడు.

ఆపాఠశాల మామూలు విద్యాసంస్థకాదు. సమర్థులనూ శక్తి మంతులనూ తయారు చెయ్యవలెనని గోపబంధు ఆశయం. అందువల్ల ప్రతిభావంతులైన కుర్రవాళ్లను ఏరితెచ్చి, వారికి పాఠశాల ఖర్చు మీదనైనా సరే, విద్యాదానం చేయాలని ఆయన సంకల్పం. ఉపాధ్యాయులకు విద్యార్థులతో సాన్నిహిత్యం ఉండేది. గోపబంధు కొన్ని సమయాల్లో స్వయంగా తరగతుల్లో బోధించేవాడు. విద్యార్థులు అక్కడి బోధనా పద్ధతిని ఎలా సద్వినియోగం చేసుకోవచ్చునో వారికి చెప్పేవాడు.

## విహారయాత్రలు

విహారయాత్ర విద్యాకార్యక్రమంలో ఒక అవసరమైన భాగమై ఉండేది. కొత్త ప్రదేశాల్ని చూడటానికి అవకాశం కల్పించడమే కాదు ఉద్దేశం. ఒరిస్సా రాష్ట్రంలోని ప్రఖ్యాత స్థలాలతో సన్నిహిత పరిచయం కలిగించడం, తద్వారా యువకుల్లో రాష్ట్రాభిమానం పెంపొందించడం ఉద్దేశం. ఈ విహార యాత్రలు రైలు, కారు

వగైరా వాహనాల మీద జరిగేవి కావు. విద్యార్థులు కాలి నడకను వెళ్ళి ప్రదేశాలను దర్శించేవారు. అటువంటివి రెండు యాత్రలు ఖండగిరికీ, కోణార్కకు నిర్వహించారు. పై తరగతుల విద్యార్థులూ, ఉపాధ్యాయ బృందం, ఆయాత్రల్లో పాల్గొన్నారు. సాక్షి గోపాల్ నుంచీ ఖండగిరికి గాని, కోణార్కకి గాని, పిప్పిలి ద్వారా విద్యార్థులందరూ నడచి వెళ్లడం తమాషా కాదు. ఆయా ప్రదేశాల చారిత్రక ప్రాముఖ్యాన్ని గూర్చి దారిలో ముందేవారికి వివరించడమూ దానికి అనుగుణంగా గీతాల్నీ పద్యాల్నీ తయారు చేసి దారి వెంబడి పాడడమూ, ఆ పాదయాత్రని ఒకపెద్ద ఊరేగింపుగా మార్చాయి. దారిలో ఉన్న ఊళ్లలో జనమూ అక్కడి బడుల్లోని విద్యార్థులూ వీరిని ఆదరించి సంభావించడమే కాకుండా, వీరితో కొంతవరకు నడిచి సాగనంపేవారు. ఉపాధ్యాయులు ఈ ఊరేగింపు నొక్కొక్క సారి 'లెఫ్ట్,రైట్' అంటూ సైనికుల కవాతు ప్రదర్శనలా నడిపించేవారు. ఈ విహార యాత్రల్లో మొదటి ఒక బృందం ముందుగా వెళ్లి గుడారాలు వెయ్యడం, వసతి ఏర్పాట్లు చెయ్యడం ముగించి, అందరూ ఆ స్థలాన్ని చేరుగోగానే విడిది చేసి రాత్రి గడిపేందుకు సిద్ధంగా ఉంచేది. ఈ రకంగా జీవన క్రమాన్నే విద్యావిధానంగా మార్చడం ఎంతో ఆనందాన్నివ్వడమే కాదు, వారికి ఒరిస్సా చరిత్రలోని ముఖ్యఘట్టాలని కరతలామలకం చేసింది. కోణార్కకు వెళ్లిన ఆ విహార యాత్ర కృపాసింధు మిశ్రా చేత 'కోణార్క' అనే ప్రసిద్ధ చరిత్ర గ్రంథాన్ని వ్రాయించింది. పండిత్ నీలకంఠదాస్ చేత 'కోణార్క' అనే పేరుతోటే ఒక ప్రసిద్ధ కావ్యాన్నీ రచియింప జేసింది.

## క్రమశిక్షణ

వసతి గృహాన్ని ఒక వినూత్న పథకం మీద చక్కగా నిర్మించారు. వాటిని 'బ్లాక్'లుగా విభజించి, ఒక్కొక్క 'బ్లాక్'నీ ఒక్కొక్క ఉపాధ్యాయుని పర్యవేక్షణ క్రింద ఉంచారు. ప్రతి 'బ్లాక్'కీ ఒక విద్యార్థి 'మానిటర్' కూడా ఉండేవాడు. తర్వాత ఈ మానిటర్ల సంఖ్యని ముగ్గురికి పెంచారు. ఒక్కొక వ్యవహారం బాధ్యత ఒక్కొక్కరికి అప్పగించారు. ఒకరికి విద్యార్థుల చదువు సంధ్యల బాధ్యత, రెండోవారికి జమాఖర్చు లెక్కల బాధ్యత, మూడవ వారికి విద్యార్థుల సాధారణ ప్రవర్తన బాధ్యత అప్పజెప్పారు. అక్కడ ఒక పద్ధతి అమలులో ఉండేది. బసచేస్తున్న విద్యార్థులు మితిమీరి వ్యయం చెయ్యడం అరికట్టేందుకు తల్లిదండ్రులు వారికి పంపే డబ్బు నెలనెలా హెడ్ మాస్టరు పేర పంపే ఏర్పాటు చేశారు. ఆయన దాన్ని 'బ్లాక్' మానిటర్‌కు అందజేసేవాడు. విద్యార్థికి ఆడబ్బుని చిన్నమొత్తాలలో

యిచ్చి), అతని చేత ఖర్చు తాలూకు లెక్క విధిగా వ్రాసి ఉంచేటట్లు చెయ్యడం, 'బ్లాక్' మానిటర్ చేసేవాడు. వసతి గృహంలో మొత్తం మూడు 'బ్లాక్'లు ఉండటంతో తొమ్మిది మంది మానిటర్లు ఉండేవారు. ఈ మానిటర్లు తరుచు రహస్య సమావేశాలు జరిపి వసతి గృహంలో క్రమశిక్షణకు సంబంధించిన సమస్యల్ని చర్చించేవారు. అందుకు వారికి తగిన రక్షణ ఉండేది. చిన్న సమస్యల్ని వాళ్ళే చర్చించి పరిష్కరించేవాళ్ళు. గడ్డు సమస్య అయితే వసతి గృహ పర్యవేక్షకునికి అప్పగించేవారు. లేదా హెడ్ మాస్టరుకి తగిన చర్య తీసుకునేందుకు వీలుగా నివేదించేవారు. ఈ మానిటర్ల సమావేశాన్ని 'విద్యార్థుల సొంత న్యాయస్థానం' గా అభివర్ణించేవారు.

చదువులో వెనుకబడిన విద్యార్థుల కోసరం ప్రత్యేక బోధనా తరగతుల్ని నిర్వహించేవారు. ప్రతి తరగతినీ ఆయా విషయాల్లో నిష్ణాతులై చక్కగా బోధించగల ఉపాధ్యాయుల పర్యవేక్షణలోనే ఉంచేవారు. పాఠశాల యొక్క లక్ష్యశుద్ధిని నిరూపించేందుకు ఒక ఉదంతం చెబుతాను. 1915లో పండిత్ నీలకంఠదాస్ సత్యవాది హైస్కూలుకి చేరువలో ఒక సంస్కృత పాఠశాలను ఏర్పాటు చేశాడు. దీని ఉద్దేశం పాఠశాల విద్యార్థుల్లో సంస్కృత భాషా విజ్ఞానం పట్ల, సంస్కృతి పట్ల అభినివేశాన్ని పెంపొందించడం. హై స్కూల్లో చదువుతోబాటు (సంస్కృత) ప్రథమ' పరీక్షకు కూర్చునేందుకు ముగ్గురు సీనియర్ విద్యార్థులను నీలకంఠ ఎంపిక చేశాడు. ఈ విద్యార్థులు మొదట్లో పాఠశాలలు రెండింటిలోనూ తరగతులన్నింటికీ శిక్షణ నిచ్చే బాధ్యత వహించాడు. నీలకంఠకు సంస్కృత పరిజ్ఞానం బాగానే వున్నా, సంస్కృత భాషా పరీక్షలకు విద్యార్థుల్ని తయారు చేసే టంత పాండిత్యం లేదు. అందువల్ల ఆయన పాఠ్య గ్రంథాల్ని చదివి తను మొదట బోధపరచుకొని, విద్యార్థులకు బోధపరిచాడు. అలాంటి శ్రద్ధతో చేసిన కృషి మూలంగానే, ఆ ముగ్గురు విద్యార్థులూ పరీక్షలో మంచి అర్హతతో కృతార్థులయ్యారు.

## ఛాందసంతో పోరాటం

సాక్షిగోపాల్ వసతి గృహంలో అందరూ కలిసి పంక్తి భోజనం చెయ్యడం అక్కడి పద్ధతుల్లో ఒకటి. ఆ ప్రాంతపు ఛాందస బ్రాహ్మణుల్నీ తదితర అగ్రవర్ణాల వారినీ ఆవేశించి ఉండిన సామాజిక దురాచారాలను పెకలించి వెయ్యాలని ఉపాధ్యాయులు బద్ధకంకణులయ్యారు. గోపబంధుకూడా ఈ ఆదర్శాన్ని తనలక్ష్యంగా పెట్టుకున్నాడు. నీలకంఠ గోదావరీశులు ఆ లక్ష్య సాధనలో ఆయన బాసట

నిలవడానికి సంసిద్ధులయ్యారు. నీలకంఠ మీసం పెంచాడు. అలా చెయ్యడం బ్రాహ్మణ కులంలో ఒక విడ్డూరం. ఆ ప్రాంతంలో అది నిషిద్ధం కూడా. అందువల్ల బ్రాహ్మణ్యం నిరసన ఆయనకు తప్పలేదు. ఒక సందర్భంలో ఆయన తండ్రిని, కౌమారుని అనాచారం కారణంగా, బ్రాహ్మణులు పంక్తి బాహ్యుని చేసి తమతో కలిసి భోజనం చెయ్యనివ్వలేదు. బ్రాహ్మణ్యానికి సవాలుగా నీలకంఠ 'నామీసం' అనే వ్యాసం వ్రాసి 'ఉత్కళ సాహిత్య పత్రిక'లో దాన్ని ప్రచురించాడు. అప్పట్లో ఆ పత్రిక ప్రముఖ సాహిత్య పత్రిక. ఆ వ్యాసాన్ని రాయ్ బహదర్ మధుసూదనరావు మెచ్చుకున్నాడు. ఆయన ఒరిస్సా భక్త కవుల్లో అగ్రగణ్యుడు. నీలకంఠ వరవడి గోదావరీశ్, హరిహరులు కూడా అనుసరించారు. అంతేకాకుండా అన్ని వర్ణాల విద్యార్థులూ కలిసి భోజనం చెయ్యడం, కలిసి ఎంగిలి పళ్లేలు శుద్ధి చెయ్యడం అక్కడి పద్ధతి. బ్రాహ్మణ ఛాందసానికి అది గొడ్డలి పెట్టుగా భావింపబడటం వల్లనే, 1912లో పాఠశాలని అగ్నికి ఆహుతి చేసే ప్రయత్నం జరిగింది.

వసతి గృహంలో నిషేధాలూ ఉండేవి. గుడగుడ, తమ్ములం, బీడీ, భంగ్ వంటివీ, మాదక ద్రవ్యాలూ నిషిద్ధం. అలాగే కాల క్షేపం కోసరం ఆడేపేకాట, పాచిక లాట, తదితరమైన పందెం ఒడ్డే ఆటలన్నీ నిషిద్ధం. లైంగిక ప్రవర్తనలో ఏ విద్యార్థి అయినా దారి తప్పితే, అతణ్ణి యితరుల నుంచి వేరు చేసి, ఒక మట్టి గుడిసెలో ఏకాంతంగా ఉంచి, కార్తీక మాసంలో ఉపోషం ఉండే ఆడవాళ్లకు మల్లే, ఒక పూట మాత్రమే తిండిపెట్టేవారు. అలా ఏకాంత వాసం విధించిన కాలంలో అతనికి బ్రహ్మ చర్యాన్ని గూర్చి పాఠాలు చెప్పేవారు. ఉపాధ్యాయులకు అతనిలో మనో పరివర్తన వచ్చిందని నమ్మకం కలిగిన తర్వాత మిగతా విద్యార్థులతో కలిసి ఉండటానికి అనుమతించేవారు. ఎవడైనా విద్యార్థి అల్లరివాడుగా కనిపిస్తే అతణ్ణి మానిటర్‌గా నియమించేవారు. మానిటర్లు తమ స్నేహితుల మీద పితూరీలు చెప్పడం అలావాటే గనుక వారిని 'మాడల్స్' అంటూ పిలిచేవారు. అలా పిలవడం నిరసననే తెలిపేది.

## శరీర వ్యాయామం

తనవిద్యార్థి దశలో గోపబంధు బెంగాల్‌కు చెందిన హింసావిప్లవ వాది శశిభూషణ్ రాయ్ ప్రభావానికి లోనై, 'అఖిరాస్' అనే గ్రామీణ వ్యాయామశాలల్ని ఏర్పాటు చేసి, ఒరిస్సాయువతకు శరీర వ్యాయామంతో బాటు లాఠీలు కత్తులు ఎలా ప్రయోగించాలో శిక్షణ యిప్పించే ప్రయత్నం చేశాడు. అటువంటి వ్యాయామ

శాలనే ఈ పాఠశాలలో కూడా ఆయన ఏర్పరిచాడు. వాసుదేవ మహాపాత్రో అనే ఉపాధ్యాయుడు దాని అధిపతి. విద్యార్థులకు అక్కడ క్రీడలూ, పల్లెటూరి ఆటలూ, నాలుగుమైళ్ల పరుగు పందాలు, గుంపులుగా విభజించి నేర్పేవారు. 'పారలల్ బార్స్' కూడా ఉండేవి. రోజూ పాఠశాల కార్యక్రమం ముగిశాక, విద్యార్థులకీ వ్యాయామ శిక్షణ ఉండేది. ఒక్కొక సారి వేకువ జామున కూడా ఉండేది. గోదావరీశ్, మరి కొందరు ఉపాధ్యాయులు కూడా యిందులో పాల్గొనేవారు. ఇలా కలిసి వ్యాయామం చెయ్యడం విద్యార్థులకు ప్రోత్సాహజనకంగా ఉండేది.

## కాలక్రమ ప్రణాళిక

పాఠశాల కాలక్రమ ప్రణాళిక చక్కగా ఏర్పాటై, అందరూ వేళకు తమ విధులకు హాజరు కావడం ప్రధాన విషయంగా నిర్దేశింపబడింది. భోజన సమయంలో విద్యార్థుల్ని రెండు గుంపులుగా విభజించి, పద్నాలుగేళ్ల వయస్సు వరకూ గల చిన్న వాళ్లను ఒక వంతుగానూ, అంతకు పై బడిన వయస్సు వాళ్లను మరొక వంతు గానూ, భోజనం వడ్డించేవారు. విద్యార్థులందరూ వేకువ ఝామునే నిద్రలేవడం విధాయకం. ప్రార్థనా సమావేశంలో ఉపాధ్యాయుల్లో ఒకరు ప్రార్థన ప్రయోజనం గురించి వివరించి, కొన్ని గీతాలను అందరి చేతా పాడించేవారు. పాఠశాల ప్రచురించిన ప్రార్థన గీతాల పుస్తకం, ఒ పైసా మూల్యం గలది. విద్యార్థులందరూ ఈ ప్రార్థన సమయంలో ఉపయోగించేవారు.

## వసతి గృహనిబంధనలు

పాఠశాల వసతి గృహ నిర్వహణకు సంబంధించిన నమూనా నిబంధనలు కొన్ని దిగువ సూచిస్తాను.

మానిటర్ విధులు : 1. కాలక్రమణిక ననుసరించి విద్యార్థుల చదువుని పర్యవేక్షించుట. 2. విద్యార్థుల ప్రవర్తనను, ఉపదేశం, శిక్ష, వ్యక్తిగత ఆదర్శం ద్వారా చక్కదిద్దుట. 3. ప్రతి విద్యార్థి దినసరి ఖర్చు లెక్క వ్రాసి పొదుపు పాటించేట్లు చూచుట. 4. విద్యార్థులు బజారులో తినుబండారాలు కొనకుండా చూచుట. 5. విద్యార్థులు తరగతులు జరుగుతున్న వేళల్లో వసతి గృహానికి వచ్చి విశ్రాంతి తీసుకోకుండా ఉండేందుకు గదుల తాళాల్ని ప్రొద్దున 10 గంటల నుంచీ సాయంత్రం 4 గంటల దాకా తనవద్ద ఉంచుకొనుట. 6. ఆరోగ్య లోపంలేని

విద్యార్థులందరూ ప్రార్థన, సాయంత్రం, ప్రార్థన మందిరానికీ, వ్యాయామశాలకూ హాజరయ్యేలా వాళ్లకు నాయకత్వం వహించుట. 7. వసతి గృహంలో విద్యార్థుల హాజరు తీసుకొనుట. 8. విద్యార్థులు వసతి గృహంలో చదువు కునేందుకు నిర్ణీతమైన వేళల్లో ఎవరూ బయటికి వెళ్ళకుండా చూచుట. 9. వసతి గృహంలోనూ పాఠశాలలోనూ కాలక్రమణికలు అమలు జరిగేట్లు చూచుట.

వసతి గృహం విద్యార్థులెవరి మీదనైనా మానిటర్ గృహాధికారియైన ఆచార్య హరిహరదాస్‌కి గాని, హెడ్‌మాస్టర్ పండిట్ నీలకంఠదాస్‌కి గాని, ఆరోపణలు చేస్తే, అవి శ్రద్ధతో పరిశీలింపబడేవి.

భోజనం తాలూకు ఏర్పాట్లు ప్రజాస్వామ్య సూత్రాల ననుసరించి నిర్వహింపబడేవి. విద్యార్థులచే ఎన్నుకోబడిన ఒక విద్యార్థి ప్రతి నిధుల సమాఖ్య ఆ నిర్వహణ భారం వహించేది. ఆ సమాఖ్యలో 45 మంది ఉండేవారు. అందులో రోజుకి ముగ్గురు చొప్పున బజారు వెళ్లి సరుకులు కొనుగోలు చేసేవారు. కొనుగోలు చేసిన లెక్కల వివరాలు మేనేజరుకి అప్పగించాలి. మేనేజరు జీతం మీద నియమించబడిన ఉద్యోగి. విద్యార్థులు ఒక కార్యదర్శిని కూడా ఎన్నకొనేవారు. అతను భోజనపు ఏర్పాట్లను పర్యవేక్షిస్తూ, లెక్కల్ని, కమిటీ ముందు నివేదించడానికీ, మంచి భోజనం తయారు కావడానికీ, తదితర విషయాలనకూ బాధ్యత వహించేవాడు.

పైన చెప్పిన విధంగా సత్యవాది హైస్కూలూ, దాని వసతి గృహాలూ, క్రమశిక్షణలోనూ, ప్రజాస్వామ్య సూత్రాలననుసరించి వ్యవస్థానిర్వహణలోనూ, విద్యార్థులకు ఆదర్శ జీవనాన్ని బోధించడంలోనూ, చక్కని శిక్షణా రంగంగా రూపొందాయి. ఈ సంస్థ నడిచిన పదేళ్ల స్వల్ప కాలంలోనూ, అక్కడ చదువుకున్న వాళ్లు తాము గడిపిన మహత్తర క్షణాల్ని జీవితాంతమూ జ్ఞాపకం ఉంచుకున్నారు. అక్కడ ఎవరి సాహచర్యంలో వారు గడిపారో, ఆ వ్యక్తులే దేశంలో తర్వాత ఉదాత్త పురుషులుగా ఖ్యాతి పొందారు. 'సత్యవాది' అన్న పదమే ఘనతకు చిహ్నమై, ఆ పాఠశాల ముద్ర అక్కడ చదువుకున్న వాళ్ళ తర్వాతి జీవితం మీదా, ప్రవర్తన మీదా అచ్చుగుద్దినట్లు గోచరిస్తూ ఉండేది.

# 9

# శాసన మండలిలో

1912లో బీహార్- ఒరిస్సాలను లెఫ్టినెంట్ గవర్నర్ పాలనలో ఒక ప్రత్యేక రాష్ట్రంగా వ్యవస్థీకరించారు. గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్ట్ 1909 అనుసరించి ఒక శాసన మండలి ఏర్పాటైంది. అందులో అదనపు సభ్యులు అనే పేరుతో కొందరు ఎన్నుకోబడిన సభ్యులు ఉండేవారు. పురపాలక సంస్థల వంటి స్థానిక పరిపాలనా సంస్థల తరఫున ఒక అదనపు సభ్యుడు ఒరిస్సా నుంచి ఎన్నిక అయ్యేవాడు. గోపబంధు ఆ ఎన్నికకు నిలబడాలని ఉత్కళగౌరవ మధు సూదనదాస్ సూచించాడు. ఒరిస్సాకు ప్రాతినిధ్యం వహించేందుకు అంతకంటె అర్హుడైన వ్యక్తిలేడని ఆయన అభిప్రాయం. గోపబంధుకు శాసన మండలి ప్రవేశం సహజం గానే యిష్టంలేదు. అప్పట్లో అది ఏర్పాటు చెయ్యబడే పద్ధతిని బట్టి ఆనాటి ప్రభుత్వ పరిపాలనను ప్రభావితం చెయ్యడం ఎవరికీ సాధ్యమైన విషయం కాదు. ప్రజల కష్టాలను తద్వారా నివారించడమూ అసాధ్యమే. ఆనాటి పరిపాలనా వ్యవస్థ గవర్నర్- యిన్- కౌన్సిల్ చేతుల్లో ఉండేది. అది ప్రజాభిప్రాయాన్ని పట్టించుకునేది కాదు. అటువంటి బాధతా రహితమైన పాలకవ్యవస్థను, ప్రజలకష్టకునేది కాదు. అటువంటి బాధ్యతారహిత మైన పాలకవ్యవస్థను, ప్రజలకష్ట నిష్ఠూరాల కథలు వల్లించడం ద్వారా కదిలించడం అంటే అది జరిగేపని కాదు. సమాజసేవే తన ధ్యేయంగా ఎన్నుకొన్న గోపబంధు, తన స్థానం ప్రజల మధ్యనే స్థిరంగా ఉండాలనీ, ప్రజాసేవనుంచి తన దృష్టి మళ్లే విధంగా శాసన మండలి సభ్యత్వాన్ని అంగీకరించడం కుదరదనీ అభిప్రాయపడ్డాడు. కాని ఆనాటి ఒరిస్సాలో సాటిలేని మేటి నాయకుడైన మధుసూదన్ మాట సుగ్రీవాజ్ఞ వంటిది కావడంతో ఆయన సూచనను త్రోసిపుచ్చడం వీలుకాలేదు. గోపబంధు అభ్యర్థిగా నిలబడటానికి అంగీకరించాడు. మధుసూదన్ రాష్ట్రంలోని పురపాలక సంస్థల సభ్యులకు స్వయంగా లేఖలు వ్రాసి తోడ్పడటంతో గోపబంధు 1917లో ఎన్నికయ్యాడు.

శాసన సభ్యుడుగా నాలుగు ప్రధాన సమస్యలపై గోపబంధు తన దృష్టి కేంద్రీకరించాడు. 1. ఒరియా భాష మాట్లాడే ప్రాంతాలు, బెంగాల్, మధ్యపరగణాలు, మద్రాస్, బీహార్, ఒరిస్సా రాష్ట్రాలలో చెదరిపోయి ఉన్నవాటిని

సమైక్యపరచి ఒకే పాలనా వ్యవస్థక్రిందికి తీసుకురావడం. 2. వరదలూ క్షామాలూ నివారించేందుకు శాశ్వత పరిష్కార మార్గాలు రూపొందించడం. 3.ఎక్సైజ్ సుంకం లేకుడా ఉప్పు తయారు చేసే హక్కు ఒరియావాళ్ళు మళ్ళీ పొందేలా చూడటం. 4. సత్యవాది వరవడిలో విద్యావ్యాప్తి.

శాసన సభ్యుడుగా ఆయన చేపట్టిన మొదటి కార్యం, ఒరియా భాషాప్రాంతాల సమైక్యాన్ని కోరుతూ తీర్మానాన్ని ప్రవేశ పెట్టడం. అందులో సింగ్‌భూమ్ ప్రథమంగా ఆయన దృష్టి నాకర్షించింది. సింగ్ భూమ్ ప్రాంతంలో పలుచోట్ల తిరగడమే కాకుండా, ఆ జిల్లాలో దీన స్థితిలో ఉన్న ఒరియా వాళ్ల గుండెల్లో ధైర్య సాహసాల్ని నింపి, తన సహచరుల సహకారంతో అక్కడ పాఠశాలల్ని నెల కొల్పాడాయన. తద్వారా దేశాభిమానం వారిలో రగులుతూనే ఉండేటట్లు చేశాడు. తన సహచరుల్లో కార్య దీక్షకు పేరువడ్డ పండిత్ గోదవరీశ్ మిశ్రాను ఎన్నికచేసి చక్రధరపూర్‌లో స్థాపించిన ఒరియా హైస్కూలుకు హెడ్ మాస్టరుగా నియమించాడు. దానికి తనే కార్యదర్శి. పోరాహత్, ధాల్ భూమ్ సబ్- డివిజన్లలో ఎన్నో ప్రాథమిక పాఠశాలల్ని నెలకొల్పాడు. ఆయన సహచరుల్లో మరొక శిష్టుడు వసుదేవ మాహాపాత్ర, బాహరాగొరాలో మిడిల్ యింగ్లీషు స్కూలు స్థాపించేందుకు నియుమితుడయ్యాడు. అది తర్వాత హైస్కూలుగా మారింది. ఒరియా జాతీయతను అక్కడి ప్రజల్లో వ్యాపింప జేయుడానికి గోపబంధు బహుమతి ప్రధానోత్సవాలను ఏర్పాటు చేసేవాడు. ఆ సందర్భంలో అధ్యక్షత వహిస్తూ, ఉన్న పాఠశాలలను చక్కగా నడుపుకోవలెననీ, కొత్త వాటిని స్వయం కృషితో ఏర్పాటు చేసుకోవలెననీ ప్రజల నుద్బోధించేవాడు. సింగ్‌భూమ్ ప్రాంతంలో ఒరియా ఉద్యమాన్ని నడపడంలో రాధానాథ్ రథ్ ఆయనతో చేతులు కలిపాడు. గోపబంధు మధ్య పరగణాల్లోని ఫూల్‌జార్, ఖారియార్, పద్మపూర్, చంద్రపూర్ ప్రాంతాలను కూడా దర్శించాడు. మిడ్నపూర్ లోని ఒరియా వాళ్లను బెంగాల్ ప్రభత్వం, రాజద్రోహ నేరారోపణ చేసి, కఠినంగా అణచి వేసింది. గోపబంధు స్థానిక ప్రభుత్వాధి కారుల్ని లెక్కచెయ్యకుండా అక్కడికి వెళ్లి మిడ్నపూర్ ఒరియా ప్రజల్లో జాతి చైతన్యాన్ని వ్యాపింపజేశారు. ఆయన మద్రాస్ రాష్ట్రంలోని జయపూర్, విశాఖ పట్టణం ప్రాంతాలకు కూడా వెళ్లి అక్కడి వాళ్లలో ధైర్య స్థైర్యాలను పురికొల్పాడు.

## వరద, వరపు సమస్యలు

వరదవల్ల, వరపువల్ల బాధపడే ప్రజలకు సేవచెయ్యడం ఆయనకు ప్రీతి పాత్రమైన రెండవ లక్ష్యం. ఒరిస్సాలో వరదలు తరుచు వచ్చే ఈతి బాధ. మహానది, కట్జూరి,

విరూపా, బ్రాహ్మణి, వైతరణి, ఖరస్రోత, సాలంది, సువర్ణరేఖ వంటి పెద్దనదులు, మనుష్య నిర్మాణాల్ని కూల ద్రొయ్యడం, వాటిని ప్రజలు మళ్లీ కట్టుకుంటూ ఉండటం పరిపాటి. ఇవి ప్రకృతి సహజమైన ఈతిబాధలే అయినా, వరదల వల్ల సంభవించే నష్టాన్ని తగు సమయంలో పూరించడం, బాధితులకు తగురీతి సాహాయ్యం అందచేసి ఆదుకోవడం ప్రభుత్వం బాధ్యత. ఒరియా ప్రజలు ప్రతి సంవత్సరమూ వరదల వల్ల బాధ పడుతూనే ఉన్నప్పటికీ, ప్రభుత్వం ఒరియా ప్రజలను ఆదుకోవలెనంటూ నచ్చజెప్పే తన ప్రయత్నం విఫలమైతే, తాను అటుపై శాసనమండలి సభ్యుడుగా కొనసాగడం అనవసరమేనని గోపబంధు భావించాడు. 1919లో పూరీ జిల్లాలో క్షామం ఏర్పడింది. వార్తా పత్రికల ద్వారా ప్రజల దుస్థితిని గూర్చి హృదయ విదారక ఉదంతాలు. గోపబంధుకి తెలిశాయి. ఆయన ప్రభుత్వేతర సాహాయాన్ని పెద్ద ఎత్తున సంఘటిత పరిచాడు. భారతదేశం నలుమూలల నుంచీ సాహాయం ధారాపాతంగా వచ్చింది. కాని ప్రభుత్వానికి ఆయన చేసిన విజ్ఞప్తులు మాత్రం ఫలించలేదు. పూరీలో క్షామ పరిస్థితి నెలకొని ఉన్నట్లు ప్రకటించడంగాని, క్షామానికి అన్వయించే ప్రభుత్వ సూత్రాల ప్రకారం సాహాయం అందించే ప్రయత్నంగాని ప్రభుత్వం చెయ్యలేదు. ప్రజలు అపారనష్టానికి గురియైన విషయం ప్రభుత్వం గుర్తించలేక పోయింది. అందువల్ల ఆయన 1920 మార్చి 13 తేదీ శాసన మండలి సమావేశంలో ఈ సమస్యను ప్రస్తావించాడు. బడ్జెట్‌లో పందొమ్మిది వేల రూపాయల్ని మాత్రమే క్షామ నివారణకు పద్దుగా చూపించడం ఏ మాత్రమూ చాలదనీ, ఆ పద్దుని యాభైవేలకు పెంచవలసిందనీ, దానికి అనుగుణంగా పోలీసు పద్దునుంచీ ముప్ఫై యొక్క వేల రూపాయలను తగ్గించవలసిందనీ ఆయన ప్రతిపాదించాడు. ఇక్కడ ఒకవిషయం గుర్తుంచుకోవాలి. ఒక ప్రాంతం క్షామ ప్రాంతంగా ప్రకటించి నట్లయితే, బారత ప్రభుత్వం ఆ ప్రాంతానికి సాహాయం నిమిత్తం అయ్యేమొత్తం ఖర్చులో 75 శాతం విధిగా యివ్వవలసి ఉంటుంది. అంటే, దాని అర్థం, రాష్ట్ర ప్రభుత్వం యాభైవేలు అందుకోసం మంజూరు చేస్తే, భారత ప్రభుత్వం లక్షాయాభైవేలు యివ్వవలసి ఉంటుంది. ఆ విధంగా మొత్తం అంకె రెండులక్షలకు పెరిగే అవకాశం ఉంది. ఆయన ప్రజల స్థితిగతులను కన్నులకు కట్టేలా వివరాలతో ప్రభుత్వాన్ని విమర్శించాడు. క్షామపీడితులైన ప్రజలు ఆహారంగా తింటున్న తవుడునీ, ఆకులలములనీ ప్రత్యక్షంగా చూపించి, వారి ఫోటోలను సభ్యులకు అందజేశాడు. ఈ విషయాలు చెబుతూ ఆయన కన్నీళ్ల పర్యంతం అయి విలపించడం, సభ్యుల హృదయాల్ని ద్రవింపజేసింది. వారందరూ ప్రభుత్వాన్ని తగిన సహాయ చర్యలు తీసుకోవాలని ఒత్తిడి చేశారు. కాని ఆనాటి ప్రభుత్వం చాలకఠిన మైంది. దానికి దేశ ప్రజల

పట్ల సుతారామూ సానుభూతి లేదు. పండిత్ గోపబంధుకు సమాధాన మిస్తూ, నాటి ఒరిస్సా డివిజన్ కమీషనర్ గ్రన్నింగ్ మహాశయుడు (అధికార వర్గ సభ్యుడుగా మండలిలో హాజరై ఉన్నాడు) యిలా అన్నాడు. ''కష్టాలను అతిశయోక్తులతో చిత్రించడం గోపబంధుకి అలవాటే. అదే చేశారాయన యిక్కడ కూడా. నేను స్వయంగా క్షామ ప్రాంతాల్ని సందర్శించాను. నేను చూసి వచ్చిన దానిని బట్టి పరిస్థితి అంతదారుణంగా లేదని చెప్పగలను. పూరీ జిల్లా బోర్డు వైస్-చైర్మన్ నాతో రమారమి రెండువేలమంది ప్రజలు మాత్రమే ఉపకార సాహాయానికి అర్హులు అనిచెప్పారు. అయిదు 'చౌకీదారీ' యూనియన్లలోనూ చాలకొద్దిమంది మాత్రమే క్షామ బాధకు గురి అయ్యారు. పూరీ జిల్లా మేజిస్ట్రేట్ వారికి సాహాయాన్ని అందజెయ్యడానికి అవసరమైన ఏర్పాట్లు చేస్తున్నాడు. చేయవలసిందంతా చెయ్యమని నేను ఆయనకు ఆదేశాలిచ్చి ఉన్నాను.'' కమీషనర్‌దే గెలుపు అయింది ఆ సందర్భంలో. బడ్జెట్‌లో పద్దుని పెంచడానికి సబబు లేదని ప్రభుత్వం అన్నది. ''ఒకవేళ ఎక్కువ ధనంకావలసి వస్తే అప్పుడు యివ్వవచ్చు'' నన్నది. ప్రభుత్వనిర్దాక్ష్యణ్యానికి గోపబంధు నివ్వెరపోయి యిలా అన్నాడు. ''గ్రన్నింగ్ మహాశయుడు ఆరు ఏడురోజుల క్రితం కేవలం ఒక్క పర్యాయం క్షామ ప్రాంతానికి వెళ్లి వచ్చారు. ఆయన కారులో వెళ్ళి కారులో తిరిగివచ్చారు. దారుణ పరిస్థితుల్లో చిక్కుకున్న గ్రామాలకు కారుమీద వెళ్లడానికి దారిలేదు. ఆయన ఆ ప్రదేశాల్ని చూడనే లేదు. నేనా గ్రామాల్ని నాలుగు సార్లు చూశాను.'' గ్రన్నింగ్ అన్నాడు. ''వాతావరణం బాగులేదు. రహదారి అధ్వాన్నంగా ఉంది. ఆగ్రామాలకు నేనెలా వెళ్లేది? గోపబంధు ఆ ప్రదేశాలకు వెళ్లమని నన్ను కోరినమాట వాస్తవమే. కాని నేను వెళ్లలేకపోయాను.'' గోపబంధు తన ప్రసంగం కొనసాగించాడు. ''ప్రభుత్వం అధికారవర్గ సభ్యుడితో సహా మరొక అదనపు సభ్యుడ్ని పంపించి ఉంటే, నేను చెప్పిన సంగతుల్ని త్రోసి పుచ్చడానికి వీలుండేది కాదు. గ్రన్నింగ్ గారు కూడా నేను అతిశయోక్తులతో పరిస్థితిని చిత్రంచినట్లు చెప్పి ఉండేవారుకారు. అయిదు యూనియన్ల సంగతికి వస్తే, ఎన్ని యూనియన్లు క్షామపరిస్థితికి గురి అయ్యాయో వాటి సంఖ్య తూచి చెప్పలేనుగాని, మండలిలో నా ప్రశ్నకు సమాధానంగా యివ్వబడిన సమాచారాన్ని బట్టి మూడు ఠాణాల్లో రమారమి రెండువందల యాభై గ్రామాలు దుర్భిక్షానికి గురియైనట్లు నేను చెప్పడంలో పొరపాటు లేదు. ఏమైనా, అధికారవర్గం వారూ, అనధికారపక్షం వ్యక్తినైనా నేనూ, ఒక అంగీకారాని రాలేని విషయాన్ని గూర్చి పదే పదే చర్చించి ప్రయోజనమూ లేదు. ప్రజలొకవైపు ప్రాణాలు కోల్పోతున్నారు. నేను కళ్లతో చూసి వచ్చిన పరిస్థితి అది. నా కళ్లను

నేను నమ్మకుండా ఉండలేను. ఇంతకంటే నేను చెప్పగలిగిందీ లేదు. ఈ విషయాన్ని ఆజమాయిషీ చేసే గౌరవ సభ్యుడు మాట యిచ్చారు – క్షామం అనే ప్రకటన చెయ్యడానికి తగిన ఉపపత్తి చూపిస్తే ధనం మంజూరు అవుతుందని. మీరు క్షామం అనే ప్రకటన చెయ్యండి, చెయ్యక పొండి, కాని మనుష్యులు చావకుండా చూడండి! ఇదీ నా అభ్యర్థన'' గౌరవనీయులు గన్నింగ్ గారు అన్నారు– చెయ్యదగిన దంతా చేశామనీ, చేస్తున్నామనీ, మంచిదే, ప్రభుత్వోద్యోగులు యింతవరకు చేసిన దాన్ని నేను తప్పుపట్టడం లేదు. ఇప్పుడింకా చెయ్యవలసిన దాన్ని గూర్చే అర్థిస్తున్నాను. ఒక చిన్న జిల్లాలో కొంత ప్రాంతం దుర్భిక్షం పాలైతే దానికోసరం రాష్ట్ర బడ్జెట్‌లో ఖర్చుని పెంచవలసినంత కారణం కనిపించడం లేదని కూడా అన్నారు. ఆ ప్రాంతం చిన్నదో పెద్దదో అది ప్రశ్న కాదిక్కడ. చక్రవర్తి సామ్రాజ్యంలో భాగమైన యీ రాష్ట్రంలో ఏదో మారుమూల ఒక్క మనిషి అయినా సరే, తిండికి లేక ప్రాణాలు విడస్తే, అతని చావు బాధ్యత నా మీద ఉంటుందనీ, నామీదేకాదు, ఈ పరిపాలన బాధ్యతను ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ వహించే వారందరి మీదా ఉంటుందనీ నేను భావిస్తున్నాను. ఈ మాట చెప్పి గౌరవనీయులైన మీ చేతుల్లో ఈ విషయాన్ని వదలి పెడుతున్నాను.''

గోపబంధు మాటలు లెఫ్టినెంట్ గవర్నర్ సర్ ఎడ్వర్డ్ గెయిట్ హృదయాన్ని కదలించినవి. ఆయన 1920 ఏప్రిల్ 7వ తేదీ పూరీజిల్లా లోని క్షామ పీడిత ప్రాంతాన్ని దర్శించాడు. జిల్లా ఉద్యోగులు లెఫ్టినెంట్ గవర్నర్ పర్యటనను అనధికారులైన నాయకులకు తెలియకుండా రహస్యంగా ఉంచారు. సర్ ఎడ్వర్డ్ స్వయంగా గోపబంధుకు లేఖ వ్రాసి ఆయన్ని తనతో పర్యటనకు రావలసిందిగా కోరినట్లు వాళ్లెరగరు. గన్నింగ్ మహాశయుని కారు వెళ్లలేకపోయిన గ్రామాలను సర్ ఎడ్వర్డ్ వెళ్ళి చూశాడు. ప్రజలు ఆకులలములు తిని ప్రాణాలు దక్కించుకొని ఉండటం ఆయన స్వయంగా చూశాడు. అక్కడి స్త్రీలు ధరించిన ఇత్తడి నగల్ని గన్నింగ్ మహాశయుడు బంగారమని పొరబడినట్లు కూడా ఆయన గ్రహించాడు. అంతా చూసిన తర్వాత మనస్సు చెదరి లెఫ్టినెంట్ గవర్నరు అన్నాడు. ''గోపబంధూ, దురదృష్టవశాత్తూ ప్రభుత్వం తన కర్తవ్యాన్ని నిర్వర్తించలేక పోయిందయ్యా'' ఇది ఒరిస్సా పరిపాలన మీద, పూరీ స్థానిక అధికారుల మీద, తీవ్రమైన విమర్శ. పూరీ జిల్లా మేజిస్ట్రేట్ దీనికి చిరాకు పడి పండిత్ లింగరాజ్ మిశ్రాతో ఒకసారి అన్నాడు. ''పూరీజిల్లాలోని గడ్డు సమస్యలు రెండు – ఒకటి క్షామం, మరొకటి గోపబంధు.''

గోపబంధు తన ప్రయత్నాల్ని మరికొంత ముందుకు తీసుకువెళ్లాడు.

బాధితులకు చేసే సహాయం కేవలం ఉపశమనం కలిగిస్తుంది. అంతకంటె శాశ్వతమైన ఏర్పాట్లకు పూనుకోవడం అవసరం. ఒరిస్సాలో వరదలు మళ్ళీ మళ్ళీ రాకుండా చెయ్యాలి. ఈ ధ్యేయంతో వ్రజసుందర దాస్, తానూ కలిసి శాసన మండలిలో ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. వరదల వల్ల నష్టపోయిన జిల్లాలను సర్వేజరిపి, వరదనిరోధానికి శాశ్వత మైన ఏర్పాట్లను సూచించేందుకు ఒక కమిటీ నియమించమని ఆ తీర్మానంలో కోరారు. ఆనాటి బాధ్యతా రహిత ప్రభుత్వం ఆ తీర్మానాన్ని అంగీకరించలేదు. కాని 1922-23లో ప్రభుత్వం ఒక వరదవిచారణ కమిటీని నియమించింది. దాని ఆధ్వర్యంలో చాలామంది ఇంజనీర్లు ఓవర్ సీర్లు, కటక్, పూరీ, బాలసూర్ జిల్లాల్లోని వరద బాధిత ప్రాంతాలను సర్వే చేశారు. సుమారు డెబ్బై వేల రూపాయలు ఆ సర్వే కోసరం ఖర్చయింది. కాని వరదనిరోధం కోసం గట్టి చర్య ఏదీ తీసుకోబడలేదు. చివరకు 1927లో వచ్చిన విధ్వంసకరమైన వరదల తర్వాత, ప్రభుత్వం 1928లో ఒక వరద నిపుణుల కమిటీని నియమించింది. వారి నివేదికలు మరికొన్ని నిపుణుల నివేదికలకు దారి తీసి, వాటి ఫలితంగా హిరాకుడ్ డామ్ ఒరిస్సాలో నిర్మితమైంది. కాని అప్పటికి గోపబంధు యశః కాయుడయ్యాడు.

## ఉప్పుతయారీ సమస్య

ఒరిస్సా సముద్ర తీర రాష్ట్రము. దాని నాలుగు జిల్లాలు - గంజాం, పూరీ, కటక్, బాలసూర్, బంగాళాఖాత తీరాన్ని అంటి పెట్టుకుని ఉన్నాయి. ప్రాచీన కాలం నుంచీ తీరప్రాంత ప్రజలు, క్షేత్రపద్ధతిలో ఉప్పు తయారీ చేసేవారు. కాని ఈస్ట్ యిండియా కంపెనీ ఒరిస్సాలో తన అధికారాన్ని ఏర్పరచుకొన్న తర్వాత ఆ హక్కు ప్రజల నుండి తీసివెయ్యబడి, ఉప్పు తయారీ మీద ప్రభుత్వం ఎక్సైజ్ సుంకాన్ని విధించింది. అంతే కాకుండా, అసలు ఉప్పు తయారు చేయడానికి ప్రభుత్వపు అనుమతి అవసరమైంది. పూరీ, కటక్, బాలసూర్ జిల్లాల్లోని ప్రజల దారిద్ర్యానికి కారణం వారి సహజమైన హక్కును కోల్పోవడమేనని గోపబంధు గ్రహించాడు. ఉప్పుతయారీలో ప్రజలపై ఎలాటి నిబంధనలు ఉండకూడదనే హక్కు కోసరం ఆయన ఆందోళన జరిపాడు. ఉప్పు నిత్యగృహావసర వస్తువు. దానిమీద ఎక్సైజ్ సుంకం వెయ్యడమూ, ప్రభుత్వమే దాని తయారీలో గుత్తాధికారం కలిగి ఉండడమూ, ఉప్పుధరని పెంచాయి. ఇది సామాన్యునికి బాధాకరమైంది. ఉప్పుతయారు చెయ్యడంలో ఒరిస్సాకు దీర్ఘ చరిత్ర ఉంది. ఒరిస్సా రేవుల్లో ఉప్పు అంతర్జాతీయ వ్యాపార వస్తువు. చిల్కా సరస్సూ, పారీకుడ్ ద్వీపమూ ఉప్పుతయారీలో ప్రసిద్ధి కెక్కినవి. ఆ ప్రాంతంలో తరుచు ఏర్పడే

దుర్భిక్షానికి కారణం ఉప్పుతయారీ హక్కు ప్రజలకు లేకపోయినందు వల్లనే. బాలసూర్ జిల్లాలోని ప్రజల పరిస్థితి కూడా అందువల్లే దుర్భరంగా ఉంది. గోపబంధు కిదంతా చాలా అన్యాయంగా తోచింది. ఆయన బీహార్ - ఒరిస్సా శాసన మండలిలో ఒక తీర్మానం ప్రవేశపెట్టాడు. ప్రభుత్వపు ఆజమాయిషీనుంచి ఉప్పుతయారీని విడుదల చెయ్యాలి. అని ప్రతి పాదించాడు. ఆసందర్భంలో ఆయన అభిభాషణం అంకెల వివరాలతో, స్పష్టమైన విశేషాలతో, పాత పత్రాలనుంచీ తీసుకొన్న ఉట్టంకింపులతో నిండి ఉన్నది. ఫలితంగా ప్రభుత్వం చిల్కాలో ఉప్పు పరిశ్రమను పునరుద్ధరించేందుకు మాటయిచ్చింది. టాటాస్ అండ్ కిల్‌బర్న్ కంపెనీ వారు ఉప్పుతయారీకి ఒక జాయింట్ స్టాక్ కంపెనీ పెట్టేందుకు ఆ ప్రాంతాన్ని సర్వే చేశారు. పండిత గోపబంధు చెప్పడం వల్ల లెఫ్టినెంట్ గవర్నరు సర్ ఎడ్వర్డ్ గెయిట్ స్వయంగా చిల్కా సరస్సుని దర్శించాడు. స్వేచ్ఛగా ఉప్పు తయారు చేసే హక్కుని ఒరియా ప్రజలకు తిరిగి యిస్తామని ఆయన హామీ యిచ్చాడు. కాని దురదృష్టం ఏమంటే, 1918లో ప్రపంచ యుద్ధం ముగియగానే లివర్‌పూల్ నుంచీ ఉప్పు దిగుమతి మళ్లీ ప్రారంభం అయిది. సర్వే చేసిన రెండు కంపెనీలు చిల్కా దగ్గర ఉప్పుతయారు చేసే ఖర్చులు ఎక్కువగా ఉండడం వల్ల, అక్కడ ఉప్పు తయారీ పెద్ద ఎత్తున ప్రారంభించడం లాభదాయకం కాదని నివేదిక యిచ్చాయి. ఏమైనప్పటికీ గోపబంధు ప్రారంభించిన యత్నం చివరకు ఫల ప్రదం అయింది. 1931లో గాంధీ-యిర్విన్ ఒడంబడిక ననుసరించి, ఒరిస్సా తీర ప్రజలు తమసొంత ఉపయోగానికి ఉప్పు తయారు చేసుకోవడానికీ, తలమీద మోసుకొని పోగలిగిన ప్రమాణంలో పొరుగు ప్రాంతాల్లో దాన్ని అమ్ముకోవడానికీ అనుమతి లభించింది.

## విద్యాసమస్య

విద్యను గూర్చి తనకున్న నవ్యభావాలు సత్యవాది హైస్కూలు ద్వారా ఆచరణలో పెట్టేందుకు గోపబంధు ప్రయత్నించాడు. 1921లో ఈ హైస్కూలుని జాతీయ పాఠశాలగా మార్చడం, చివరకు దాన్ని మూసివెయ్యవలసి రావడం, ఆయన ఆశయాలకు ఆఘాతం కలిగించింది. రాష్ట్ర మంతటా ఆయన ఆదర్శాలని వ్యాపింపజెయ్యడం కుదరలేదు. కాని ఆవైఫల్యం ఆయన్ని నిరుత్సాహ పరచలేదు. శాసన మండలిలో తనభావాలకు అధికార ముద్రలభించేలా చేయాలని ఆయన ప్రయత్నించాడు. ఆధునిక పాఠశాల ఏర్పరచేందుకు ఖరీదైన భవనాలు అవసరంలేదని ఆయన గుర్తించాడు. ఆ విషయం సత్యవాదిలో నికుంజ పాఠశాల ద్వారా నిరూపణ అయింది కూడా. శాసన మండలిలో ఆయన ఒక తీర్మానం

ప్రవేశ పెట్టాడు. భవనాలూ పరికరాలూ విషయంలో విద్యాశాఖవారి నిబంధనలను సడలించవమని ఆయున ప్రతి పాదించాడు. తన అభిభాషణంలో ఆయున మూసుకుని పోయిన కట్టడాలు విద్యార్థుల మానసిక, శారీరకాభివృద్ధికి పనికి రావని వాదించాడు. ఆరోగ్యానికి ఆరుబయల్లోని గాలీ వెలుతురూ అవసరమని వైద్యులు అభిప్రాయ పడుతూండగా, విద్యాశాఖ ఆదేశం అందుకు వ్యతిరేకంగా నడుస్తున్నది. బారతదేశంలో గ్రామాలే ఎక్కువ. ప్రతి గ్రామంలోనూ కొబ్బరి, మామిడి తోటలు ఉంటాయి. ప్రాచీన కాలంలో 'గురుకులాలు' అనబడే విద్యాబోధకుల గృహాలు ప్రకృతి సిద్ధమైన పరిసరాల్లో నెలకొని ఉండేవి. ఆ పద్ధతిని ఈనాడు పునరుద్ధరించక పోవడానికి తగు కారణం కనిపించదు. తోటల్లో పాఠశాలల్ని నెలకొల్పడం విద్యాశాఖ అనుమతించినట్లయితే, వర్షాకాలానికి అనువుగా ఒక గృహం ప్రక్కన ఉండినట్లయితే, విద్యా సౌకర్యాలు తొందరగా అన్ని చోట్లా వ్యాపింపజేసేందుకు వీలవుతుంది. ఈ సందర్భంలో సర్ ఎడ్వర్డ్ గెయిట్ సత్యవాది పాఠశాలలో 'ఆగంతుకుల పుస్తకం'లో వ్రాసిన వాక్యాల్ని గోపబంధు ఉదాహరించాడు. సర్ ఎడ్వర్డ్ యిలా వ్రాశాడు. ''క్రిక్కిరిసిన తరగతి గదుల్లో కంటె ఆరుబయట పాఠాలు చెప్పేపద్ధతి నన్నెంతో ఆకర్షించింది. దీని వల్ల పిల్లలు నిర్మలమైన గాలి వల్ల కలిగే లాభాల్ని గ్రహించి, తద్వారా తమ బంధువులు గాలిలేని యిళ్లలో నివసించే హానికరమైన పద్ధతిని విడనాడేట్లు శక్తి కొలది ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను. ఆ పద్ధతి యిప్పుడు సర్వ సాధారణంగా ఉండటమే కాకుండా, చాల ప్రాంతాల్లో క్షయవ్యాధి ప్రబలంగా వ్యాపించేందుకు కూడా హేతువవుతున్నది.''

## ఇతరవిజయాలు

శాసన మండలిలో గోపబంధు కృషి ఫలితంరగా, కటక్ రేవన్‌షా కాలేజిలో ఎం.ఏ. యింగ్లీషు తరగతులూ, బి.ఎల్. తరగతులూ ప్రారంభించారు. కటక్‌లో ఒక ఇంజనీరింగ్ విద్యాలయుమూ, పూరీలో ఒక సంస్కృత కళాశాల స్థాపింప బడ్డాయి. పాఠశాలల్లో, కళాశాలల్లో చదివే విద్యార్థుల్లో పదిశాతం ఉపకార వేతనం పొందేట్లు ఏర్పాటు జరిగింది. అంతే కాకుండా ఒరిస్సా నుంచీ ప్రతి సంవత్సరమూ ఒక అభ్యర్థిని ఎంపిక చేసి ఇండియున్ సివిల్ సర్వీస్ పరీక్ష నిచ్చేందుకు ఇంగ్లండు సంపవలెనని గోపబంధు గట్టిగా అభ్యర్థించాడు.

పై చెప్పిన కృషియే కాక, గోపబంధు పూరీలో శుభ్రపరచిన నీరు కుళాయిల ద్వారా సరఫరా చేయాలని కోరాడు. ఏడాది పొడుగునా అక్కడికి యాత్రికులు వస్తూనే ఉంటారు. సహకార సంఘాలు స్థాపించే ఉద్యమాన్ని రాష్ట్రంలో సర్వత్ర

వ్యాపింపజెయ్యాలని ఆయన ఆందోళన లేవదీశాడు. కుటీర పరిశ్రమలు ఒరిస్సాలో తమ పూర్వపేరు ప్రతిష్ఠలకనుగుణంగా పునరుద్ధరింప బడాలంటే సహకార పద్ధతి ఒక్కటే శరణ్యమని ఆయన విశ్వాసం. ఒరిస్సాలో జిల్లా బోర్డు ఛైర్మన్ పదవిలో అదివరకు జిల్లా మేజిస్ట్రేట్ ఎక్స్ అఫీషియో ఛైర్మన్‌గా ఉండే పద్ధతి బదులు ప్రభుత్వోద్యోగి కాని వ్యక్తి ఛైర్మన్ అయ్యే పద్ధతి ప్రవేశపెట్టడం ఆయన కృషి ఫలితమే. అడవులకు సంబంధించిన కఠిన నిబంధనలను సడలింపజేసిందీ ఆయనే. మిడిల్‌వెర్నాక్యులర్ స్కూళ్ళుగా ఉన్న విద్యాలయాలను ఎన్నింటినో మిడిల్ యింగ్లీషు స్కూల్స్‌గా ఆయన మార్పించాడు.

శాసన మండలిలో గోపబంధు రాజకీయ పార్టీకి సంబంధించిన సభ్యుడుగా కాక స్వతంత్రుడుగా వ్యవహరించేవాడు. సమాజంలో అట్టడుగు వారి సమస్యలను ముందుకు తేవడంలో ఆయన శాసన మండలి సభ్యుల దృష్టిని చూరగొన్నాడంటే, అది ఆయన నిజాయితీకి గీటురాయి. ఆయన కార్యసాధనకూ, తీవ్రకృషికీ తార్కాణము. సింగ్ భూమ్ డిప్యూటీ కమీషనర్‌గా ఉండిన స్కాట్ మహాశయుడొక సారి గోపబంధుని కలుసుకొన్నప్పుడిలా అన్నాడు. ''మిస్టర్ దాస్, నేను ఇండియాకు వచ్చి పదిహేడేళ్ళు అవుతున్నది. ఇంగ్లీషు పార్లమెంటు హౌస్ అఫ్ కామన్స్‌లో పలువురు ప్రముఖులు ప్రసంగించగా విన్నాను. ఇంగ్లండు ప్రధానిగా ఉండిన మిస్టర్ ఎ.జె. బాల్ఫర్ ప్రసంగాలు ముఖ్యంగా జ్ఞాపకం ఉన్నాయినాకు. మీ ప్రసంగాలు నాకు ఆమహనీయుని ప్రసంగాన్ని గుర్తుకు తెస్తున్నవి. కాంగ్రెస్ సభ్యునిగా మీరు ఇవ్వేళ బ్రిటిష్ సామ్రాజ్య ప్రత్యర్థియైనప్పటికీ, యూరోపియన్ ఆఫీసర్ల మైన మేము మీవంటి నిష్కళంక 'దేశభక్తులను గౌరవిస్తున్నామని చెబుతున్నాను.'' లెఫ్టినెంట్ గవర్నరు హోదాలో మండలి సమావేశాలకు అధ్యక్షత వహించే సర్ ఎడ్వర్డ్ గెయిట్ గోపబంధుతో సన్నిహిత స్నేహాన్ని పెంపొందించుకున్నాడు. చనవుగా మొదటి పేర్లతో యిద్దరూ సంబోధించుకునే వారు.

1919 ఇండియా ప్రభుత్వం చట్టం ప్రకారం, అందులో రూపొందిన మాన్ట్‌ఫర్డ్ సంస్కరణలు 1921లో అమలుకు వచ్చాయి. ప్రథమ చర్యగా రాష్ట్రమండలికి ఎన్నికలు నవంబరు 1920లోనే జరిగినవి. కాంగ్రెస్ జరిపిన ప్రత్యేక సమావేశం లాలా లజ్‌పత్ రాయ్ అధ్యక్షతన కలకత్తాలో 1920 సెప్టెంబరులో సహాయ నిరాకరణమే తన వైఖరిగా నిర్ణయించింది. గోపబంధు ఆ సమావేశంలో పాల్గొని నందున, ఎన్నికల్లో అభ్యర్థిగా నిలబడలేదు. గోపబంధు స్థానంలో మధుసూదన దాస్ మండలి సభ్యుడుగా ఒరిస్సా పురపాలక సంఘాల తరఫున ఎన్నిక అయ్యాడు.

# 10

# ఉత్కళ సమ్మేళన మహాసభ

'సత్యవాది' మాస పత్రిక చివరి సంచికలో వ్రాస్తూ గోపబంధు ఉత్కళ సమ్మేళన మహాసభకూ, భారత జాతీయోద్యమానికీ గల సంబంధాన్ని యిలా వర్ణించాడు.

''ఉత్కళ సమ్మేళనం తన పదహారో ఏట ప్రవేశిస్తున్నది. ఈ మహాసభ చాలకాలం రాజకీయాల్తో ప్రసక్తి కల్పించుకోలేదు. ఏలికలూ, ప్రభుత్వోద్యోగులూ దాని సమావేశాల్లో పాల్గొనేవారు. ఏడాది కోసారి మూసిన తలుపుల వెనుక తీవ్ర ప్రసంగాలు చేసి తృప్తి పడుతూ ఉండేవారు. గంభీరోపన్యాసాలూ, కాగితపు తీర్మానాలూ ఆయుగ లక్షణం. అప్పట్లో మహాసభ సాధించింది చాలతక్కువ. సింగ్ భూమ్‌లో ఒరియా బాషాప్రచారానికి దోహదం చెయ్యడమూ, కర్షకుల్ని ప్రత్తి పండించేందుకు ప్రోత్సహించడమూ, పూరీజిల్లాలో క్షామపరిస్థితుల్ని గూర్చి సర్వే చేయడమూ, అది నిర్వహించిన కార్యక్రమాలు. తద్ద్వారా రాష్ట్రాభివృద్ధికి కొంత దోహదం జరిగిందని అంగీకరించక తప్పదు. 1918లో ఉన్నట్లుండి. మహాసభలో మాంటెగూ-ఛెమ్స్ ఫర్డ్ నివేదిక చర్చకు వచ్చింది. అలా రాజకీయాల ప్రభావం దాని చర్చల్లో ప్రవేశించింది. అప్పటి నుంచీ మహాసభ రాజకీయపరమైన సంస్థా? కాదా? అనే వివాదం నలుగుతూనే వచ్చింది. గడచిన రెండేళ్లలో మహాసభాధ్యక్షులు. సంస్థను భారత జాతీయ సంస్థలో భాగంగా రూపొందించ వలెననే కోరిక తమ ఉపన్యాసాలలో వెలిబుచ్చుతూనే వచ్చారు. పంజాబులో జరిగిన ఘోరమారణ కాండ మీద మహాసభ తీర్మానించడం కూడా జరిగింది.

''రాజకీయాల పరిధి యిదమిత్థమంటూ ఒకగీత గియడం ఈ దేశంలో సాధ్యమయ్యే పనికాదు. స్వదేశీభావన అనే ఆదర్శాన్ని ప్రచారం చెయ్యడం ఒకవైపు రాజకీయకలాపంగా పరిగణించేవారే, మరోవైపు ప్రజల్ని విద్యార్థుల్ని బలవంత పెట్టే యుద్ధనిధికి చందా లిమ్మనీ, ధనం ప్రోగుచెయ్యమనీ హింసిస్తూ, దాన్ని మాత్రం రాజకీయంగా లెక్క వెయ్యడం లేదు. బర్క్ రచించిన 'ఫ్రెంచి విప్లవ పర్యాలోకనం' అనే గ్రంథాన్ని చదివితే అది రాజకీయం, కాని లీ వెర్నర్ వ్రాసిన 'ఇండియా పౌరుడు', ఎ.ఎన్. ఘోష్ వ్రాసిన 'బ్రిటిషు పరిపాలన వలన కలిగిన మేళ్లు' అనే పుస్తకాన్ని చదవడం రాజకీయం కాదు! ఇలాంటి క్లిష్ట సమస్యలకి పరిష్కారం

కుదర్చడం మనపనికాదు. రాజకీయం అనే ప్రశ్నవేరు. ఈ మహాసభ భారత జాతీయోద్యమంలో భాగం కావలెనా? అనే మాట వచ్చేటప్పటికి చాలమంది తెల్లబోతున్నారు. కాని తెల్లబోవడానికి యిందులో ఏమీలేదు. మహాసభకు యుక్త వయస్సు వచ్చిందిప్పుడు. రావడంతో ఇక నుంచీ జాతి జీవనంతో సంబంధం లేని ప్రత్యేకమైన మనుగడ సాగించడం సాధ్యంకాదు మహాసభకు. పరిణత వయస్కులు తమ చైతన్య శక్తి మీద యితరులు విధించే నియంత్రణను సహించరు. యువతను ముందుకు సాగనివ్వడమే మనధర్మం.

''భారతజాతీయోద్యమం పురోగమిస్తోంది. దాని ప్రభావంనేడు ఒరిస్సాలో ప్రసరిస్తున్నది. ఒరిస్సాయువతలో సహజోద్భూతమైన ఉత్సాహం పరవళ్లు తొక్కుతున్నది. కాని పెద్దతరంవారు, 'జాగ్రత్త, ఒరిస్సాలో అటువంటి కార్యకలాపాల కింకా సమయం ఆసన్నం కాలేదు.' అంటూనే ఉన్నారు. మనం సమయం రాలేదని జాగు చేస్తూండగానే, జాతీయోద్యమం మరొక్క అడుగు ముందుకి సాగింది. అంటే ఏమిటి? మనం సుముహూర్తం కోసరం మీనమేషాలు లెక్కిస్తూ కూర్చుంటే జాతీయోద్యమం ముందుకు సాగి వెళ్లిపోతూ ఉంటుంది. తగిన సమయం, అవకాశం అనేదాని అర్థాన్ని ఎవరు నిర్ధారించగలరు? ఈనాడు జాతీయోద్యమంలో ప్రవేశించి పాల్గొనడం మనకు కష్టాల్నే తెచ్చి పెట్టవచ్చు. బహుశా అటువంటి ప్రమాదం లేని సమయం ఎప్పుడు వస్తుందా అనిమనం వేచి చూస్తున్నామేమెూ! కేవలం విజయఫలాన్నే పంచుకునేందుకు తయారై ఆలోచిస్తున్నామేమో! అటువంటి మనస్తత్వం గల జాతికి ప్రపంచంలో ఎక్కడైనా, ఎప్పుడైనా మేలు చేకూరిందా? స్వాతంత్ర్యం కోసరం పోరాడుతున్న ఒక బానిస దేశం అన్ని విపత్తులనూ కష్టాలనూ ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉండాలి. అటువంటి దేశానికి అన్ని వేళలూ మంచి వేళలే! స్వాతంత్ర్యం కోసరం పోరాడుతున్న యోధులు గొప్ప ప్రమాదాల్ని ఎదుర్కొంటున్నారు. జాతీయోద్యమంలో చేరే వారెవ్వరూ ముందుగా లాభనష్టాల పట్టీ తయారు చేసుకొని, కష్టాలూ త్యాగాలూ ఒకవైపూ, విజయం వల్ల పొందే ఫలితాలూ లాభాలూ మరోవైపూ, బేరీజువేసి, లెక్కకట్టి, అటుపై ఉద్యమంలో చేరరు! 'మంచి సమయం' లేక 'అదను' అనే మాట పిరికి తనాన్నే సూచిస్తుంది. అది బానిస మనస్తత్వం. మనం జాతీయోద్యమ వాహినిలో భాగమైపోయి దానితో ముందుకు సాగిపోవాలి.

''ఏ ఉద్యమంలోనైనా ఉండబొయ్యే, రాబొయ్యే ప్రమాదాల్ని గూర్చి ఎవరూ స్పష్టంగా, యిదమిద్ధంగా చెప్పలేరు. ఒకవేళ ఒరిస్సా తన ప్రత్యేక వ్యక్తిత్వాన్నే కోల్పోయి, జాతీయోద్యమ పర్యవసానంగా జాతిలో అంతర్లీనమై పోవచ్చునేమో! దానికీ మనం సిద్ధపడాలి. ఒరిస్సా అంతర్భూతం కావడమే భారత జాతీయత యొక్క

మనుగడకు అవసరమైతే, అది అభిలషణీయమైన పరిణామం కాదా? అది నిజంగా ఒరిస్సాకు మహాద్భాగ్యమే అవుతుంది! ప్రజానీకానికి యిలా ఒరిస్సాని త్యాగం చెయ్యడం 'రుచించక పోవచ్చును. అయితే నేం, దధీచి త్యాగం ఎప్పటికీ మహోజ్జ్వలమైనదే! అందుచేత సమయం కోసరం చూడటమనే ప్రశ్న ఎక్కడుంది? ఆ ప్రశ్నేలేదు!''

## సంలీనం కావడానికి ఆయన పిలుపు

సమ్మేళనం కార్యకలాపాలతో గోపబంధుకి నిరంతరమూ సంబంధ సాన్నిహిత్యాలు ఉండేవి. మహోన్నతుడైన వ్యక్తిగా ఆయనకు ఒరిస్సా నాయకు లందరితోనూ సంబంధం ఉండేది. ఆనాయకుల్లో యించుమించు అందరూ ఒరియా జాతీయతను ఆదర్శంగా కలిగిన వారే. మధుసూదనదాస్, మహారాజా శ్రీరామ చంద్రభంజ్ దేవ్ (మయూర్‌భంజ్) సమ్మేళనం నాయకుల్లో ప్రముఖులు. గోపబంధు మధుసూదన్ సన్నిహిత మిత్రుడు. మహారాజా వారి క్రింద స్వయంగా ఉద్యోగం చేశాడు గోపబంధు. సత్యవాది హైస్కూల్ నడిపినప్పుడు అక్కడి నుంచీ సమ్మేళనానికి సభ్యుల్నీ కార్యకర్తల్నీ తయారు చేసి పంపిన వాడు గోపబంధు. ఉపాధ్యాయులు ప్రతినిధులు (డెలిగేట్స్) గానూ, విద్యార్థులు స్వచ్ఛంద కార్యకర్తలు (వలంటీర్స్) గానూ హాజరయ్యేవారు. 1918లో ఉత్కళ సమ్మేళన మహాసభ కటక్‌లో సమావేశమైనప్పుడు గోపబంధు కొంతమంది ఉపాధ్యాయులతో, నలభైమంది విద్యార్థి కార్యకర్తలతో హాజరయ్యాడు. ఆచార్య హరిహరదాస్ కార్యకర్తల విడిదిలో బసచేశాడు. అక్కడ విడిసిన విద్యార్థులకు ఆయన పర్యవేక్షకుడు. నీలకంఠ గోదావరీశ్, గోపబంధు ప్రతి నిధుల విడిదిలో బసచేశారు. నీలకంఠ గోదావరీశులు విషయ నిర్ణయ సంఘంలో సభ్యులు. గోపబంధుతో బాటు వీరిద్దరూ చేసిన ప్రసంగాలు సభ్యులను ఆకర్షించి ఆకట్టుకున్నవి. ఆ మహాసభలోనే గోపబంధు, ఒరియా బాషా ప్రాంతాలను ఏకచ్ఛత్ర పరిపాలన క్రింద తీసుకురావాలి అనే ప్రధాన తీర్మానంపై ప్రసంగించాడు. ఆయన యిలా అన్నాడు.

''ఒరియాభాష మాట్లాడే ప్రాంతాలను ఏకచ్ఛత్ర పరిపాలన క్రిందకు తీసుకురావాలనే విషయమై చేస్తున్న ప్రతి పాదన మహాసభ ముందున్నది. ఇందులో కొత్త దనం ఏమీలేదు. ఈ విషయమై ఆందోళన, గత పదమూడు సంవత్సరాలుగా, ఈ మహాసభ పుట్టిన నాటి నుంచీ, నడుపుతూనే ఉన్నాము. పదమూడు సంవత్సరాలేమిటి, పదమూడను రెట్టిస్తే ఇరవై ఆరేళ్లుగా, ఆ

మాటకువస్తే ముప్పై ఏళ్ళుగా ఈ ఆందోళన గంజాం జిల్లా ప్రజలు నడుపుతూనే ఉన్నారు. ఈ ఆందోళన గంజాం, పూరీ, సాంబల్ పూర్, సింగ్ భూమ్, ప్రతి ఒరియా భాషాప్రాంతం లోనూ చెలరేగుతూనే ఉన్నా, యింతవరకు మనం సాధించింది సున్నా. కొందరంటారు మన ఆందోళనకు 'పళ్లు లేవనీ', అందుకే ఏమీ ఫలితం దక్కడం లేదనీ. కానీ మన ఆందోళన ఒక సహజ పరిణామంగా నడుస్తూ ఉంది. మనం కలెక్టరు నుంచీ కమీషనరుదాకా లెఫ్టినెంట్ గవర్నరు నుంచీ గవర్నరు జనరల్ దాకా, అర్జీలను, అభ్యర్థనలను వినతి పత్రాలను పంపుకుంటూనే వచ్చాము. పోతే ఆలేని 'పళ్లు' ఎలాంటివో మన ఉద్యమం విషయంలో నాకు బోధ పడటం లేదు. భగవంతుడైన మహా దేవుణ్ణి దర్శించాలంటే ఆయన వాహనమైన బసవన్న వెనుక పడాలి మనం (చప్పట్లు) కలెక్టరు, కమీషనరు, లెఫ్టినెంట్ గవర్నరు వీళ్లను తగు సమయాల్లో అభ్యర్థించినా, మనకు మహాదేవుని దర్శన భాగ్యం మాత్రం లభించలేదు. జగన్నాథ మహాప్రభువు కోసరం సింహద్వారం వద్ద గరుడస్తంభం చుట్టూ పడిగాపులుగాచే భక్త బృందం వలెనే మనం కూడా గరుడ స్వాములకు ఎన్నో వినతులు చేసుకుంటున్నా, మన వినతులు ప్రభువుల వారి చెవిసోకిన జాడ కానరాలేదు! అప్పట్లో చక్రవర్తిగారి ఇండియావ్యవహారాల కార్యదర్శి – ఆయన్నే ఇండియా చక్రవర్తి యొక్క ప్రత్యక్ష అవతారంగా మనం భావించవచ్చు – ఆయన మనదేశం సందర్శిస్తున్నారు. బాగుంది. మన అదృష్టం పండింది అనుకున్నాము. కాని చాలమంది అన్నారు. స్వపరిపాలన కోసరం దేశంలో జరిగిన పోరాటంలో ఒరిస్సా పాల్గొనలేదు. ఒరిస్సాలో ఉద్యమం ఇగ్లీషు చదువుకొన్న కొందరు వ్యక్తులు, మధుసూదన్, బ్రజసుందర్ వంటివారి చేతిలో ఉన్నది, వారికి దీక్షా శిఖలు లేవు, వాళ్ళంతా టీకాలు వేసుకున్న వాళ్ళూ అని అన్నారు. అదలా ఉంచితే, ప్రజల నాడి ఎలా ఉంది? నిరక్షరాస్యులైన రైతులు, నిమ్నకులాలవారు, వీరందరూ కూడా ఒరిస్సా సమైక్యాన్ని ఏకకంఠంతో కోరుతున్నారన్న విషయాన్ని మనం ప్రభుత్వానికి రుజువు పరచాలి. రాష్ట్రం పలుచోట్ల, కటక్, గంజాం, సాంబల్ పూర్, సింగ్భూమ్ మొదలైన ఊళ్లల్లో ఎన్నో సమావేశాలు జరిగాయి. ఈ సమావేశాలకు హాజరైన జనం – పూరీలో అయిదువేలు, సత్యవాదిలో నాలుగు వేలు కటక్‌లో ఏడువేలు ఇలా ఉంది అసంఖ్యాకంగా ఈ సమావేశాలన్నింటి నుంచీ ప్రభుత్వానికి టెలిగ్రామ్‌లు పంపాము. 1918 మార్చి 18 తేదీ సత్యావాదిలో జరిగిన సమావేశంలో నేనున్నాను. అక్కడ ప్రజలు నన్ను ప్రశ్నించారు. ''గోపబంధు బాబూ, పూరీలో ఈమర్ మఠం ఎదురు గుండా జరిగిన బ్రహ్మాండమైన సమావేశంలో మనం మూడు నెలల క్రితమే ప్రభుత్వానికి పంపిన టెలిగ్రామ్

ఏమైనట్లు?'' దానికి నేనన్నాను. ''టెలిగ్రామ్ అందింది, కాని మనమంత్రులు పెదవి కదల్చడంలేదు!'' సామాన్య ప్రజానీకం మన ఉద్యమానికి ఎంత మద్దతు నిస్తున్నారో దీన్ని బట్టి గ్రహించవచ్చు. ఇదీ ప్రజాభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని ప్రభుత్వానికి చేరవేశాము. ప్రభుత్వం దీన్ని విశ్వసించక పోతే, యిక మనం ఏం చెయ్యాలో నాకు బోధ పడటంలేదు. ఒక్కొక్క సారి నాకనిపిస్తూ ఉంటుంది: మనం గ్రామఫోను రికార్డుమీద ఒరియా ప్రజల సంఘటిత కంఠాన్ని నమోదు చేసి, ఆ రికార్డు శబ్దం మంత్రుల చెవి దగ్గర వినిపిస్తే బాగుంటుందేమో! (చప్పట్లు). లేక పోతే యింకా ఏం చెయ్యాలి మనం?''

## సమ్మేళనం అధ్యక్షుడుగా గోపబంధు

1919లో ఈడ్గాలో జరిగిన ఉత్కళ సమ్మేళన మహాసభ సమావేశానికి గోపబంధు అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. ఈ సమావేశ ప్రారంభంలో ఒక గొడవ వచ్చింది. మధుసూదనదాస్‌కీ కటక్ విద్యార్థులకూ వచ్చిన పేచీ మూలంగా, కటక్ విద్యార్థులు సమావేశంలో వలంటీర్లుగా పనిచెయ్యడానికి నిరాకరించారు. గోపబంధు, వ్రజసుందర దాస్‌లు సత్యవాది వెళ్ళి అరవై మంది వలంటీర్లను, పాఠశాల ఉపాధ్యాయులను వెంటబెట్టుకుని వచ్చారు. వాళ్ల కటక్‌లో దిగగానే, మధుసూదన్ స్టేషన్‌లో కలుసుకొని స్వాగతం పలికాడు. ''రండి, రండి, ఆధునిక నళందా విద్యార్థులూ, అధ్యాపకులూ అయిన మీకు స్వాగతం. ఇక వలంటీర్లకు కొరతలేదు. మంగరాజ్ (జదుమణి) ఆటలు సాగవింక.

## ఒరియా అంటే ఎవరు?

తన అధ్యక్షోపన్యాసంలో గోపబంధుయిలా అన్నాడు. ''ఉత్కళకు ఒరియాకు భేదం ఏమీలేదు. అలా విభేదం కల్పించడం మంచిది కాదు. ఒరిస్సా ఎవరిసొత్తు? బెంగాల్, పంజాబ్, మార్వార్, మద్రాస్, ఏ ప్రాంతం నుంచీ వచ్చినా, హిందువులుగానీ, ముస్లిములుకానీ, ఏ మతస్థులైనా, ఆర్యులు కానీ, ద్రావిడులు కానీ ఏ సంతతివారైనా, ఉత్కళలేక ఒరిస్సా తమదని భావించి ఉండిపోయిన ప్రజలందరికీ చెందింది ఒరిస్సా. వాళ్లందరూ ఒరియాలే. సమ్మేళనం లక్ష్యం ఒరియా జాతీయతను పెంపొందించడమే. అంటే స్వతస్సిద్ధ ఒరిస్సా భూప్రదేశంలో, యిది తమ రాష్ట్రంగా భావిస్తూ యిక్కడ నివసించే వివిధరకాల ప్రజలందరి అభివృద్ధి దాని లక్ష్యం. వేర్పాటు వాదం కాదు, మానవతావాదం,

ఒరియా జాతీయత యొక్క గమ్యం. విశ్వప్రేమ, జీవన సంపూర్ణత, ఒరియా జాతీయతలో అంతర్భాగాలు. స్వార్థ పరత, నిర్జీవత, కార్యశూన్యమైన అభిమానం దాని లక్షణంకాదు. ఇతరులపై ధ్వజమెత్తి, రక్తం చిందించి, ఏవో విజయాలు సాధించాలని దానికి లేదు. సమానత, సౌభ్రాత్రము, స్వాతంత్ర్యము, దాని ఆదర్శాలు. ఒరిస్సా సంకుచిత భావంతో సతమతం కావడం లేదు. ఒరిస్సాలో ప్రవహించేనది పేరు 'మహానది'. ఒరిస్సాను స్పృశించే సముద్రం 'మహోదధి'. ఒరిస్సాలోని పర్వతం 'మహేంద్రం' ఒరిస్సా లోని చెట్టు 'కల్పవృక్షం', కోరికల్ని తీర్చే చెట్టు. ఒరిస్సాలోని స్వామి జగన్నాథుడు, జగమంతటికీ స్వామి. ఒరిస్సా స్మశానవాటిక 'స్వర్గద్వారం', ఒరియాలను అన్నింటిలోనూ గొప్పతనం, మహత్తు కనిపిస్తుంది. ఈ మహాసభ భారతజాతీయోద్యమంలో ఒక భాగమే. మనవ్యక్తిత్వాన్ని పదిలంగా నిలుపుకోవాలంటే, మనం మన జాతీయోద్యమ మూలాధారాన్ని గట్టిగా నిలుపుకోవాలి ఆ ఆధారం సామాన్య ప్రజలు. జాతీయోధ్యమంలో పెద్ద, చిన్న, తారతమ్యం ఉండటానికి వీల్లేదు. జాతిపరమైన కృషిలో మహారాజుకూ, వీధులూడ్చే వానికీ, తేడాలేదు.

జాతీయోద్యమంలో ఆధారబూతమైనవీ, మనం గట్టి పరచుకోవలసినవీ: వ్యవసాయం, పరిశ్రమలు, వాణిజ్యం, సారస్వతం. వీటిని అభివృద్ధి చేసకుంటూ విద్య ద్వారా మార్పు తీసుకురావాలి. విద్య ప్రజల మనస్సుల్ని వికసింప జేయడానికి తగిన సాధనం. విద్య అంటే బడిలో చెప్పే పాఠాలు మాత్రమేకాదు. విద్య అంటే పూర్వం రాష్ట్రమంతటా సనాతన విద్యాలయాల్లో, మత కేంద్రాల్లో ప్రవర్తిల్లిన సర్వస్వమూ. భారతీయులు తమ విద్యనూ, పరిశ్రమనూ, వర్తకాన్నీ అభివృద్ధి పరచుకోగలిగితే స్వయం ప్రతిపత్తిగల పరిపాలనకు అర్హులవుతారు. ఈ దేశప్రజలు చాలాకాలం పరిపాలనతో సంబంధం లేకుండా దూరంగా ఉండిపోయారు. ఇప్పుడు వస్తున్న సంస్కరణలు వారికి కొంత తర్ఫీదు నిస్తాయి. కాని యీ సంస్కరణలవల్ల ప్రయోజనం కలగాలంటే ప్రజలు విద్యావంతులు కావాలి. రాష్ట్రంలో పలుచోట్ల విద్యావ్యాప్తికి చెదురు మదురుగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. అటువంటి ప్రయత్నాలన్నింటినీ ఏకోన్ముఖమైన కృషిగా ఒక సుసంఘటిత వ్యవస్థ లేక సంఘం క్రింద సాగించి నప్పుడే మంచి ఫలితాలు సిద్ధిస్తాయి. నిబద్ధత, మనోస్థైర్యమూ ఉండేచాలు. పనిచెయ్యడానికి విద్యాధికులూ, ఖర్చు పెట్టడానికి నిధులూ, లభించడంలో లోపం లేదు. 'భాగవత తుంగీలు' (సమావేశ స్థలాలు లేక చావళ్ళు) గ్రామాల్లో ఉన్నాయి. వీటిని సంస్కరించి గ్రామాభివృద్ధి కేంద్రాలుగా మనం రూపొందింప జేసుకోవాలి. ఒరిస్సా గ్రామీణ జీవనంలో ఈ 'చావళ్ల' కొక ప్రత్యేకత ఉన్నది. గ్రామంలో మత సంబంధమైన, న్యాయ

సంబంధమైన చర్చలకు అవి తగిన చోట్లు. ప్రతి సమావేశ స్థలానికీ (చావడి) ఒక ఒరియా వార్తా పత్రిక తెప్పించే ఏర్పాటు అవసరం. మన కార్యకర్తలు వెళ్లి వార్తా పత్రికల ఉపయోగాన్ని ఇంటింటికీ వివరించాలి. మనమహాసభ శాఖల్ని అన్ని గ్రామాల్లో, అన్ని జిల్లాల్లో విస్తరింపజేయాలి. వృత్తి పనివాళ్ల తాలూకు కులంవారీ సంఘాల్ని మనలో చేర్చుకోవాలి. ఈ మహాసభ అనుబంధ సంస్థలుగా సహకారసంఘాల్ని ప్రతి గ్రామంలో నెలకొల్పాలి. క్రొత్త ప్రాత సంస్థలన్నింటినీ విజ్ఞాన వ్యాప్తికి కేంద్రాలుగా మనం ఉపయోగించుకోవాలి. మనం స్త్రీ విద్య విషయంలో కూడా శ్రద్ధ వహించాలి. స్త్రీలే కుటుంబ సౌభాగ్యం. వారే యిలవేల్పులు. సీత, సావిత్రి వంటి మహిళలుగా మనం వాళ్లను తీర్చి దిద్దుకోవాలి. విద్యాబోధన మాతృభాష ద్వారా జరగాలి. గంజాం, మిడ్నపూర్ జిల్లాల్లో ప్రాంతీయ భాషను ప్రవేశపెట్టడానికి చాల అవరోధాలున్నాయి. మద్రాసు ప్రాంతంలోని విశాఖ జిల్లాలో ఉండే మనప్రజలు తెలుగు నేర్చుకోవలసివస్తున్నది. సింగ్‌భూమ్‌లో, పద్మపూర్‌లో, రాయ్‌పూర్‌లోని ఫూల్‌జార్, ఖారియార్ ప్రాంతాలలో ఉండే ఒరియాలు హిందీ నేర్చుకోవాల్సి వస్తున్నది. అక్కడి న్యాయస్థానాల్లో, ప్రభుత్వ కార్యాలయాల్లో ఒరియాభాష మచ్చుకైనా లేదు. ఈ పరిస్థితిలో మనం మార్పు తీసుకరాకపోతే, ఒరియాలకు జాతీయ విద్యావిధానం అంటూ సమకూడదు. వారి మనోవికాసానికి సహజమైన దోహదం లభించదు. ఒరియా విద్యానిధిని ఒక దాన్ని ఏర్పాటు చేశాము. సింగ్ భూమ్ జిల్లాలో ఒరియా బాషాబోధన విస్తరింప జేసేందుకు దీన్ని ఉపయోగిస్తున్నాము. అలాగే హిందీ, బెంగాలీ, తెలుగు భాషల్ని నేర్చుకుంటున్న ఒరియా బాషా ప్రాంతాల్లోని ప్రజలకు ఒరియా భాష నేర్పడానికి, ఆ భాషని వాడుకలోకి తీసుకరావడానికి, కృషి జరుగుతున్నది. ఒరియా భాష నశిస్తే ఒరియా జాతయత నశిస్తుందని మనం గుర్తించాలి. అందవల్ల భాషా సమస్య నేడు మనకు జీవన్మరణ సమస్య. భారతదేశాని కంతటికీ ఒక సామాన్య బాష ఉండటం అభిలషణీయమైన విషయమే. అదే సంభవమైతే, ఒరియా భాషని త్యాగం చెయ్యడానికి నేనూ సంసిద్ధుణ్ణే. కాని అటువంటి పరిస్థితి లేనప్పుడు ఒరియావాళ్ళు తమ వ్యక్తిత్వాన్ని వదలుకోవలసిన అవసరంలేదు. ఒక్క భాషా విషయంలోనే కాదు, యితర రంగాల్లో కూడా బ్రిటిషు ప్రభుత్వం మన ప్రజలపట్ల అలక్ష్యాన్ని చూపుతూ నిర్దాక్షిణ్యవైఖరిని అవలంబిస్తూ వచ్చింది. ఒరియా ప్రజలు ప్రభుత్వం పట్ల విశ్వాస పాత్రులు. ప్రభువుల ఆజ్ఞల్ల ఘనం చెయ్యలేదు వాళ్ళు. కాని యిప్పుడు ప్రభువుల న్యాయ విహీనమైన వైఖరిని ఒరియా ప్రజలు గ్రహించారు. తమ భాషాభివృద్ధి కోసరం, ఒరియా భాషా ప్రాంతాల సమైక్యం కోసరం, పదే పదే విజ్ఞప్తులూ, ప్రార్థనలూ చేస్తూ వచ్చారు

కాని ప్రభుత్వం వాటి నింతవరకూ ఏ విధంగానూ గుర్తించలేదు. వారి ఈ కోరిక సమంజసమైనదనీ, ఒరియా వారి వ్యక్తిత్వాన్ని రక్షించడం అవసరమనీ ప్రభుత్వం గుర్తించి తీరాలి. మాన్ట్‌ఫర్డ్ సంస్కరణల్లో మనకోరిక తీరుతుందని మనం ఆశించాము. కానీ దురదృష్టవశాత్తూ ఆ నివేదికల్లో ఒరియా వాళ్లకు ఒక ఉపరాష్ట్రం ఏర్పాటు ప్రసక్తి మాత్రమే ఉన్నది కానీ దాన్ని గురించి వివరాలేమీ లేవు. ధర్మం, న్యాయం, జయిస్తాయని నా విశ్వాసం. సమైక్యవాదం సరియైన దనే నావిశ్వాసం. ప్రాంతీయ సమైక్యం తప్పక సాధించి తీరవలసిందే ఎప్పటికైనా.

''ముందుకు దూకాలి, లేకపోతే చావాలి. అదేమన ధ్యేయం. గమ్యాన్ని చేరేందుకు ఎన్నో ప్రాణాలు బలికావచ్చు. వ్యక్తుల త్యాగం జాతికి శక్తినిస్తుంది. అదే ఆత్మ సాక్షాత్కారానికి మార్గం. భయాన్నీ నిస్పృహనూ విడనాడి ముందుకు సాగాలి. అదే ఉత్కళమాత ఆదేశం. చెబుతున్నాను వినండి. ఇంతకాలం చరిత్ర తాలూకు ఎగుడు దిగుళ్లని అధిగమిస్తూ ఒరియా జాతి నిలిచి ఉన్నదంటే అది అర్థరహిత మైన విషయంకాదు. భారత జాతీయతారంగంలో మనం నిర్వహించవలసిన పాత్ర ఎంతో ఉన్నది. భారతదేశపు మహర్షులూ, ద్రష్టలూ విజ్ఞాన యాత్రకై ఈ పవిత్ర ఉత్కళ భూమిని దర్శించారు. వారి భావాలకు తగిన వ్యాప్తి లభించలేదింత వరకూ. ఓ ఉత్కళ పుత్రులారా! అందుకైన శుభసయం ఆసన్నమైంది. కృషికి సేవకూ తరుణం వచ్చింది నేడు. గ్రామాలకు వెళ్లండి. రాష్ట్రంలో మూలమూలలకు వెళ్లి శుభోదయ సందేశాన్ని ప్రతి మానవునికీ అందజెయ్యండి. ప్రతి యుగంలోనూ సాధు పురుషులు ఈ పవిత్ర భూమికి వచ్చారు. ఇప్పుడు ఒరియాలు సాధు పురుషులుగా మారవలసిన ముహూర్తం వచ్చింది. తద్ధ్యానమూ, తత్పరతాలేకుండా ఏమహత్కార్యమూ నిర్వహింప బడదు. జీవిత సాఫల్యం అటువంటి కార్యతత్పరతలోనే యిమిడి ఉన్నది.''

## సమ్మేళనం కాంగ్రెస్‌లో విలీనం కావడం

గోపబంధు మహోపన్యాసం విన్నప్పటికీ ఉత్కళ సమ్మేళన మహాసభ భారతజాతీయ కాంగ్రెస్‌లో విలీనం కావడానికి అంగీకరించలేదు. 1919లో సాంబల్‌పూర్ నివాసి చంద్రశేఖర్ బెహరా అధ్యక్షుడుగా జరిగిన సమావేశంలో మహాసభను జాతీయ వేదికగా మార్చే మరో ప్రయత్నం కూడా ఫలించలేదు. అయితే ఈ వైఫల్యాలు గోపబంధు పట్టుదలని సడలించలేదు.

1920 సెప్టెంబరులో గోపబంధు కలకత్తాలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ ప్రత్యేక సమావేశానికి హాజరయ్యాడు. ఆసమావేశంలో మహాత్మాగాంధీ

కార్యప్రణాళిక అయిన సహాయనిరాకరణోద్యమాన్ని కాంగ్రెస్ ఆమోదించింది. కాంగ్రెస్ సమావేశం జరిగిన తేదీ 1920 సెప్టెంబరు నాలుగు. కలకత్తా సమావేశానికి వెళ్లేముందు గోపబంధు 1920 ఆగస్టు 30 తేదీన పూరీలో ఒక జిల్లా కాంగ్రెస్ కమిటీని ఏర్పరచాడు. దానికి ఆయనే అధ్యక్షుడు. తర్వాత డిసెంబర్ నెలలో భారత జాతీయ కాంగ్రెస్ వార్షిక సమావేశం నాగపూర్‌లో జరిగింది. దానికి ఆయన ప్రతినిధిగా వెళ్లాడు. భారీ ఎత్తున ఏర్పాటైన మొదటి సమావేశం అది. మహాత్మాగాంధీగారి సహాయనిరాకరణోద్యమ ప్రణాళిక దాని లక్షణాన్ని పూర్తిగా మార్చివేసింది. అప్పటి నుంచీ అది సామాన్య ప్రజాబాహుళ్యానికి సంబంధించిన సంస్థగా రూపొందింది. భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణం జరగాలనే సమస్యను మహాత్మాగాంధీకి వివరించి నచ్చజెప్పడంలో గోపబంధు ప్రధాన పాత్ర వహించాడు. తత్ఫలితంగా దాన్ని కాంగ్రెస్ ప్రణాళికలో చేర్చి నాగపూర్ సమావేశంలో రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ గురించిన తీర్మానం ఆమోదించారు. ఉత్కళ సమ్మేళన మహాసభ ప్రత్యేక ఒరిస్సా రాష్ట్రం కోసరం కృషి చేస్తూ, అందులో ఒరియా మాట్లాడే ప్రాంతాలన్నీ సమైక్యం కావాలని కోరుతూ ఉండటం వల్ల, జాతీయ కాంగ్రెస్ అదే గమ్యాన్ని అంగీకరించడంతో, అటుపైన మహాసభ భారత జాతీయోద్యమం నుంచీ వేరుగానూ దూరంగానూ ఉండవలసిన కారణం కనిపించలేదు. నాగపూర్ నుంచీ తిరిగి రాగానే గోపబంధు ఒరిస్సా రాష్ట్ర కాంగ్రెస్ కమిటీని ఏర్పాటు చేశాడు. సింగ్‌భూమ్ జిల్లా కాంగ్రెస్ కమిటీ దానికి అనుబంధం అయింది.

1920 డిసెంబర్ 30 తేదీ మహాసభ చక్రధరపూర్‌లో సమావేశమైంది. భారత జాతీయ కాంగ్రెస్ నాగపూర్ సమావేశం ముగిసిన వెంటనే ఈ సమావేశం జరిగింది. సమావేశంలో ప్రవేశపెట్టబడిన రెండవ తీర్మానాన్ని గోపబంధు ప్రతిపాదించగా చక్రధర్ బెహారా సమర్థించాడు. అది యిలా ఉన్నది.

''భారత జాతీయ కాంగ్రెస్ లక్ష్యాలూ కార్యక్రమాలూ, ఉత్కళ సమ్మేళన మహాసభ యొక్క పూర్వాంగీకృత లక్ష్యాలతో బాటు అదనపు లక్ష్యాలుగా ఆమోదించి స్వీకరించడానికి తీర్మానించడమైనది.''

మూడవ తీర్మానం సింగ్‌భూమ్‌వాసి పండిత కృష్ణచంద్రాచార్య ప్రతిపాదించగా, పండిత నీలకంఠదాస్ సమర్థించాడు. అది యిలా ఉన్నది.

''ఈ మహాసభ, భారత జాతీయ కాంగ్రెస్ భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణాన్ని సమర్థిస్తూ చేసిన తీర్మానాన్ని హృదయపూర్వకంగా ఆమోదిస్తూ దాన్ని బలపరచటానికి తీర్మానిస్తున్నది.''

ఉత్కళ సమ్మేళన మహాసభ చక్రధరపూర్‌లో పొందిన మార్పులో చివరి అంశంగా ఆరవ తీర్మానం – అంతకు పూర్వం ఒరియా ప్రాంతాల సమైక్యాన్ని

గూర్చి చేసిఉండిన తీర్మానాలన్నింటినీ పునరుద్ఘాటించడం. ఒరిస్సా భారత దేశంలో ఎలా భాగమో, భారత జాతీయతలో ఒరియా జాతీయత అలానే అంతర్భాగమనీ, రెండింటికీ అభేదమేననీ గోపబంధు దృక్పథం. ఆ ఉద్దేశంతోనే ఆయన ఉత్కళ సమ్మేళన మహాసభను భారతజాతీయోద్యమంలో ఒక అంగంగా చెయ్యడానికి శాయశక్తులా కృషిచేశాడు. ఆ ఉద్దేశం చక్రధర పూర్ సమావేశంలో నెరవేరడంతో, ఆయన అప్పటినుంచీ కాంగ్రెస్ వాది అయ్యాడు.

# 11

# గాంధీజీతో గోపబంధు

ప్రతి జిల్లాలోనూ కాంగ్రెస్ కమిటీలను ఏర్పాటు చేసే కార్యభారాన్ని హృదయపూర్వకంగా తనమీద వేసుకుని పనిచేశాడు గోపబంధు. అప్పటికే 'సమాజ్' వార పత్రికను స్థాపించి, దానిద్వారా సహాయనిరాకరణోద్యమ సందేశాన్ని ప్రస్తారం చేస్తూ వచ్చాడు. ఒరిస్సా మారు మూలల్లో కూడా ఆయన వాక్కు మార్మోగింది. సహాయ నిరాకరణం పట్ల ప్రజల్లో ఉత్సాహం పెల్లుబికింది. యువకులు గుంపులు గుంపులుగా కాంగ్రెస్ సందేశాన్నీ, కాంగ్రెస్ లక్ష్యాలనూ వ్యాపింప జేస్తూ పర్యటన ప్రారంభించారు. ప్రతి జిల్లాలో, సబ్ డివిజన్‌లో, ఠాణా కేంద్రంలో కాంగ్రెస్ కమిటీలు వెలిశాయి. ప్రజలందరూ, చిన్నా పెద్దా, ఆడామగా వివక్షత లేకుండా జాతి విమోచనకు తమవంతు తామివ్వడానికి, పోటీ పడుతూ ముందుకు వచ్చారు. ఆసందర్భంలోనే దేశంలో ఖిలాఫత్ ఉద్యమం ప్రారంభమైంది. పంజాబులో జరిగిన ప్రభుత్వ హింసాకాండకు, జలియన్ వాలాబాగ్ మారణ కృత్యానికి, నిరసన ప్రదర్శనలు జరిగేయి. రాష్ట్రంలో నలుమూలల నుంచీ వలంటీర్లను సేకరించి గోపబంధు దేశంలోని సహాయ నిరాకరణోద్యమ వాహినిలో ముందుకు సాగాడు.

చక్రధరపూర్‌లో జరిగిన సమావేశంలో 'ఉత్కళ సమ్మేళనం' 1920లో సహాయ నిరాకరణోద్యమాన్ని తన కార్యక్రమంగా చేపట్టింది. తద్వారా స్థానికమైన అభిమానాన్ని భారత జాతీయతా భావంతో సంలీనం చెయ్యడం సాధ్యమైంది. ప్రతి ఒరియావాడూ దేశవ్యాప్తమైన స్వాతంత్ర్యోద్యమంతో తాదాత్మ్యం పొందాడు. వందలాది విద్యార్థులు స్కూళ్లూ, కాలేజీలు వదలి పెట్టి, చదువులు అర్ధాంతరంగా విడిచిపెట్టి ముందుకు వచ్చారు. హరికృష్ణమెహతాబ్, నవకృష్ణ చౌధురి, జదుమణి మంగరాజ్, అలాచేసిన వారే. న్యాయవాదులు తమ వృత్తి విడనాడి ఉద్యమంలో చేరారు. ప్రభుత్వోద్యోగులు పెద్ద పదవులకు కూడా రాజీనామా యిచ్చారు. ఆ సమయంలోనే డిప్యూటీ కలెక్టరు ఉద్యోగం చేస్తున్న గోపబంధు చౌధురి తన పదవికి రాజీనామాయిచ్చి ఉద్యమంలో చేరాడు. ఆయన ఒరిస్సాలో ప్రతి జిల్లాలోనూ 'ఆశ్రమాలు' స్థాపించి, యువకులకు జాతీయతా భావాన్ని ఉద్బోధ చెయ్యడానికి కృషి చేశాడు. జగత్సింగ్ పూర్‌లో 'అలకాశ్రమం' అనేపేరుతో

సేవాశ్రమం స్థాపితమైంది. దాని అధిష్ఠాపకులు ప్రాణకృష్ణ పథియారీ, గోపనవ చౌధురీ సోదరద్వయం. గోపబంధు కూడా 'ఉత్కళ స్వరాజ్ శిక్ష్యా పరిషద్' (జాతీయ విద్యాపరిషత్తు) పేరుతో ఒక సంస్థను ఏర్పరిచాడు. దాని ఉద్దేశం, చదువుమానివేసి ఉద్యమంలో చేరిన వారికి పాఠశాలలు పెట్టి, వారి చదువు పూర్తి చేసే సదుపాయం కల్పించడం. అటువంటి జాతీయ పాఠశాలల్ని స్థాపించడంలో మొదటి మెట్టుగా గోపబంధు తన ప్రియసంస్థ అయిన సత్యవాది హై స్కూలును జాతీయ పాఠశాలగా మార్చాడు.

ఒరిస్సాలో సహాయ నిరాకరణోద్యమం ఉధృతంగా సాగింది. వందలాది యువకులు జైలు కోరుకొన్నారు. ఎవరి ప్రోద్బలమూ వారికి అవసరం లేకపోయింది. అది సహజంగా పెల్లుబికిన ఉత్సాహం. గోపబంధు నాయకత్వమూ, మహత్తరమైన ఆయన పలుకులూ, మార్గదర్శకత్వం వహించాయి. మహాత్మాగాంధి ఒక్కసారి ఒరిస్సాలో పర్యటించి నట్లయితే, బ్రిటిషు ప్రభుత్వం చాలాకాలంగా నిర్లక్ష్యం చేస్తూ వచ్చిన ఈ తీర రాష్ట్రం జాతీయోద్యమంతో ప్రజ్వలిస్తుందని గోపబంధు ఊహించాడు. అందుచేత నాగపూర్ కాంగ్రెస్‌లో ఆయన మహాత్మాజీని ఒకసారి తీరిక చేసుకుని ఒరిస్సా సందర్శించమని ఆహ్వానించాడు. మహాత్మాజీ వస్తానని మాట యిచ్చారు. ఆమాట ప్రకారమే ఆయన 23 మార్చి 1921 తారీఖున కటక్ వచ్చారు.

## మహాత్మాజీ ఒరిస్సాలో

జాతీయోద్యమానికి గోపబంధు అంకితమై దీక్షవహిస్తున్న సంగతి మహాత్మాగాంధి గ్రహించారు. అందువల్ల గోపబంధు కాంగ్రెస్ సందేశాన్ని ఒరిస్సాలో ప్రస్తారం చెయ్యడానికి తన సాహాయం అర్థించగానే గాంధీజీ ఆ అభ్యర్థనను కాదనలేక పోయారు. అప్పటికీ తన చర్యల ద్వారా గోపబంధు అధికారవర్గంలో అలజడి కలిగించి ఉన్నాడు. మహాత్మాగాంధి గోపబంధు సహాయానికి రాగానే ప్రభుత్వం బెదరి పోయింది. మహాత్మాజీని సన్మానించి ఆయన సందేశం సామాన్యులకు అందేట్లు చెయ్యడానికి ఆరుబటలు సమావేశాలు జరిగాయి. ఈ చర్యలన్నీ పోలీసులూ, సి.ఐ.డీలు జాగ్రత్తగా గమనిస్తూ వచ్చారు 1921 మార్చి 23 తేదీ ఖట్జూరి నదీ సైకతం మీద జరిగిన అలాంటి బహిరంగ సభలో గోపబంధు తన విలక్షణ పద్ధతిలో ప్రసంగిస్తూ యిలా అన్నాడు.

''మిత్రులారా! మీరు కళ్లారా చూడాలని నిరీక్షించిన మహాత్ముడు మీ ఎదుట ఉన్నారు. ఈ దేశంలో యింటింటా, మనిషి మనిషికీ ఆయన సుపరిచితుడు.

ఆయనన్ను నేను పరిచయం చెయ్యడం అధిక ప్రసంగం. ఒరిస్సా రాష్ట్రం రాజకీయరంగంలో తగినంతగా ముందడుగు వేసి ఉండక పోవచ్చుగాని అన్ని యుగాల్లోనూ ఈ రాష్ట్రం దేశంలో మిగతా రాష్ట్రాలకంటె ఆధ్యాత్మిక పథంలో ప్రథమంగానే ఉన్నదని చెప్పగలవు. భారత దేశంలో జన్మించిన మతాచార్యులందరూ ఒరిస్సా పవిత్ర భూమిపై అడుగుపెట్టిన వారే. బుద్ధుడు మొదలు కబీరు, రామానుజుడు, శంకరుడు, నానక్, చైతన్యుని వరకు 'మహనీయులందరికీ' ఒరిస్సాలో విగ్రహాలున్నాయి. మూడు వందల ఏండ్ల క్రితం అటువంటి హోలీ పండుగ రోజుననే, చైతన్య దేవుడు యీ యిసుక తిన్నెల మీదనే తనప్రేమ సందేశాన్ని ప్రబోధించాడు. ఈ రోజు అదే పుణ్య దివసాన, మరొక మహనీయుడు రాజకీయాల్లో ప్రేమ సూత్రాన్ని ప్రబోదించడానికి యిక్కడ విచ్చేసి ఉన్నాడు. ఆధ్యాత్మికతకు యుగయుగాలుగా ఒరిస్సా పేరెన్నిక గన్నది. మహాత్ముని రాజకీయాలు ఆ భూమిక మీదనే ఆధారపడి ఉన్నాయి. మహాత్ముని రాజకీయాల్లో మునుగులో వ్యవహారం వంటి దేమీలేదు. మీరందరూ మహాత్ముని అడుగుజాడల్లో నడవడానికి సిద్ధంగా ఉన్నారని నేనెరుగుదును. ఔదార్యానికి ఒరిస్సా పెట్టిన పేరు. భిన్నమతాలకూ, కులాలకూ, వర్గాలకూ చెందిన ప్రజలిక్కడ శాంతి యుత జీవనం గడుపుతున్నారు. పూరీలో కులవివక్షత లేదు. మహాత్ముడు ఒరిస్సాకు విచ్చేసిన ఈ శుభ తరుణంలో, గాంధీ గారి సందేశాన్ని మీరు బోధపరచుకుని, ఒరియా ప్రజల ప్రాచీన వైభవాన్నీ, ఔదార్యాన్నీ పునశ్చరణ చేయుదురుగాక అని విజ్ఞప్తి చేస్తున్నాను.''

ఒరిస్సాలో విజయ ప్రవేశం చేసి మహాత్మాగాంధి, గోపబంధుతోడురాగా, పూరీవైపు కాలినడకన యాత్ర సాగించారు. దారిలో సత్యవాది నికుంజ పాఠశాలను సందర్శించారు. విద్యార్థులూ ఉపాధ్యాయులూ, స్థానిక క్రజలూ గుమికూడిన ఒక పెద్ద సమావేశంలో ఆయన ప్రసంగించారు. విలక్షణమైన ఆ విద్యా సంస్థలో ఆయన ఒకరోజు గడిపారు. గోపబంధు మార్గదర్శకత్వంలో నడుస్తున్న ఆ పాఠశాలలోని పద్ధతులూ, విద్యా ప్రమాణాలూ, ఆయన ఆమోదాన్ని పొందినవి. సత్యవాది పాఠశాలలో ఆచరణలో ఉన్న విద్యావిధానం గురించి మహాత్మాగాంధి ఆయనతో చర్చలు జరిపారు. (తర్వాత గాంధీ బేసిక్ విద్యావిధానం గూర్చి సూత్రీకరించారు.) మరుసటి రోజు పూరీ వెళ్లారు. పూరీలో జరిగిన సమావేశంలో గోపబంధు విమర్శ నాభరితమైన వ్యంగ్యంతో ప్రసంగించారు. ప్రజలు చప్పట్లు చరిచారు. ఆ చప్పట్ల నుద్దేశించి గోపబంధు యిలా అన్నాడు.

''సోదరులారా, ఆ పండి మీచప్పట్లు. శాంతికి భంగం వాటిల్లుతుందనే భయంతో బీహార్ – ఒరిస్సా ప్రభుత్వం ఈమధ్య సర్క్యులర్ జారీ చేశారు. మన

సహాయ నిరాకరణోద్యమానికి అహింసయే అధారం. సహాయనిరాకరణం హింసకు దారితీస్తే, అది నిష్ఫల మవుతుంది. అయితే ప్రజలు మన సమావేశాల్లో చప్పట్లు చరుస్తారు. దీన్ని హింసగా బావిస్తే సహాయ నిరాకరణంలో హింసకు ప్రమేయం ఉన్నదని ఒప్పుకోక తప్పదు. ఏమంటే, ముప్పై కోట్ల మంది బారతీయులు ఒకసారిగా చప్పట్లు చరిస్తే, ఇంగ్లీషువాళ్ల లక్షమందీ అదృశ్యంకాక తప్పదు. కటక్‌లో కలెక్టరు చేసిన ఒకాయన, ఖుర్దాలో ఎస్.డి.వో. గా పనిచేసిన మరో వ్యక్తీ, ఎప్పుడైనా నగర సంకీర్తనంలో తప్పెట్లూ తాళాలూగాని, మొరిగే వీధికుక్కలు గాని వారికి నిద్రాభంగం కలుగజేస్తే ప్రాసిక్యూషన్‌లు ప్రారంభించే వాళ్లని చెబుతారు. అందువల్ల మీరు చప్పట్లు కొట్టడం మానేస్తేనే, శాంతికి భంగం వాటిల్లే పరిస్థితి తప్పుతుంది!

''మహాత్మాగాంధీ గారిని మీకేమని పరిచయం చేసేది? ఈ మహాత్ముణ్ణి చూస్తే - బలహీనమైన శరీరం, అట్టే ఎత్తయిన విగ్రహం కాదు, ఏం ఆకర్షణ యీ యనలో ఉన్నదనీ- యింతమంది మనుష్యులు దూరగ్రామాల నుంచీ యిక్కడ గుమికూడారు? ఈయన వ్యక్తిత్వం యొక్క మహత్తు దక్షిణాఫ్రికాలోని భారతీయులకు, వారి పోరాటాల్లో విజయం చేకూర్చింది. చంపారన్‌లోని నీలిమందు తోటల్లో యజమానులు పెట్టే బాధలకు గురి అయ్యే రైతులకు విముక్తి కలిగించింది. ఆ మహత్తే కైరా జిల్లాలో క్షామ బాధితులైన పేద ప్రజలకు పన్నుల భారాన్ని తొలగించింది. ఇకపూరీ జిల్లాను గూర్చి చెప్పడమెందుకు? ఈయన పేరు పల్లెపల్లెలో మార్మ్రోగుతున్నది. ఈయన మానువుడుకాడు, సాక్షాత్తూ భగవంతుడు. లేదా భగవంతుడు పంపిన దూత. పూరీ జిల్లాలో క్రితంసారి క్షామం వచ్చినప్పుడు ఎన్ని ప్రాణాలు నష్టమయ్యాయో! ఎన్ని అగచాట్లు పడ్డామో! చిట్ట చివరకు గవర్నరు గారి సింహాసనంకించిత్తు కదిలిందేమో, ఆయన విచ్చేశారు. అప్పుడు ఆయన ఒక్క మాట సెలవిచ్చారు. ''చెయ్యవలసిందంతా చెయ్యలేదు.'' అయితే మనకు కలిగిన లాభమేమిటి? క్షామపరిస్థితిని గుర్తించి అమలు చేసే సదుపాయాలకు యింకా సమయం రాలేదనే అన్నారు. గవర్నరుగారు అలా ప్రవర్తించారు. కాని మనహృదయాలకు ఏలిక అయిన ఈ గవర్నరు, గుజరాత్‌లో ఉండే ఈ మహాత్మాగాంధీ, ఎలా ప్రవర్తించారు? పూరీని సందర్శించకుండానే, యీ జిల్లాలో క్షామం నెలకొన్నట్లు ప్రకటించారు. వారు అలా అన్నారోలేదో ధనం వర్షించింది. ఒక్క గుజరాతు నుంచేకాదు, యావద్భారత దేశంనుంచీ ప్రభుత్వం విదిల్చే భిక్షపు మెతుకులు, ఆధారాపాతం ముందు లెక్కకు రాకుండా పోయాయి. మహాత్ముని ఆశీస్సులతో పూరీ క్షామపీడితులు పునరుజ్జీవితులయ్యారు. ఓపూరీ సోదరులారా! మనప్రాణదాత, మనహృ

హృదయాధినేత, యిక్కడ సశరీరుడై వేంచేసియున్నాడు. క్షామ సమయంలో మిమ్మల్ని ఎన్నో సార్లు చూశాను. వందలాది మనుషులు నా కళ్లముందు ప్రాణాలు కోల్పోయి పడిపోవడం చూశాను. మనుష్యుల్ని యిలా చంపిన పాపం ప్రభుత్వానికే చెందుతుంది. పంజాబు వారి కష్టాలు మన అందరివీ. అది అఖిల భారత సమస్య. కాని క్రితం సారి క్షామంలో సంభవించిన వందలాది మరణాలకు ఎవరిది బాధ్యత? నేను శాసన మండలిలో ప్రకటించాను – ఈ రాష్ట్రం మారుమూల ఒక్క ఆకలి చావు సంభవించినా, ఆపాపం ప్రభుత్వానికే చుట్టుకొంటుంది. ప్రతి ప్రభుత్వాధికారికి, శాసన మండలికీ కూడా చెందుతుంది ఆపాపం, ప్రత్యక్షం గానో పరోక్షంగానో ఆసమయంలో నేను కూడా మండలి సభ్యుడినే గనుక నేనుకూడా కొంత ఆ బాధ్యత వహిస్తున్నాను. రాజ్యంలోని పాపభారం రాజులమీదే ఉంటుంది. అటువంటి పాపానికి కారకులైన రాజ్యాధినేతల్ని మనం విసర్జించాలి. మహాత్ముని సహాయనిరాకరణోద్యమ సందేశం అదే. భారత జాతీయ కాంగ్రెస్ సందేశమూ అదే.

''మహాత్ముని ముందు నివేదిస్తున్నాను. కష్టాలు తరుచు వస్తూనే ఉన్నా, ఒరిస్సా ప్రజలు సహాయ నిరాకరణంలో ముందంజవేసి, తమ దేశభక్తిని నిరూపించుకొన్నారు. ఒరిస్సాయిన్ని కష్టాలు పడటం వ్యర్థంకాదు. అందులో ఒక పరమార్థం ఉన్నది. జాతీయోద్యమంలో ఒరిస్సాకొక నిర్దిష్టపాత్ర ఉన్నది. కష్టాలను భరించే సహనశక్తిని ఒరిస్సా విజయవంతంగా ప్రదర్శించి ఉన్నది. పూరీ ప్రాచీనమైనది. భారత దేశంలో పేరొందిన మహనీయులందరూ యిక్కడ స్థావర మేర్పరచుకొన్నారు. గౌతమ బుద్ధుని పవిత్ర దంతం, కబీరు సమాధి, రామానుజుని మఠం, నానక్ పాడిన దివ్యగీతాలూ పూరీలో ఉన్నాయి. చైతన్యుని ప్రభావం రాష్ట్రమంతా నిండి ఉన్నది. ప్రయాగలో సంగమించే గంగా యమున వలె హిందూ ముస్లిము జాతీయతల సంగమాన్ని ఆకాంక్షించాడు కబీరు.''

పూరీ ప్రజలకు తన సందేశం అందజేసిన తర్వాత మహాత్ముడు గోపబంధుతో బరంపురం వెళ్లారు. గంజాం జిల్లాలో ఒరియా మాట్లాడే ప్రజలు నివసిస్తూ ఉన్నప్పటికీ అది మద్రాసు ప్రెసిడెన్సీలో భాగమే. కాని బీహార్-ఒరిస్సా రాష్ట్రంలో భాగంకాదు. అయినప్పటికీ అక్కడి ఒరియా ప్రజలు వారి నాయకుడు గోపబంధు పిలుపు నాలకించి మహాత్మునికి ఘనమైన స్వాగతం పలికారు. పరాయి ప్రభుత్వపు ఒత్తిడులను వారు లెక్కచెయ్యలేదు. ఒరిస్సాను సందర్శించిన ఆ సమయంలో మహాత్మాజీ అక్కడి ప్రజలలో గోపబంధుకి గల అపారమైన పలుకుబడి ఎలాంటిదో గుర్తించారు. గోపబంధు మూలాన్నే మహాత్మాజీ ఒరియాప్రజల పేదరికం ఎటువంటిదో అవగాహన తెచ్చుకోగలిగారు. ఈ రాష్ట్రపర్యటన తర్వాతనే

మహాత్మాజీ ప్రతి ఒరియా వాడూ తిండికీ గుడ్డకూ నోచుకునే దాకా తాను పూర్తి ధోవతీ కట్టనని నియమం వహించారని చెబుతారు. ''దేశంలోని పేదరికం యొక్క మూలస్వరూపాన్ని ఒరిస్సాలో చూశా''నని గాంధీగారు అన్నారట.

12

# 'సమాజ్' పత్రిక

అప్పటికి ఒరియా భాషలో పత్రికలు బాగా అభివృద్ధి చెందలేదు. 'ఉత్కళ దీపిక' అనే పత్రికను గౌరీశంకర రాయ్ ప్రారంభించారు. అది ఒక్కటే వార్తా పత్రిక. కటక్ ప్రింటింగ్ కంపెనీ వారు దాని ప్రచురణ కర్తలు. అది మితవాదుల పత్రిక. గోపబంధు, ఆయన మిత్రవర్గంవారి అతివాద భావాలను ప్రసారం చెయ్యడం దానికిష్టం లేదు. అందుచేత గోపబంధు 1913లో ఒక పత్రికను ప్రారంభించమంటూ శశిభూషణ్ రథ్‌తో చెప్పాడు. అది 'ఆశ' అనే పేరుతో వెలువడింది. పత్రికకు ఆపేరు పెట్టింది గోపబంధే. ఆ పత్రిక 1919 దాకా గోపబంధు సంపాదకత్వం క్రింద సాక్షిగోపాల్ నుంచీ వెలువడుతూ ఉండేది. దాని ప్రచురణ మద్రాస్ ప్రెసిడెన్సీలో గంజాం జిల్లాకు చెందిన బరంపురంలో జరిగేది.

శాసన మండలి సభ్యుడుగా గోపబంధు తనచేతిలో ఒక వార్తా పత్రిక ఉండటం చాలా అవసరమని గుర్తించాడు. అందుకు మూడు కారణాలున్నాయి. మొదటిది: కటక్‌లోని స్థానిక ప్రభుత్వాధికారులు పూరీజిల్లాను క్షామ పీడిత ప్రాంతంగా ప్రకటించేందుకు యిష్టపడలేదు. 1919లో దోవర్ క్షామం ఏర్పడినప్పుడు క్షామ నివారణ నియమావళిని అమలు పరచేందుకు వాళ్ళు నిరాకరించారు. గోపబంధు స్వయంగా లెఫ్టినెంట్ గవర్నరు సర్ ఎడ్వర్డ్ గెయిట్‌తో అక్కడి పరిస్థితులు వివరించి చెప్పడం మూలంగా ఆయన ఆ ప్రాంతాన్ని దర్శించేట్లు చెయ్యగలిగాడు. అదే ఒక వార్తా పత్రిక ఉండినట్లయితే, ఆ పరిస్థితుల్ని దేశం నలుమూలలా తెలిసేటట్లు చెయ్యడం తొందరగా వీలయ్యేది. దాని వలన ఎంతో ఫలితమూ ఉండేది. రెండోది జలియన్ వాలాబాగ్‌లో జరిగిన దారుణ మారణ కాండ భారత ప్రజల గుండె లోతుల్ని కదిలించడంతో దేశమంతటా అలజడి చెలరేగింది. ప్రజలు తమ భావోద్రేకాన్ని వ్యక్తం చెయ్యడానికి, వారికంటూ ఒక వేదిక లేదు. మూడోది: ఒరిస్సా ప్రజలకు పరిష్కారం కావలసిన అత్యవసర సమస్యలు ఎన్నో ఉండినప్పటికీ, స్థానిక ప్రభుత్వాధికారులు నిర్లక్ష్యవైఖరిని అవలంబిస్తూనే వచ్చారు. రాష్ట్ర ప్రభుత్వ కేంద్రం ఎక్కడో అయిదు వందలమైళ్ళ దూరంలో పాట్నాల్లో ఉన్నది. ఒరిస్సా, బెంగాల్‌లో చేరి ఉండినప్పుడు కొంత మెరుగ్గా ఉండేది. రాష్ట్ర రాజధాని అయిన

కలకత్తా రెండు వందల యాభైమైళ్ళ దూరమే ఉండేది. అందువల్ల కూడా ప్రజాసమస్యల్ని ప్రకటించే వార్తా పత్రిక అవసరం ఏర్పడింది. తద్వారా సమస్యల పరిష్కారానికి తోడ్పడటమే కాకుండా, పత్రిక ప్రజల్లో విద్యావ్యాప్తికి దోహదం చేయకలుగుతుంది. ఈ మూడు విషయాలూ గోపబంధు స్వయంగా పత్రిక నడిపేందుకు ప్రేరణ అయాయి. అదికూడా సాక్షిగోపాల్‌లో ఆయన నిర్వహించే విద్యావిషయిక ప్రయోగంలో భాగమే అయింది.

వార్తా పత్రిక నిర్వహణ డబ్బుతో కూడుకున్నపని. గోపబంధు నిర్ధనుడు. శాసన మండలి సభ్యుడుగా తనకు వచ్చే జీతంలోనే పొదుపు చేసి, ఆయన కొంత మిగిల్చి ఉంచుకునేవాడు. ఒకసారి మండలి సమావేశం ముగిశాక, ఆయన తనకు వచ్చిన పదహారు వందల రూపాయల్ని తీసుకుని సాక్షి గోపాల్ వచ్చాడు. అక్కడ దేవాలయానికి చెందిన బంగళాలో రాత్రి విశ్రమించగా, ఆ డబ్బు ఎవరో దొంగిలించారు. గోపబంధు కదికష్టమనిపించినా, ఆయన వెనుకంజ వెయ్యకుండా తన లక్ష్యసాధన వైపే దృష్టి సారించాడు.

సత్యవాది త్రిపాఠీ పూరీకి చెందిన పత్రికా రచయిత. ఆయన సత్యవాది పాఠశాలలో ఉపాధ్యాయుడుగా ఉండేవాడు. ఆయనే సత్యవాది ముద్రణాలయం మొదటి మేనేజరు. ఆయన ద్వారా తెలిసిన విషయం - గోపబంధు ఆయనకు పదహారు వందల రూపాయలిచ్చి పంపగా, ఆయన వెళ్లి ఏమార్ మఠానికి చెందిన మహంత్ మహారాజ్ గదాధర్ రామానుజదాస్ గారి నుంచి ఒక చేతి ముద్రణాయంత్రాన్ని కొని తెచ్చాడట. ఆ యంత్రం అప్పుడు మదన్ మోహన్ ముద్రణాలయం పేర మారిచ్ కోట్ వీధిలో మహావీర్ ధర్మశాలలో ఉండేది. పూరీనుంచి ఎడ్లబండి మీద వేసి త్రిపాఠీ ఆయంత్రాన్ని సాక్షిగోపాల్ చేర్చాడు. సత్యవాది పాఠశాల సమీపంలోనే పూరి యింట్లో యంత్రాన్ని నెలకొల్పారు. స్థలాన్ని బట్టి 'సత్యవాది' అనే పేరుతో మాసపత్రిక, అంతకు పూర్వం బరంపురంలో ముద్రితమవుతూ ఉండేది. దాన్ని యిప్పుడు సత్యవాది ముద్రణాలయం నుంచి వెలువరించడం ప్రారంభించారు. అయితే అది సాహిత్య పత్రికగా ఉండేది. సత్యవాది పాఠశాల ఉపాధ్యాయులూ, విద్యార్థులూ వ్రాసిన రచనల్ని ఎక్కువగా ప్రచురించేది. దాని పాఠకలోకం కూడా విద్యాధికులు కొందరికే పరిమితం కావడం వల్ల, జనసామాన్యానికి దానివల్ల ప్రయోజనం చేకూరలేదు. అందుచేత గోపబంధు సంకల్పించిన ఆశయాన్ని ఆ పత్రిక నెరవేర్చలేదు.

గోపబంధు ఒకవార పత్రికను వెలవరించేందుకు నిశ్చయించాడు. అదే 'సమాజ్' పత్రిక. 'సమాజ్' అనే పేరుని సాభిప్రాయంగానే ఉద్దేశించాడు గోపబంధు. పత్రికా సంపాదకీయం వ్రాస్తూ మొదటి సంచికలోనే తానాపేరును

ఎన్నుకోవడానికి గల కారణాలను వివరించాడు. 'సమాజ్' అనగా సమాజం. అందులో అన్ని రకాలైన మనుష్యులూ ఉంటారు. సమాజం నైసర్గికంగా ఒక సమాహారమే అయినప్పటికీ, అందులోని మనుష్యుల మధ్య చాల తేడాలున్నాయి. అందులో అమిత ధనవంతులూ ఉన్నారు, ఏమీలేని నిరుపేదలూ ఉన్నారు. చాల చోట్ల ప్రజా సామాన్యం అనుభవించే దుర్భర దారిద్ర్యానికి కారణం, సంపద కొందరి చేతుల్లో కేంద్రీకృతం కావడమే. దారిద్ర్యం అనేది విధి నిర్ణయమనీ, దాన్ని మానవ ప్రయత్నం తొలగించజాలదనీ, చాల కాలంగా నమ్మకం ఉండేది. ఆ అపోహ యిప్పుడు క్రమంగా రూపుమాసిపోయింది. ప్రజల కష్టనిష్ఠూరాలు అంతం కావాలంటే, సమాజోద్ధరణం జరగాలంటే, ప్రజల ఆశలూ ఆశయాలూ అభివ్యక్తం అయ్యేందుకు మొదట మార్గం ఏర్పడాలి. అలా అని సమాజంలో నేడు ప్రముఖులు భావిస్తున్నారు. ఆపని నిర్వహించేందుకే ఒరిస్సా సమాజానికి 'సమాజ్' పత్రిక ఏర్పడింది. అటుపై మూడవ సంచికలో గోపబంధు 'సమాజ్' పత్రిక లక్ష్యాలను యిలా పేర్కొన్నాడు.

''సమాజ్' పత్రిక ప్రతి శనివారం వెలువడుతుంది. సత్యవాది ముద్రణాలయంలో అచ్చవుతుంది. దేశంలో పరిస్థితిని ఈ పత్రికలో చర్చిస్తాము. ముఖ్యంగా గ్రామీణ ప్రజల సాధక బాధకాలను యీ పత్రిక వివరిస్తుంది. ప్రభుత్వం దృష్టికి రావలసిన ప్రజా సమస్యల్ని గూర్చి నిర్మోహంగా చర్చిస్తాము. అంతే కాదు, ప్రభుత్వ విధానాన్నీ, ప్రభుత్వం అమలు చేస్తున్న కార్యక్రమాన్నీ పత్రిక ద్వారా ప్రజలకు వివరిస్తాము, ముఖ్యంగా ఆరోగ్యమూ, ప్రాథమిక విద్య, మతము, గ్రామ పంచాయతీలు, సహకారోద్యమము, సామాజిక పరిస్థితులు, వ్యవసాయము, గ్రామీణ పరిశ్రమలు, తదితర గ్రామ సంబంధ విషయాలకు ప్రత్యేక స్థానం ఉంటుంది. 'సమాజ్'లో వ్రాసే బాష సులువుగా అర్థమయ్యేభాష. అక్షరాస్యులైన ప్రజలందరూ అవలీలగా అర్థం చేసుకోగలిగిన భాష. అక్షరాస్యులు కాని వాళ్లు కూడా ఎవరిచేతనైనా చదివించుకొని అర్థం చేసుకోగలిగే భాష.''

'సమాజ్' పత్రిక నాలుగు పేజీలు ఉండేది. దాని ప్రథమ సంపాదకుడు గోపబంధు దాస్. ప్రకటించక పోయినప్పటికీ పండిత్ కృపాసింధు మిశ్రా సంయుక్త సంపాదకుడుగా పనిచేశాడు. సత్యవాది ముద్రణాలయానికి మొదటి నిర్వాహకుడు (మేనేజరు) సత్యవాది త్రిపాఠీ. ముద్రణాలయ మంటే రెండుగదుల చిన్న యిల్లూ, అందులో ఏర్పాటైన చేతి ముద్రణా యంత్రమూ, సత్యవాది పాఠశాల విద్యార్థులకు తమ సంస్థనుంచి ఒక వార్తా పత్రిక వెలువడుతూ ఉండటం ఒక ఉత్సాహ హేతువైంది. తీరిక సమయంలో వాళ్లు కాగితం కత్తిరించడం, బైండింగ్ చెయ్యడం, పత్రికను పోస్ట్‌కి పంపించడం వగైరా పనుల్లో

సహాయం చెయ్యడం ప్రారంభించారు.

1919లో గోపబంధు సింగ్‌భూమ్ జిల్లాలో తరుచు పర్యటించాడు. ఆ సందర్భంలో ఆయనకు ప్రభుత్వోద్యోగంలో ఉన్న ఒక చురుకైన యువకునితో సన్నిహిత సంబంధం ఏర్పడింది. గోపబంధు వ్యక్తిత్వం వల్ల ఆకర్షితుడైన ఆ యువకుడు తన ఉద్యోగాన్ని వదిలి పెట్టి 1919 అక్టోబరులో ఆయనతో కలిసి పనిచెయ్యడానికి సాక్షిగోపాల్ వచ్చాడు. ఆ యువకుడే రాధానాథ్‌రథ్. 'సమాజ్' పత్రికకు యిప్పుడు సంపాదకుడు. స్ఫురద్రూపమూ, చక్కని వాగ్విలాసమూ, ఆకర్షణీయమైన వ్యక్తిత్వమూ గల రాధానాథ్ రథ్ 1919 అక్టోబరులో 'సమాజ్' పత్రికకు ప్రథమంగా నిర్వహణాధికారి (మేనేజరు) గా నియమితుడయ్యాడు. సత్యవాది పాఠశాలలో చదివి, అటుపై కటక్ పియరీ మోహన్ అకాడెమీలో సహాయోపాధ్యాయుడుగా పనిచేసిన హరిహర రథ్ పత్రికకు సహాయ నిర్వాహకుడుగా నియమితుడయ్యాడు. పత్రికా వ్యవహార దక్షత అంతా రాధానాథ్ రథ్‌దే. నిర్వహణాధికారి గానూ, సంపాదకుడైన గోపబంధుదాస్‌కు వ్యక్తిగత సహాయకుడుగానూ, రథ్ పూర్తి బాధ్యతలుస్వీకరించాడు. సత్యవాదిలో గోపబంధులేని సమయాల్లో పత్రికా ప్రచురణ విషయం పండిత్ నీలకంఠదాస్, ఆచార్య హరిహరదాస్, రామచంద్ర రథ్‌గారలు పర్యవేక్షించేవారు. ఆ విధంగా పత్రిక వర్ధిల్లింది.

'సమాజ్' వార పత్రికగా కూడా ఎన్నో ఒడిదుడుకుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. 1921 ఆగస్టు 13తేదీ 'సమాజ్'లో ''ఇది నిజమైతే గర్హింప దగినదే.'' అన్న శీర్షికతో ఒక వార్త ప్రచురింపబడింది. దాని విషయమై పూరీజిల్లా బెగూనియా పోలీస్ స్టేషన్‌కి చెందిన నలుగురు పోలీసులు (కాన్‌స్టేబిల్స్) సంపాదకుడైన గోపబంధు మీద, సెక్షన్ 499/500 ఐ.పి.సి. క్రింద, ఒక పరువు నష్టం దావా వేశారు. ఆ ప్రచురింపబడిన వార్త, బెగూనియా పోలీస్ స్టేషన్‌కు చెందిన యిద్దరు జవాన్లు (కాన్‌స్టేబిల్స్) నడిబజారులో ఒక స్త్రీని అవమానించారని ఆరోపించింది. దాని ప్రచురణ తర్వాత 1/2 నెలలకు, గోపబంధుకి ఆ వార్త యాదార్థ్యాన్ని గూర్చి సందేహం రానడంతో, దాన్ని ఖండిస్తూ 1921 సెప్టెంబరు 24 తేదీ సంచికలో మళ్లీ ఒక ప్రకటన వెలవడింది. అయినప్పటికీ పూరీలోని పోలీస్ అధికారులు, బీహార్-ఒరిస్సా రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఆమోదంతో, పత్రికా సంపాదకుని మీదా, దాని ముద్రణకూ ప్రచురణకూ బాధ్యులైన వారి మీదా ప్రాసిక్యూషన్ దావా తెచ్చారు. దావా విచారించిన మేజిస్ట్రేట్ సురేష్ చంద్రబోస్, నేతాజీ సుభాష్ చంద్రబోస్‌కి అన్నగారు. ఆయన గోపబంధు మీద నేరం ఏమీ లేనట్లు చివరకు తీర్పు యిచ్చారు. కాని విచారణాకాలంలో 1921 అక్టోబరు 28

నుంచి నవంబరు 29 దాకా, ఒక నెలరోజులు, గోపబంధు జైల్లో గడపవలసి వచ్చింది.

## సంపాదకుడుగా బాధ్యత

గోపబంధు సంపాదకుడుగా తన బాధ్యత గురుతర మైనదని భావించాడు. 1922 ఫిబ్రవరి 11 తేదీ సంచికలో ఆయన యిలా విజ్ఞప్తి చేశాడు.

''వార్తా పత్రిక దేశంలోని వార్తలు ప్రచురిస్తుంది. నలుమూలల నుంచి వార్తలు రావాలని సంపాదకుడు అభిలషిస్తాడు. నిజమైన వార్త వస్తేదాన్ని సంతోషంగా ప్రచురిస్తాడు. అది అతని విధి. కాని ఒకానొక వార్త ఎప్పుడు ప్రచురించాలి? ప్రచురించాలా, వద్దా? ప్రచురించి నందువల్ల కలిగే ఫలితాలేమిటి? అన్న విషయాలు కేవలం సంపాదకుడే నిర్ణయించ వలసినవి. అది యితరుల బాధ్యత కాదు. ఒక్కొక్క సారి వార్తా విలేఖరులు సంపాదకుని బాధ్యత తామే తీసుకుని, వాళ్ళ పంపిన వార్తలు ప్రచురించక పోతే అసహనం ప్రదర్శిస్తున్నారు. సంపాదక వర్గాన్ని తిట్టిపోసే సందర్భాలు కూడా ఉన్నాయి. కొందరైతే పత్రిక తమ ప్రాంతంలో చెల్లుబడి కాకుండా అవరోధిస్తామని కూడా బెదరిస్తారు. వార్తా పత్రికల లక్ష్యం ప్రయోజన కరమైన, అవసరమైన వార్తల్ని ప్రచురించడమని వీళ్ళు అర్థం చేసుకోవాలి. అటువంటి వార్తలే అమూల్యమైనవి సంపాదకుని దృష్టిలో. కాని వ్రాసి పంపిందంతా ప్రచురించబడాలని ఆశించడం న్యాయంకాదు. సరియైన వాకబు చెయ్యకుండానే విలేఖరులు వార్తలు పంపే సందర్భాలున్నాయి. వార్త యదార్థ్యం అనుమానాస్పదమైనప్పుడు వాటిని ప్రచురించడం క్షేమం కాదు. మరోవిధంగా పరిష్కారం లభ్యమయ్యే సమస్యల్ని ప్రచురించడమూ మంచిది కాదు.... 'సమాజ్' పత్రిక ఒరిస్సా గ్రామీణ ప్రజల నుద్దేశించి తయారవుతున్నది. వాళ్ళెంత వరకు విద్యావంతులో మాకు తెలుసు. అందుచేత మేము వార్తల్ని జాగ్రత్తగా పరిశీలించి, సందర్భోచితమూ, సముచితమూ అయిన వార్తల్నే ప్రచురిస్తాము. కొన్ని ప్రయోజనాత్మకమైన వార్తలు మా దృష్టినుంచి తప్పిపోవచ్చు పనితొందరలో. అలా జరిగితే దానికి మేము చింతిస్తున్నాము.''

గోపబంధు మీద వేసిన దావా వీగి పోవడంతో, పూరీ జిల్లా మేజిస్ట్రేట్ భద్రతా డిపాజిట్ క్రింద రెండువేల రూపాయలు కట్టమని ఉత్తర్వు జారీ చేశాడు. కాని సంపాదకుడు పర్యటనలో ఉండటం వల్ల భద్రతా డిపాజిట్ తాల్యూకు నోటీస్ ఆయనకు అందలేదు. 1922 మే 31తేదీ గోపబంధుని అరెస్ట్‌చేసి, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 144 సెక్షన్ క్రింద రెండు సంవత్సరాల ఖైదు శిక్ష విధించారు.

అప్పుడు ఆచార్య హరిహరదాస్, పత్రిక సంపాదకత్వమూ ముద్రణ, ప్రచురణ బాధ్యతలనూ 1922 జూన్ 10 తేదీన స్వీకరించాడు. సహాయ నిరాకరణోద్యమంలో బాగంగా గోపబంధు బ్రిటీష్‌వారి కోర్టులను బహిష్కరించి ఉండటంతో, ఆయన కోర్టులో తనవైపు వాదన వినిపించలేదు. దావా 'ఎక్స్-పార్టీగా తీర్మానమై, గోపబంధుకి శిక్ష పడింది.

## 'సమాజ్' పూరీకి మారడం

ఖైదునుంచి విడుదల కాగానే గోపబంధు 'సమాజ్' పత్రిక సంపాదకత్వాన్ని తిరిగి స్వీకరించాడు. ఆచార్య హరిహరదాస్ ముద్రణ, ప్రచురణ బాధ్యతలను ఉంచుకున్నాడు.

వార్తా పత్రికగా 'సమాజ్' పలుకుబడి పెరగడంతో పత్రిక సాహసం కూడా పెరిగింది. సంపాదకుడు దాన్ని ప్రజాసేవకు చక్కగా వినియోగిస్తూ రావడంతో ప్రజాదరణ యినుమడించింది. అందువల్ల సమస్యలూ వచ్చాయి. 1928మే నెలలో పారికుడ్‌లో పోలీస్ దౌర్జన్యాన్ని గూర్చి ఒక వార్త ప్రచురింపబడింది. ఆ వార్త పంపిన విలేఖరి పేరు తమకు తెలయజెయ్యాలని పోలీసు అధికారులు సంపాదకుని కోరారు. విలేఖరి మీద దావా వెయ్యాలని వాళ్ల ఉద్దేశం. సంపాదకత్వ నియమావళి దృష్ట్యా గోపబంధు వాళ్ల కోరికను మన్నించలేదు. పోలీసులకు కోపం వచ్చి 'సమాజ్' పత్రికా కార్యాలయాన్ని సోదా చేశారు. ముద్రాసకుడూ, ప్రచురణ కర్తా ప్రాసిక్యూట్ చెయ్యబడడంతో వందరూపాయల జరిమానా చెల్లించ వలసి వచ్చింది.

## గోపబంధు మృతి తర్వాత 'సమాజ్'

1928 జూన్ 17 తేదీ గోపబంధు మరణించాడు. ఆయన చనిపోయే ముందు పత్రికనూ, దాని ఆస్తి పాస్తులనూ లాహోర్‌లోని ప్రజా సేవక సమాజానికి (సర్వెంట్స్ ఆఫ్‌ది పీపుల్ సొసైటీ) ధారాదత్తం చేశాడు. 'సమాజ్' పత్రిక గడించే లాభాల్ని సొసైటీ వారు కైవసం చేసుకోకుండా ఉండే రీతిలో గోపబంధు ఏర్పాట్లు చేశారు. లాభాలన్నీ సామాజిక, రాజీకయ, విద్యావిషయిక కార్యకలాపాలకు ఒరిస్సాలోనే వినియోగింప బడాలి అనే నిబంధనను స్పష్టంగా ఆయన తన దాన పత్రంలో పేర్కొన్నాడు. గోపబంధు దాస్ దూరదృష్టి మూలంగానే 'సమాజ్' పత్రిక నేడింత ప్రవర్ధమాన స్థితిలో ఉన్నదని కొందరి అభిప్రాయం.

ఒక దశాబ్ది కాలం పాటు గడించిన అభివృద్ధితో 'సమాజ్' పత్రిక ఒరిస్సా ప్రజల హృధయాల్లో ఎలాంటి స్థానం ఏర్పరచుకున్నదంటే, అసలు వార్తాపత్రికకు పర్యాయ పదమే 'సమాజ్' గా రూపొందిందివారి దృష్టిలో. నిర్వాహకులు పత్రికను దిన పత్రికగా మార్చితే ప్రజల అవసరాలకి బాగా పనికి వస్తుందనీ, సహాయ నిరాకరణోద్యమం గూర్చి తాజా వార్తలని ఒరియా ప్రజలకు ఎప్పటికప్పుడు అందివ్వడానికి వీలవుతుందనీ భావించారు. ఆ ప్రకారమే 'సమాజ్' యొక్క దిన సంచిక ఒకకాని (రెండుపైసాలు) వెలతో, డబుల్ క్రౌన్‌సైజ్‌లో రెండుషీట్లు ఉండేట్టుగా 1930 ఏప్రిల్ 6తేదీ నుంచి ప్రచురింప బడుతూ వచ్చింది.

ఒరిస్సాలో పత్రికా ప్రచురణకు పితృత్వం వహించిన వాడు గోపబంధు. మొట్ట మొదటి దినపత్రిక 'డెయిలీ ఆశా' శశి భూషణ్ రథ్ సంపాదకత్వంలో బరంపురం నుంచీ వెలువడినప్పటికీ, దాని ప్రచురణ గోపబంధు దాస్ ప్రేరణ వల్లనే ప్రారంభమైంది. ఆరు సంవత్సరాల పాటు ఆయనే ఆ పత్రిక సంపాదకీయాలు వ్రాశాడు. తనదైన 'సమాజ్' దినపత్రికగా ప్రచురింప బడటాన్ని మాత్రం ఆయన చూడలేదు. అప్పటికి రెండేళ్ళ ముందుగానే ఆయన పోయాడు.

గోపబంధు, నిజాయితీకి, పత్రికారచనలో నిర్వహణలో నైతిక బాధ్యతకు, ఎంతో విలువ నిచ్చిన వ్యక్తి. న్యాయవాదిగా ఆయన బనాయింపు కేసులను పట్టి ఎరగడు. సంపాదకుడుగా, అతిశయోక్తీ అసత్యమూ అయిన వార్తను ప్రచురించి ఎరగడు. కాని విధివైపరీత్యం ఎలాంటిదంటే, ఆయన జీవితంలో ఎదుర్కొన్న మొదటి ప్రాసిక్యూషన్‌కేసు, ఒక స్త్రీ మీద జరిగిన అత్యాచారాన్ని గూర్చి అబద్ధపు వార్త ప్రచురించినందుకు (ఇది పైన పేర్కొనబడ్డది.) అధికారులు అవార్తను నిరాధారమన్నారు.

పత్రికా రచనలో గోపబంధు భాషాశైలి అనితర సాధ్యం. నిరక్షరాస్యులైన గ్రామీణ ప్రజలు చదవడానికి ఉద్దేశింప బడింది ఆయన పత్రిక. అందుకోసం ఆయన సామాన్యునికి అర్థమయ్యేశైలినీ, పదజాలాన్నీ ఉపయోగించాడు. ఒరియా సాహిత్య రంగంలో ఒక వినూత్న వచన శైలికి శ్రీకారం చుట్టిన రచయితగా గోపబంధు గణుతికెక్కాడు.

'సమాజ్' నేడు ప్రసిద్ధ వార్తా పత్రిక. సొంత భవనం గల పత్రిక. సాక్షి గోపాల్ కుటీరంలో చిన్నగా ప్రారంభమైన పత్రిక ఈ ఉచ్ఛస్థితికి వచ్చిందంటే, వ్యవస్థాపకుడైన గోపబంధు ఎప్పుడో కన్నకల ఫలించిందన్నమాట.

అధికారులకు కళ్ళ మెరమెరగా ఉండేవాడు గోపబంధు. కారణం 1920 నాటి సహాయనిరాకరణోద్యమంలో ఆయన నిర్వహించిన రాజకీయ పాత్ర. గొప్పదేశ భక్తుడైన గోపబంధుని కొట్టడానికి ఏ కర్ర అయిన సరేననే ధోరణిలో

ఆనాటి ప్రభుత్వం ప్రవర్తించింది. కాని అవకాశాలు అంతసులువుగా వారికి చేజిక్కలేదు. 'సమాజ్'లో ప్రచురింపబడిన ఒకానొక వార్తను పట్టుకుని ప్రాసిక్యూట్ చేసి, పండిత్ గోపబంధు దాస్ మీద వాళ్ళు అక్కసు తీర్చుకున్నారు.

## 13

# సహాయ నిరాకరణోద్యమము, కారాగార ప్రాప్తి

భారత జాతీయ కాంగ్రెస్‌ని ఒరిస్సాకు తెచ్చిన వాడు గోపబంధు. కాంగ్రెస్ దూతగా ఆయన రాష్ట్రంలో మూలమూలలా పర్యటించి జాతీయ సంస్థ సందేశాన్ని వ్యాపింప జేశాడు. మహాత్మాగాంధి ఆదేశానుసారం 'తిలక్‌స్వరాజ్య నిధి'ని ఏర్పాటు చేశాడు. ఈ నిధి లోకమాన్య బాల గంగాధర్ స్మృతి నిమిత్తమూ కాంగ్రెస్ ఆర్థిక వనరుల్ని పెంపొందించేందుకూ, మహాత్ముడు ప్రారంభించాడు. దానికి వ్యక్తి చెల్లించ వలసిన చందా ఒక కానీ మాత్రమే. అందుచేత నిధికి చందాలివ్వడం ద్వారా సామాన్య ప్రజలు కాంగ్రెస్ వ్యవహారాల్లో పాల్గొనే అవకాశం ఏర్పడింది. ఎవరైనా వస్తురూపేణా చందాయిస్తే. ఆ వస్తువుల్ని బహిరంగసమావేశాల్లో వేలం వేసి, వచ్చిన మూల్యధనాన్ని నిధిలో చేర్చేవారు. గోపబంధు 'ఉత్కళ స్వాతంత్ర్య సేవాదళా'న్ని కూడా ఏర్పాటు చేశాడు. మాతృ దేశ సేవలో యువకుల్ని నిమగ్నుల్ని చెయ్యడం దాని ఉద్దేశం. రాష్ట్రకాంగ్రెస్ కమిటీ ఒకటి ఉండేది. గోపబంధు దాని అధ్యక్షుడు. ఆయనే జిల్లా కాంగ్రెస్ కమిటీలను ఒరిస్సాలో ప్రతి జిల్లాలోనూ ఏర్పాటు చేశాడు. ఆవిధంగా గోపబంధు కృషి ఫలితంగా రాష్ట్రంలో కాంగ్రెస్ సువ్యవస్థితం అయింది. ప్రజల్లో స్వాతంత్ర్యం పట్ల ఉత్సాహం పెల్లుబికింది.

స్థానిక అధికారులకిది ఏమాత్రమూ నచ్చలేదు. కాంగ్రెస్ పట్ల గోపబంధు చూపుతున్న ఉత్సాహాన్ని వాళ్ళు నిరోధించడానికి పూనుకున్నారు. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 144-సెక్షను క్రింద ఆయనకొక ఉత్తర్వు జారీ అయింది. తద్వారా ఆయన వెళ్ళగానే గుమికూడే ప్రజాసమూహాన్ని ఉద్దేశించి ప్రసంగించడం నిషేధించారు. సి.ఐ.డి. వాళ్ళు ఆయన్ని నిర్బంధంలో పెట్టడానికి ఏదో నెపం కోసరం వెతకటం ప్రారంభించారు. బెగూనియా పోలీస్ స్టేషన్ జవానులు ఒక స్త్రీపై అత్యాచారం చేశారన్న వార్త ప్రచురించి నందుకు ఆయన మీద తేబడిన అభియోగం సాక్ష్యం లేక కోర్టులో వీగిపోయింది. ఆ అభియోగాన్ని గోరంతలు కొండంతలు చెయ్యడానికి పెద్ద పెద్ద అధికారులే గూడుపుఠానీ చేసి ప్రయత్నించినప్పటికీ లాభం లేకపోయింది. అభియోగం వీగిపోవడంతో, గోపబంధు కాంగ్రెస్ పని మీద

సాంబల్‌పూర్ వెళ్లాడు. 144–సెక్షన్ క్రింద ఉత్తర్వు జారీ చేయించి అధికారులు ఆయనకు వాగ్బంధం చేయిస్తారని అనుకున్నారు. కానీ అదృష్టవశాత్తూ డిప్యూటీ కమీషనర్ పర్యటనలో ఉండటం వల్ల ఆ ఉత్తరువు జారీ కాలేదు. గోపబంధు ఒక పెద్ద సమావేశంలో ప్రబోధం చెయ్యడమే కాకుండా, విదేశీ వస్త్ర దహనాన్ని కూడా పెద్ద ఎత్తున నిర్వహించాడు. మద్రాస్ రాష్ట్రంలో గంజాం, విశాఖపట్టణం, జిల్లాల్లో కూడా, ఒరియా వాళ్ల పెద్ద సంఖ్యలో ఉన్న ప్రదేశాల్లో, ఆయన పర్యటించాడు. 1921 సెప్టెంబరు చివరివారంలో ఆయన కలకత్తా వెళ్లాడు. అక్కడ జనుము, ప్రత్తి, కార్ఖానాల్లో పనిచేస్తున్న ఒరియా కార్మికుల సమావేశానికి అధ్యక్షత వహించాడు. తర్వాత బరంపురం తిరిగి వచ్చేప్పటికి 144 సెక్షను క్రింద ఆయన ప్రసంగించకుండా నిషేధం వచ్చింది. ఉత్తర్వులెలావున్నా కాంగ్రెస్ సందేశాన్ని ఆయన వ్యాపింపజేస్తూనే వచ్చాడు. ఎక్కడికి వెళ్లినా విదేశీ వస్త్ర బహిష్కరణమూ, ఖద్దరు ధారణా కర్తవ్యమంటూ, మహాత్మాగాంధి సహాయనిరాకరణోద్యమాన్ని దేశవిముక్తి మార్గంగా, ఆయన ప్రజలకు ప్రబోధిస్తూ వచ్చాడు.

1921లో పూరీలో తీవ్రమైన క్షామం సంభవించింది. లక్షలాది ప్రజలు తిండికి లేక మాడుతూ ఉంటే, బియ్యమూ వడ్లూ పూరీనుంచి ఎగుమతి చెయ్యడం గోపబంధుకి నచ్చలేదు. ఆ విషయమై, ఎగుమతుల్ని ఆపమని చెప్పేందుకు స్థానిక అధికారుల్ని కలుసుకున్నాడు గోపబంధు. ఆ సమయంలోనే రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సమావేశమై భారతజాతీయ కాంగ్రెస్ అహమ్మదాబాద్ సమావేశానికి ప్రతినిధుల్ని ఎన్నుకొన్నది. ఆ పనులు చూసుకొన్న తర్వాత గోపబంధు బంకీ పర్యటించటానికి వెళ్లాడు. ప్రభుత్వానికి అదురు పుట్టింది. అక్కడ గోపబంధు పన్నుల నిరాకరణోద్యమాన్ని ప్రారంభిస్తే తీవ్రమైన యిబ్బందులు కలుగుతాయని ఊహించి, ప్రభుత్వం 144 సెక్షను క్రింద ఆయన బంకీ ప్రవేశించకుండా నిషేధ ఉత్తర్వు జారీ చేసింది. 1921 డిసెంబర్10 తేదీ ప్రభుత్వం, రాష్ట్ర, జిల్లా కాంగ్రెస్ కమిటీల కార్యాలయాల్లో సోదా జరిపింది. సత్యవాది పాఠశాల, వసతి గృహాలు, గోపబంధుయిల్లు కూడా సోదా చేశారు. ఆ సమయంలో గోపబంధు సాక్షి గోపాల్‌లోనే ఉన్నాడు. లాఠీలు, కర్రలు తుపాకులూ ధరించిన పెద్ద పోలీసు బలగం తన యింటికి సోదాకు వచ్చినప్పుడు ఆయన ఏమీ ఆటంకం చెప్పలేదు. ఇల్లు వాళ్ల ఆధీనంలో విడిచి పెట్టి ఆయన కటక్ వెళ్లిపోయాడు. రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సమావేశానికి హజరవడానికి. అక్కడా పోలీసులతో అదే దృశ్యం కంటబడింది. ఒరిస్సాలోని జిల్లాలన్నింటినుంచీ వార్తలందేయి. అవ్యాజంగా పోలీసులు దాడి జరపడం అనేది విస్తారంగా అన్ని చోట్లా సంభవించిందనీ, ప్రభుత్వం ఉద్దేశ

పూర్వకంగానే అలా చేసిందనీ తెలియు వచ్చింది. పల్లెలు కూడా మినహాయింపబడలేదు. కాని ప్రజల ఉత్సాహాన్ని ఈ దాడులు అరికట్టలేక పోయాయి. భారత స్వాతంత్ర్యం కోసరం పోరాడాలి అనే బావం వజ్రం సంకల్పమై ప్రజల్లో దృఢపడింది. గోపబంధు చేస్తున్న అసహాయకృషి సాధించలేని లక్ష్యాన్ని పోలీసు దాడులు ఆయనకు సాధించి పెట్టేయి.

కాంగ్రెస్ సమావేశానికి గోపబంధు అహమ్మదాబాద్ వెళ్లాడు. తిరిగి వచ్చిన తర్వాత కటోరీ యిసుక తిన్నెల మీద బహిరంగ సభలో 1922 జనవరి 11 తేదీ ఆయన మాట్లాడవలసి ఉంది. ప్రభుత్వం ఏమి ముంచుకు వస్తుందో అనే ఆదుర్దాతో 144-సెక్షను క్రింద ఉత్తర్వు జారీ చేస్తూ ఆయన్ని సమావేశానికి రాకుండా, అక్కడ మాట్లాడకుండా నిషేధించారు. అలాంటి ఆజ్ఞలను తప్పించుకోవడమెలాగో తెలిసిన సత్యా గ్రహివలె గోపబంధు తన ఉపన్యాసం వ్రాత ప్రతిని సమావేశంలో చదివింప జేశాడు అది కటక్ జిల్లా మేజిస్ట్రేట్ తనకు జరిగిన అవమానంగా భావించి, కోపావిష్టుడై మరో ఉత్తర్వు జారీచేశాడు. అందులో ఏసమావేశానికీ, ఎటువంటి వ్రాత ప్రతినీ పంపరాదని నిషేదం పెట్టాడు. అన్ని నిషేధాల మూలంగా కటక్‌లో తాను ఉన్నప్పటికీ తనద్వారా జరిగే ప్రయోజనం ఏమీలేదని గోపబంధు గ్రహించి, సింగ్ భూమ్ వెళ్లాడు. సింగ్‌భూమ్ డిప్యూటీ కమీషనర్ సెలవుమీద గ్రామాంతరం వెళ్లి ఉండటంతో మొదట కొన్ని రోజులు గోపబంధుకి ఏమీ అవరోధం లేకపోయింది. ఆయన క్వొల్హాన్ వెళ్ల పోతూండగా, డిప్యూటీ కమీషనర్ బాధ్యతల్ని తాత్కాలికంగా నిర్వహిస్తున్న అధికారి తనని బంగాళాలో కలుసుకొమ్మని ఒక లేఖ పంపాడు. గోపబంధు పన్నుల నిరాకరణ ప్రచారాన్ని ప్రారంభించ బోతున్నాడని డిప్యూటీ కమీషనరు ఆదుర్దాపడి 144- సెక్షన్ క్రింద నిషేధాజ్ఞను జారీచేయాలని ఉద్దేశించాడు. జంకు గొంకులు లేకుండా గోపబంధు నేరుగా డిప్యూటీ కమీషనరు నివాసానికి వెళ్లాడు. అధికారి గోపబంధుతో మాటల్లో పడి నిషేధపుటుత్తర్వు విషయమే విస్మరించాడు. అటుపై గోపబంధు క్వొల్హాన్ వెళ్లాడు. డిప్యూటీ కమీషనరు ఉత్తర్వు సంగతి గుర్తు తెచ్చుకునేప్పటికే, గోపబంధు ముప్ఫై మైళ్ల దూరం వెళ్లాడు. కొన్ని సభల్లో మాట్లాడాడు. విదేశీ వస్త్ర దహన కాండ నిర్వహించాడు కూడా. చిట్ట చివరకు నిషేదాజ్ఞ ఆయన సోమవాలో ఉండగా అందింది. అది అందగానే ఆయన తనకార్య కలాపాల్ని విరమించాడు. సింగ్‌భూమ్‌లో చేసేదేమీ లేక పోవడంతో 1922 జనవరి 20 తేదీ ఆయన జర్సాగూడా చేరుకున్నాడు. సాంబల్ పూర్ జిల్లాలో ఆయన కోసరం, కాంగ్రెస్ సమావేశాలు సాంబల్‌పూర్ పట్టణంలోనూ, జర్సా గూడా బారా గర్‌లలోనూ ఏర్పాటైనవి. సాంబల్‌పూర్ డిప్యూటీ కమీషనరు సింగ్‌బూమ్ అధికారి కంటె చురుకైనవాడు. అతను జిల్లా

అంతటా 144 సెక్షను క్రింద నిషేధాజ్ఞ జారీచెయ్యడమే కాకుండా, గోపబంధుకి స్వయంగా దాన్ని అందజేశాడు. అందువల్ల గోపబంధు లిఖిత ప్రసంగమే ప్రతి సభలోనూ చదివేవారు. సాంబల్ పూర్‌లో తన ప్రయోజనం లేకపోవడంతో గోపబంధు పూరీ బయలుదేరాడు. అయితే బాలసూర్ జిల్లా మేజిస్ట్రేట్ ముందు జాగ్రత్తతో, నిషేధాజ్ఞను రైలుపెట్టెలోనే అందజేస్తూ బాలసూర్ స్టేషన్ ప్లాట్‌ఫారం మీద గోపబంధు అడుగు పెట్టకూడదన్నాడు. ఆ విధంగా అన్ని జిల్లాల నుంచీ ఆయన్ని తరిమివేశారు. తన స్వస్థలమైన పూరీ చేరుకున్న తక్షణమే ఆయనకు జిల్లా మేజిస్ట్రేట్ మరో ఉత్తర్వు అందించాడు. ఇన్ని నిషేధాజ్ఞలూ అందుతూనే ఉన్నా గోపబంధు నిర్భయంగా కాంగ్రెస్ కమిటీ సభ్యుడుగానూ, తదితర సంస్థల తరపునా, తన విధి నిర్వహణ చేస్తూనే వచ్చాడు. కాంగ్రెస్ ఉద్దేశాలను విరివిగా ప్రచారమూ చేస్తూనే వచ్చాడు.

## బొంబాయిలో

1922 ఫిబ్రవరినెల మధ్యలో గోపబంధు, లింగరాజ్ మిశ్రా కలసి బొంబాయి వెళ్లారు. ఒరిస్సాలో క్షామ నివారణకు చందాలు సేకరించే ఉద్దేశంతో వెళ్లి అక్కడ సర్వెంట్స్ అఫ్ ఇండియా సొసైటీ అతిథులుగా బసచేశారు. వీళ్ల బొంబాయికి కొత్త వాళ్లు కారు. ఒరిస్సాను గురించి బొంబాయి పత్రికల్లో తరచు వార్తలు పడుతూండేవి. ముఖ్యంగా సాక్షిగోపాల్ లో జరుగుతున్న నూతన విద్యావిధాన ప్రయోగాన్ని గూర్చి పత్రికలు వ్రాసి ఉండినవి. బొంబాయిలోని స్థానికులు గోపబంధు చెప్పగా ఒరిస్సాను గురించి వినాలని కుతూహల పడడంతో ఆయన ఒక బహిరంగ సమావేశంలో మాట్లాడ వలసివచ్చింది. ఆ ప్రసంగంలో గోపబంధు ఒరిస్సాలో పరిస్థితుల్ని బొమ్మకట్టినట్లు వర్ణించాడు. నాలుగు రాష్ట్రాలలో చెదిరిపోయి ఉండడం వల్ల ఒరిస్సా తన శక్తిని కోల్పోయి ఎలా నిర్వీర్యమై ఉన్నదో వివరిస్తూ, స్వతంత్ర ప్రభుత్వం లేకపోవడంతో ప్రజలు వరదలతో కాటకాలతో ఎలా నిత్యబాధితులుగా ఉంటున్నారో చెప్పాడు. అటుపై సాక్షి గోపాల్‌లో ప్రయోగాత్మక విద్యావిధానం గూర్చి దాని లక్ష్యాల్నీ, పద్ధతుల్నీ ప్రయోజనాల్నీ విపులీకరిస్తూ, తన కొత్త సంస్థ ఎంత మేర ఒరియా ప్రజల్లో పేదవారికి విద్యావసరాల్ని సమకూర్చుతున్నదో కూడా చెప్పాడు. గోపబంధు ఆయన అనుయాయుల్తో కలిసి నిర్వహిస్తున్న ఈ కార్యకలాపాలన్నింటినీ సానుభూతితో ఆలకించి, ప్రశంసించిన బొంబాయిలోని పెద్ద వ్యాపారస్తులు ఆర్థిక సాహాయాన్ని అందజేశారు.

## నిర్బంధము

ఒరిస్సాకు తిరిగి రాగానే ఆయనకు తీవ్ర పరిస్థితి ఎదురైంది. 'సత్యాగ్రహ' సందేశం ఒరిస్సా నలుమూలలా పరివ్యాప్తి చెందడంతో, అదివరకు నిర్లక్ష్యం చెయ్యబడిన ప్రజానీకంలో ఆత్మవిశ్వాసం పెద్ద ఎత్తున వెలుగొంది, ముఖ్యంగా పీడిత రైతాంగం మేలుకొన్నది. కనికా లో పరిస్థితి విషమించింది. ఎందరినో నిర్బంధంలో ఉంచి, తీవ్రమైన అణచివేత పద్ధతుల నవలంబించి, 144 సెక్షను క్రింద నోరు బిగించే ఉత్తర్వులు జారీ చేసినప్పటికీ, కనికా ప్రజలు లొంగుబాటు చూపలేదు. వివక్షలేని పన్నుల విధింపు మీదా, కనికా రాజా బహదూర్, అతని తాబేదార్లూ, చేసే దౌర్జన్యం మీదా, ప్రజలు తిరుగుబాటు చేశారు. రాజా ప్రజల్లోకి వెళ్లి శాంతపరిచేందుకు ప్రయత్నించాడు. వాళ్ల యిబ్బందుల్ని తీరుస్తానని హామీ యిచ్చాడు. భూమిశిస్తు కట్టడం నిలిపి వెయ్యవద్దని వాళ్లకు నచ్చజెప్ప ప్రయత్నించాడు. కాని ఆ మాటలు వాళ్ల మీదపని చెయ్యలేదు. ఆగ్రహంతో ఉన్న ప్రజలు భూమిశిస్తు చెల్లించడం నిలిపి వేశారు. రాజాబహదూర్ తన పట్టుదలను విడిచి పెట్టలేదు. సమావేశమైన రైతులమీద కాల్పులు జరిపించాడు. చాలా మంది మరణించారు. వందలాది మంది నిర్బంధంలోకి తీసుకోబడ్డారు. ఎందరో గాయపడ్డారు. స్త్రీలను చెరచి, ఆస్తులను దోచి, యిళ్లకు నిప్పుపెట్టారు. కాని ప్రజలు చలించలేదు. ఊహించినట్లుగానే బాధ్యత అంతా కార్యకర్తల మీద వేశారు. వారి మీద నిషేద చర్యలు తీసుకొన్నారు. కనికాలో జరిగిన దమన కాండను గురించిన ఉదంతాలు 'సమాజ్' పత్రిక పుటల్లో ప్రచురితమయ్యాయి. అది చూసిన రాజా బహదూర్, సంపాదకుడైన గోపబంధు మీద విరుచుకుపడ్డాడు. సంపాదకునిమీద రాజా బహదూర్ మాననష్టం దావా వేశాడు. ఈ చర్యలు గోపబంధుని లొంగ దీసుకోలేక పోయాయి. ఆయన రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సమావేశం కోసరం బాలసూర్ వెళ్లాడు. ఆ సమావేశంలో కనికా రైతులు రాజాబహదూర్ మీద తెచ్చిన ఫిర్యాదుల్ని విచారించడానికి ఒక కమిటీ వేశారు. ఆ విచారణ నిమిత్తం రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు గోపబంధు, కార్యదర్శితో కలిసి భద్రక్ వెళ్లాడు. అక్కడ ప్రసంగించకూడదనే నిషేధాజ్ఞ జారీచేశారు. ఆ సబ్-డివిజన్‌లో ఏ సమావేశంలోనూ మాట్లాడరాదని ఆదేశించారు. ఆ చిన్న విషయం మీద అధికారవర్గాన్ని సవాలు చేసే ఉద్దేశంలేని గోపబంధు, భద్రక్ సబ్-డివిజనల్ రాజకీయ సభలో ప్రసంగించిన తర్వాత, జలేశ్వర్ వెళ్లిపోయాడు. అక్కడ రెండురోజులు మకాం చేసి, విశ్రాంతి తీసుకోవడానికి సత్యవాది చేరుకున్నాడు. సత్యవాదికి వెళ్లే ప్రయాణంలోనే ఆయన అస్వస్థుడైనప్పటికీ, బాలసూర్ జిల్లా మేజిస్ట్రేట్ 144-సెక్షను క్రింద ఆయనను జిల్లానుంచి బహిష్కరిస్తూ ఉత్తర్వు పంపాడు. సత్యవాది నుంచీ గోపబంధు పూరీ చేరాడు. అక్కడికి భద్రక్ ఎస్.డి.వో. ఆయన కొక నోటీసు పంపాడు. భద్రక్‌లో

ఉత్తర్వు ఉల్లంఘించిన నేరానికి అక్కడ ఆయన మీది దావా ప్రారంభమైనట్లు అందులో ఉన్నది. రెండు రోజులు గడిచాక, ఆయన ప్రొద్దుటి పూట కాల కృత్యాలు తీర్చుకుని వస్తూఉండగా, పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఒక అరెస్ట్ వారంట్ చూపించాడు. స్వరాజ్ స్వచ్ఛంద దళాన్ని ఏర్పాటు చేసిన నేరానికి క్రిమినల్‌లా అమెండ్‌మెంట్ ఆక్ట్ సెక్షన్ 17 క్రింద కటక్ జిల్లా మేజిస్ట్రేట్ ఆవారంట్ జారీ చేశాడు. దాన్ని చూచి గోపబంధు అన్నాడు. 'ఇన్నాళ్లకు మీరు వచ్చారన్నమాట! దీనికోసం చాలకాలంగా ఎదురు చూస్తూనే ఉన్నాను.''

## కటక్, హజారీబాగ్ జైళ్లలో

క్రిమినల్‌లా అమెండ్‌మెంట్ ఆక్ట్ క్రింద గోపబంధు నేరవిచారణ 1922 జూన్ 26 తేదీన కటక్‌లో జరిగింది. భద్రక్‌లో ఉత్తర్వు ఉల్లంఘించిన కారణంగా కూడా ప్రాసిక్యూట్ చేశారు. మొదటి నేరానికె రెండు సంవత్సరాలు, రెండవ నేరానికి ఆరునెలలూ జైల్లో సాధారణ నిర్బంధ శిక్ష విధింపబడింది. కాని నేరవిచారణ చేసిన మేజిస్ట్రేట్ రెండు శిక్షలూ ఏకకాలంలో అమలు జరిగే విధంగా ఉత్తర్వు ఇవ్వడంతో మొత్తంమీద రెండు సంవత్సరాల జైలు శిక్ష పడింది. ఆయన్ని కటక్ జైల్లో ఉంచారు. తనరాజకీయ జీవితం ప్రారంభించిన తొలి దశనుంచీ కూడా గోపబంధుకి కనికా వ్యవహారాల్లో ఆసక్తి ఉంటూనే వచ్చింది. కనికా జమీందారు రాజాబహదూర్ కఠినుడైన పాలకుడు. జమీందారిలోని ప్రజల మీద ఎన్నో రకాల పన్నులు విధించాడు. అరవైనాలుగు రకాలైన సుంకాల్ని ప్రజలు యిచ్చుకోవాల్సి ఉండేదని చెబుతారు. సుంకం లేకుండా అనుభవించేదేమీ లేదు వాళ్లకు. ప్రజలిది సహించలేక పోయారు. అన్యాయమైన సుంకాల భారాన్ని వాళ్ళు కాదనేటప్పటికి రాజాబహదూర్ వాళ్లని నానా బాధలూ పెట్టాడు. దివాన్ బహదూర్ శ్రీ కృష్ణ మహాపాత్ర, అప్పటి కటక్ పోలీసు సూపర్నెంటూ రాజావారికి చేదోడయ్యారు. 'సమాజ్', 'ఉత్కళదీపిక' ఆనాడు ఉన్నరెండు వార పత్రికలూ, రాజా వారి దుశ్చర్యలను గురించీ పోలీసు దురంతాలను గురించీ నిరసిస్తూ వ్యాసాలు వ్రాశాయి. కనికా వ్యవహారాన్ని గూర్చి హృదయ విదారకమైన ఉదంతాలతో, వార్తా పత్రికల పుటలు నిండిపోయాయి. గోపబంధు జైలుకి వెళ్ల బోతూ కూడా యీ అభాగ్య ప్రజావళిని మరచి పోలేదు. ఆయన సహచరుడు నిరంజన్ పట్నాయక్ దేశప్రజలనుద్దేశించి ఒక సందేశమివ్వ వలసిందిగా గోపబంధుని కోరగా, అప్పుడాయన యిలా అన్నాడు.

''కనికాలో పరిస్థితులను గూర్చి స్వచ్ఛందమూ, నిష్పాక్షికమూ అయిన

విచారణ జరగాలి. ఒరియా ప్రజల ప్రథమ కర్తవ్యం యిది. విచారణ అనగానే పాలకవర్గంలో బెదురు పుట్టుకొస్తోంది. నా ప్రజల్నీ బెంగాల్ బీహార్ ప్రజల్నీ ఉద్దేశించి ఈ విజ్ఞప్తి చేస్తున్నాను కనికా వ్యవహారాల్ని గురించి ఏ మాత్రమూ ఆలస్యంలేకుండా విచారణ జరిగేలా చూడండి. అక్కడి ప్రజలు భయగ్రస్తులై నిస్సహాయులై ఉన్నట్లు తోస్తుంది నాకు. విచారణ జరగకుండా ఉండాలనే ఉద్దేశంతోనే నన్ను నిర్బంధంలోకి తీసుకున్నారు. నిరంజన్ బాబూ! మిమ్మల్నీ, మీ ద్వారా ఒరిస్సా ప్రజాన్ని కాన్నీ అభ్యర్థిస్తున్నా – కనికాలో జరిగిన దుశ్చర్యలను బహిరంగ పరిచేందుకు విచారణకు పూనుకోండి. ఇది నా కోరిక.''

గోపబంధు మీద నమోదైన రెండు దావాలతోపాటు దివాన్ బహదూర్ శ్రీకృష్ణ మహాపాత్ర మరో దావా వేశాడు. ఆదావా కనికావ్యవహారాలను గురించి 'సమాజ్' పత్రికలో ప్రచురించబడిన వార్తలూ వ్యాఖ్యలూ, మానసష్టం కలిగించాయని. రాజాబహదూర్ దుశ్చర్యల్నీ, పోలీసుల అత్యాచారాల్నీ బహిరంగంగా చాటేందుకు కోర్టుని రంగస్థలంగా ఉపయోగించుకోవాలని గోపబంధు నిశ్చయించుకున్నాడు. పత్రికల్లో ప్రచురించబడిన వాటికంటె దావాలో రచ్చకీడ్వబడే సంగతులు మరీ సిగ్గుచేటుగా ఉంటాయని పోలీసులు గ్రహించగానే, దావాను అధికారవర్గం ఉపసంహరించుకొన్నది. కేవలం భయంతో చేసినపని అది. ఈ దావా విచారణ కోసమే కటక్ జైల్లో ఉండిన గోపబంధు, దావారద్దుకాగానే, హజారీ బాగ్ సెంట్రల్ జైలుకి 1923 జనవరి 24వ తేదీ బదిలీ అయ్యాడు. దావా ఉపసంహరణకు మేజిస్ట్రేట్ అనుమతించడం పట్ల ఆక్షేపణ తెలుపుతూ ఆయనా, డాక్టర్ అతుల్ బిహారీ ఆచార్య, శాంతి చరణ్ గారులు ఒక ప్రకటన చేశారు. ఈ యిద్దరు నాయకులూ ఆదావాలో నిందితులుగా చేర్చబడిన వారు.

జైల్లో ప్రయోజనాత్మక విషయాలకు గోపబంధు తన సమయాన్ని వినియోగించాడు. ఆయనతోబాటు భారతదేశంలో పేరెన్నికగన్న వ్యక్తులు కొందరు అక్కడ ఖైదీలుగా ఉండేవారు. వారిలో జగద్గురు శంకరాచార్య భారతీకృష్ణ తీర్థస్వామి ఆయనకు ఎక్కువ సహకరించారు. స్వామీజీ తోడ్పాటుతో సంస్కృత భాషలోని పవిత్ర గ్రంథాలను అధ్యయనం చెయ్యడం, చర్చించడం సాగించాడు గోపబంధు. వాటిలో ముఖ్యమైనవి 'మహాభారతము', 'శ్రీమద్భాగవతము'. గ్రంథరచనకూడా చేశాడయన. భారతదేశ చరిత్రలో కానవచ్చే వైచిత్రి ఏమిటంటే, బారతీయ సాహిత్యంలో పెన్నిదుల వంటి గ్రంథాలు జైల్లో వ్రాయబడటం. జైలు బయట ఎప్పుడూ పనిలో తలమున్కలయ్యే జవాహర్లాల్ నెహ్రూ తన ఉద్గ్రంథాలైన 'స్వీయచరిత్ర', 'ప్రపంచ చరిత్ర దృశ్యాలు', 'భారతదర్శనం', 'జైల్లోనే

వ్రాయగలిగారు. అలాగే గోపబంధు నిత్యజీవితంలో కార్యవ్యగ్రుడై ఉండేవాడు. జైల్లో కొంతకాలం గడపటం ఆయనకు అధ్యయనానికీ, రచనకీ, వినియోగించింది. ఆయన సాహిత్య రచనల్లో బందీర్ ఆత్మకథ (బంధితుని ఆత్మకథ), 'ధర్మపాద' (ధర్మ పాదుడనే బాల శిల్పి కోణార్క దేవాలయంలో ఆత్మత్యాగం చేసినగాథ), 'గోమాహాత్మ్య' (పశుసంపద ఉపయోగం), 'నాచికేత ఉపాఖ్యాన' (నాచికేతుని కథ), 'కారాకబిత' (కారాగార కవిత) అనే గ్రంథాలు హజారీబాగ్ జైల్లో వ్రాసినవే. ఇతర ఖైదీలనూ, వార్డర్లు మొదలైన జైలు ఉద్యోగులనూ గోపబంధు నిర్లక్ష్యం చెయ్యలేదు. జైల్లో ఆయన జీవితం వాళ్లందరి మీదా గట్టి ముద్ర వేసింది. ఆయన ప్రభావం వాళ్ల నడవడిని సంస్కరించింది. ఆయన ఎప్పుడూ ధ్యానం చేస్తూ ఉండేవాడు. ప్రతి బుధవారం మౌన వ్రతం పాటించేవాడు. మహాత్మునికి ప్రతి సోమవారం మౌనదినం. ఆయన ఆనియమం జీవితాంతమూ పాటించారు. అలాగే గోపబంధు ప్రతి బుధవారం జైలునుంచీ విడుదలయ్యాక కూడా, మౌన దినంగా పాటిస్తూ వచ్చాడు. ఆ రోజు రచనలోనూ ద్యానంలోనూ గడిపే వాడాయన.

1924 జూన్ 26తేదీ హజారీబాగ్ జైలునుంచీ ఆయన విడుదలయ్యారు.

ఆయన విడుదలయ్యేటప్పటికి ఒరిస్సా రాష్ట్రరాజకీయ సభ కటక్‌లో జరుగబోతున్నది. వంగ దేశపు విఖ్యాత శాస్త్రజ్ఞుడూ దేశభక్తుడూ అయిన ప్రఫుల్ల చంద్రరాయ్ అధ్యక్షుడు. గోపబంధు ఆ సభకు రావడం అక్కడ సమావేశమైన వారందరిలో ఆనంద తరంగాలను రేకెత్తించింది. గోపబంధు మహత్తర కార్యాలను గుర్తెరిగి, ఆయన పట్ల ప్రజలకున్న ప్రేమాభిమానాలను గమనించిన ఆచార్య ప్రఫుల్ల చంద్ర ఆయన్ని 'ఉత్కళమణి' గా అక్కడ అభివర్ణించారు. ఆ బిరుదమే ఆయనకు అప్పట్నుంచీ స్థిరపడింది.

## సత్యవాది పాఠశాల మూసివేత

సాక్షి గోపాల్ నికుంజ పాఠశాలను ప్రారంభించడంలో గోపబంధు ఉద్దేశం దాన్ని ఒక విద్యాసంస్థగా కాక ఒక నూత్న విద్యావిధాన ప్రయోగంగా రూపొందించడమే నని యిదివరకే చెప్పబడింది. అందచేత ఆ ఆదర్శాన్ని వదలుకోవడానికి, కారణాలేవైనా సరే, ఆయనకు యిష్టంలేదు. ప్రభుత్వమిచ్చే గ్రాంటుల్ని కూడా ఆయన వద్దనుకున్నాడు. కారణం అందుమూలంగా ప్రభుత్వ నిబంధనల వల్ల ఏర్పడే పెత్తనం ఒక అవరోధం కావడమే. ఇక్కడా అక్కడా సమకూర్చిన స్వల్ప చందాలతోనే ఆయన నిర్వహణ సాగించాడు. 1918నాటికి పాఠశాల ఉచ్ఛస్థితిని చేరుకొన్నది. ఆయన రాజకీయ కార్యకలాపాల్లో నిమగ్నుడు కావడంతో, పాఠశాల

స్థాపించడంలో గోపబంధు ఆదర్శమెంత పరిపుష్టమైనదో 1918నాటి సత్యవాది పాఠశాలా నివేదకను పరిశీలిస్తే విదితమవుతుంది. అందులో 'భవితవ్యం' అనే అధ్యాయంలో ఆయన యిలా అన్నాడు.

''ఇతర పాఠశాలలు స్థాపించబడని పరిస్థితుల్లో, పూర్వ మెప్పుడో వ్యవస్థాపకులు నిర్ణయించిన ఒకానొక 'పరిమిత వాతారణంలోనే పాఠశాలను ఎప్పటికీ బంధించి ఉంచడం మా లక్ష్యమూ కాదు, ఆ ఉద్దేశమూ లేదు. సత్యవాది పాఠశాలను స్థాపించిన మొదట్లో దాని ఆదర్శం – ధనికులకూ పేదలకూ విద్యా ప్రదానం సమంగా జరగాలన్నది. ఇప్పుడీ పాఠశాల విశ్వవిద్యాలయానికి అనుబంధ సంస్థ అయింది. నేడు ప్రణాళికా బద్ధమైన సమగ్ర విద్యాకృషికీ, ఉద్యమానికీ నిర్వాహకులు తమ కాలాన్నీ శక్తినీ పూర్తిగా వినియోగించవలసి ఉన్నది. ఇప్పటికి కూడా ఈ పాఠశాలలో పూరించదగిన లోపాలూ, తీర్చవలసిన అవసరాలూ ఎన్నో ఉన్నాయి. కానీ నిర్వాహకులీ ఒక్క పాఠశాలనే అంటిపెట్టుకుంటే, ఒరిస్సాలో విద్యావ్యాప్తికి సంబంధించిన ఉద్యమం కుంటు వడతుతుంది. ఈ పాఠశాల వరవడిలో బహుళ సంఖ్యలో పాఠశాలలు ఎన్నో ఒరిస్సాలో అభివృద్ధి చెందవలసి ఉంది. అటువంటి పాఠశాలల్ని ఒకటి తర్వాత మరొకటిగా స్థాపించలేక పోతే, ఈ ఒక్కపాఠశాల మాత్రం ఉండి ప్రయోజనమేమిటి? అందుచేత ధైర్యవంతులూ, త్యాగనిరతులూ అయిన వారు, నీలకంఠ, గోదావరీశ్, కృపాసింధులన పోలిన వ్యక్తులు ముందుకు వచ్చి, ఉపాధ్యాయ వృత్తిని తమ జీవిత ధ్యేయంగా స్వీకరించి, ఈ మహోద్యమంలో పాల్గొంటారనే ఆశిస్తున్నాను. ఈ సత్యవాది పాఠశాల నుంచీ మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థులైన విద్యార్థులు కటక్ కాలేజిలో ఐ.ఏ., బి.ఏ., పరీక్షల నిచ్చిన తర్వాత కొత్తపాఠశాలల్లో ఉపాధ్యాయులుగా పని చేయాలి. తమకు చదువు చెప్పిన వారి సేవానిరతీ, త్యాగబుద్ధీ, మార్గ దర్శకం కాగా యువజనులు తమ కాలేజి విద్య ముగించుకొని, ఉద్యమంలో చేరి, విద్యావ్యాప్తికి దోహదం చేసినట్లయితే, గోపబంధుకుగాని, ఆయన సహచరులకు గాని, యిటువంటి పాఠశాలల్ని బహళ సంఖ్యలో నెలకొల్పి, వాటిని పైకి తీసుకురావడం సాధ్యమవుతుంది.''

ప్రోత్సాహం కలిగించే ఈ పలుకులు పాఠశాల వ్యవస్థాపకులకు చాలాతృప్తి కలిగించి ఉండాలి. గోపబంధు దృష్టిలో మాత్రం చక్కనిదైన ఆసంస్థ ఒక మామూలు పాఠశాల కాదు, అది దేశపురోభివృద్ధి అనే చరమ లక్ష్యానికి ఒక ఉపకరణం మాత్రమే. న్యాయవాదిగా తన వృత్తికి దెబ్బ తగిలినా, విద్యావిషయిక కార్యకలాపాల్లో గోపబంధు మునిగిపోయాడు. అటుపై దేశ విముక్తికై సర్వశక్తుల్నీ సమీకరించవలసి వచ్చినప్పుడు, ఆపిలుపు నందుకొన్న గోపబంధు సాక్షి గోపాల్

పాఠశాలను కేవలం ఒక మామూలు విద్యాసంస్థగానే వదలి పెట్టదలచుకోలేదు. 1921 జనవరి 22 తేదీన, అనగా సంస్థ ప్రారంభింపబడిన పండ్రెండు సంవత్సరాలకు, గోపబంధు ఆయన సహచరులూ, సత్యవాది పాఠశాలను జాతీయ పాఠశాలగా మార్చారు. గుజరాత్ విద్యాపీఠం, కాశీ విద్యాపీఠం కూడా ఆ సమయంలోనే జాతీయ సంస్థలుగా నెలకొల్పబడిన వన్న సంగతి గుర్తించాలి. ఆ సంస్థలు యిప్పటికీ బాగా నడుస్తున్నవి. కాని సత్యవాది పాఠశాల, గోపబంధు జీవిత కృషి ఫలమైన సంస్థ, జాతీయ విద్యాపీఠంగా మార్పుజెందినప్పటికీ, క్రమంగా మూత వడింది. గోపబంధులో నియంత మనస్తత్వంలేదు. ఆయన పూర్తిగా ప్రజాస్వామ్యవాది. పాఠశాలను మార్చడానికి ముందు ఉపాధ్యాయులు, విద్యార్థులు, తల్లిదండ్రులు – అందరి అభిప్రాయమూ సేకరించాడు. వాళ్లందరూ ఆయన్ని సమర్థించారు. నిజానికి ఆ సంస్థలో అప్పటికి అమలులో ఉన్న బోధనా విధానాన్ని మౌలికంగా మార్చే అవసరం కూడా ఏమీలేదు. కారణం అప్పటికే జాతీయ విద్యా ప్రణాళిక మీద, ఆయన తయారు చేసిన పథకం ప్రకారమే అది నడుస్తున్నది. వృత్తి సంబంధమైన శిక్షణ, కదురుమీద నూలు వడకుట, మగ్గం మీద నేత నేయుట వంటివి, విద్యా ప్రణాళికలో అప్పటికే చేర్చబడి ఉన్నవి. 'బేసిక్' విద్యావిధానాన్ని గూర్చి ఎవరూ తలపెట్టక పూర్వమే గోపబంధు దాన్ని ఆచరణలో పెట్టి ఉన్నాడు. ఇది ఆయన దూర దృష్టికి తార్కాణంగా మనం గుర్తించాలి. స్వచ్ఛంద జాతీయ విద్యావిధానాన్ని ఉచితంగా వ్యాపింపజేయ వలసిందని మహాత్ముడిచ్చిన సందేశం ప్రకారం, గోపబంధు విద్యార్థుల నుంచి వసూలు చేసే బడిజీతం రద్దు చేశాడు. 'ఉత్కళ స్వరాజ్య శిక్ష్యా పరిషద్' అనే వ్యవస్థకూడా ఆయన ఏర్పాటు చేసినదే. రాష్ట్రంలో వివిధ ప్రదేశాల్లో నెలకొల్పడిన జాతీయ విద్యా సంస్థలను క్రమపద్ధతిలో నడిపిస్తూ పర్యవేక్షించడం దానిపని. 1921లో సత్యవాది పాఠశాల జాతీయ పాఠశాలగా మారింది. శ్రీ నందకిశోర్ దాస్ ఉపాధ్యాయుడుగా సంస్థలో చేరాడు. ఆయనే తర్వాత ఒరిస్సా శాసనభకు స్పీకర్ అయ్యాడు.

పాఠశాల జాతీయ విద్యా పీఠంగా మారడం నిజమేగాని, విద్యార్థుల్లోనూ, వారి తల్లిదండ్రుల్లోనూ, ఆమార్పు ఉత్సాహాన్ని కలిగించలేదు తర్వాతి కాలంలో క్రమంగా విద్యార్థులు అక్కడినుంచి వెళ్లిపోయారు. పాఠశాల మూసివేయవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆ సమయంలో ప్రసిద్ధమైన ఆ సంస్థను నిలబెట్టడానికి ప్రయత్నిస్తూ ఉపాధ్యాయులు దాన్ని మళ్లీ విశ్వవిద్యాలయానికి అనుబంధం చేయాలని అన్నారు. గోపబంధు అంగీకరించలేదు.

బీహార్–ఒరిస్సా రాష్ట్ర విద్యాశాఖలో సంస్కృత భాషాధ్యయన విభాగానికి

అసిస్టెంట్ సూపరింటెండెంట్‌గా పనిచేస్తూ ఉండిన పండిత్ లింగరాజ్ మిశ్రా ఆ ప్రభుత్వోద్యోగానికి రాజీనామా యిచ్చి కొత్త సత్యవాది పాఠశాలలో చేరాడు. ఆయనే తర్వాత ఒరిస్సాలో విద్యాశాఖ మంత్రిగానూ, లోక్‌సభ సభ్యుడుగానూ పదవులు నిర్వహించాడు పండిత్ లింగరాజ్ విషయం పరిశీలిస్తే, గోపబంధు ఆదర్శవాదం ఎలా వాస్తవికతతో కూడుకున్నదో మనం గుర్తించవచ్చు. విశ్వవిద్యాసమితి సంస్థ నుంచి ఉదార ధన సహాయాన్ని చదువుకోసం పొందాడు లింగరాజ్. అందువల్ల సత్యవాది పాఠశాలలో ఉపాధ్యాయుడూగా పని చెయ్యవలసిన నైతిక బాధ్యత అతని పై నున్నది. కాని పేదవాడవటం వల్ల, అలా ఉపాధ్యాయుడుగా చేరితే, అతని తల్లిదండ్రుల కష్టాలు తీర్చే పరిస్థితి ఉండదు. చదువు పూర్తి చేసుకుని, పాఠశాలలో ఉద్యోగంలో చేరడానికి తన దగ్గరకు వచ్చిన లింగరాజ్‌కు గోపబంధు సలహాయిచ్చాడు. మొదట ప్రభుత్వోద్యోగంలో చేరి తల్లిదండ్రుల ఋణం తీర్చివేసి, తర్వాత లింగరాజ్ పాఠశాలలో విధి నిర్వహణకు సిద్ధం కావచ్చునని చెప్పాడు. తన నైతిక బాధ్యతను అతి కఠినంగా వ్యాఖ్యానించుకొని, తన కుటుంబం వారికి కష్టం కలిగించవలసిన పని లేదని చెప్పాడు. మరో విధంగా చెప్పాలంటే, లింగరాజ్ కుటుంబ పరిస్థితుల్ని గుర్తించిన గోపబంధు అతనికి నైతిక విధికంటె, తల్లి దండ్రుల పట్ల విధి నిర్వహణ ప్రథమ కర్తవ్యంగా బోధించినట్లు అర్థ మవుతున్నది. లింగరాజ్ మనస్సు తాను ప్రేమించిన సత్యవాది పాఠశాల వైపు మొగ్గు చూపడంతో, కొన్ని సంవత్సరాల ప్రభుత్వోద్యోగం తర్వాత ఆయన దానికి రాజీనామా యిచ్చి ఉపాధ్యాయుడుగా చేరిపోయాడు.

1925లో పాఠశాల ఆర్థికంగా చాల గడ్డు పరిస్థితిలో ఉండటం గమనించి, పండిత్ లింగరాజ్ గోబపంధుని పూరీలో కలుసుకుని పాఠశాలను జాతీయ సంస్థగా నడపడం వల్ల ప్రయోజనం ఉండదనే సంశయాన్ని వెలిబుచ్చాడు. ఏ ఆదర్శంతో పాఠశాల జాతీయ సంస్థగా మార్చబడిందో ఆ లక్ష్యం సిద్ధించేలా కనబడలేదు. త్యాగంతో, కృషితో ఎంతో కాలంగా నిర్మించబడిన చక్కని సంస్థ అంతరిస్తోంది. అందువల్ల సంస్థ కొనసాగేందుకు దాన్ని విశ్వవిద్యాలయానికి అనుబంధం చెయ్యక తప్పదని ఆయన తన అభిప్రాయాన్ని తెలియజేశారు. ఇతరులు కూడా అలానే పాఠశాల దుఃస్థితిని గూర్చి విభ్రాంతులై తనతో చెప్పారనీ, విషయం తనకు తెలుసుననీ, గోపబంధు అన్నాడు. కానీ పరిస్థితులలా ఉండగా కొత్త హైస్కూలుని నడపటం మాత్రం సాధ్యమవుతుందా? అని ఆయన లింగరాజ్‌ని ప్రశ్నించాడు. పాఠశాల ప్రారంభించిన మొదట్లో దాన్ని హైస్కూలు చెయ్యడం ఉద్దేశం కాదు. పెద్ద ఎత్తున విద్యావ్యాప్తి కోసరం నడిపే సమగ్రమైన ఉద్యమంలో ఒక భాగంగా అది ప్రారంభమైంది. సత్యవాదిలోనూ యితర చోట్లా

పాఠశాలలు నెలకొల్పడంలో ఉద్దేశం ఒరియా భాషను సంరక్షించి, ఒరియా సాహిత్యాన్ని అభివృద్ధి పరచి, తద్వారా నిరుపేదలూ, నిరక్షరాస్యులూ అయిన జనసామాన్యాన్ని ఒక ఉన్నత సామాజిక జీవన స్థాయికి ఉద్ధరించి, దేశ స్వాతంత్ర్యాన్నీ, సంఘసంస్కరణల్నీ సాధించే చైతన్యాన్ని, దేశాభిమానాన్ని ప్రజల్లో పాదుకొల్పడమే. స్వాతంత్ర్య సమరంలో సంభవించిన కొన్ని అత్యయిక పరిస్థితుల మూలంగా ఈ పాఠశాలలు క్రమంగా మూతపడుతున్నవి. క్లిష్ట పరిస్థితులు ఎదురైై యుద్ధ భూమిలో పోరాడుతున్న సైన్యానికి కొన్ని చోట్ల పరాజయం కలిగినప్పుడు, అటువంటి పరాజయాల్ని అది లెక్క చెయ్యకుండా ముందుకు సాగిపోవడానికే చూస్తుంది. అలాగే గడ్డు పరిస్థితులు ఎదురవుతున్నప్పుడు, విద్యావ్యాప్తి కై మంచి అవకాశం కోసరం వేచి ఉండి, ఒరిస్సాలోనూ ఒరియా మాట్లాడే తదితర ప్రాంతాల్లోనూ ఒరియాబాషాభివృ ద్ధికీ, ప్రజల్లో జాతీయ విద్యా కాంక్షను పెంపొందించేందుకూ, కృషి కొనసాగించవలసి ఉంటుంది... కాని ఆ రోజుల్లోనే గోపబంధు ఒకసారి ఆచార్య హరిహరదాస్‌తో నిరుత్సాహంగా యిలా అన్నాడట. (ఈ సంగతి 1931లో శ్రీరాధానాథ్‌రథ్ తెలియజేశాడు.) ''పాఠశాలలో పనిచేసేందుకు మనుష్యులు లేకపోతే ఈ పాఠశాలపట్ల అచంచలమైన శ్రద్ధ ఉండిమాత్రం మనం ఏమిచెయ్యాలి? ఈపాఠశాల ఎవరికోసరం స్థాపింప బడిందో వాళ్లందరూ రాష్ట్రం నలుమూలలా మరణిస్తున్నారు. కొందరు పస్తులుండి ఆకలితో చచ్చిపోతున్నారు. అలాంటి స్థితిలో ఈ పాఠశాల ఎవరికోసం? విద్య నాగరికత, వీటిని నిర్మించే వాళ్లెవరున్నారు?'' బాజ్‌పూర్, కేంద్రపారా వరదల సంక్షోభాన్ని గూర్చి తలచుకుంటూ, గోపబంధు ఒరిస్సాకు సంభవించిన విపత్తునూహించి నిలువు నీరయ్యాడు. ''ఎడతెగని, ఎప్పటికీ అంతం అంటూ లేని ఈ వరదల్లో, క్షామాల్లో మనం కృశించి పోతున్నాము. విద్యార్థులూ, ఉపాధ్యాయులూ, అసంఖ్యాకంగా మరెందరో, సంక్షేమ సేవా కార్యక్రమాల్లో, రక్షణ కృషిలో మునిగి ఉన్నారు కాని అంతా వ్యర్థంగానూ, శుష్కప్రయాసగానూ తోస్తుంది. ఇదంతా సముద్రంలో నీటిబిందువుకు సమానం.''

ఇది ఆదృశ్యానికి ఒకవైపు మాత్రమే.

ఆయన అలా అనడం నిరుత్సాహంతో, వినమ్రతతో, ఫలించని ఉదాత్తాశయాల మహత్తర భారంతో సంస్థ నిర్వహణ ఖర్చు ఎక్కువగా ఉండటంతో దానికి తగిన వనరులు అవసరమయ్యాయి. విశ్వవిద్యాలయానికి దాన్ని మళ్ళీ అనుబంధం చెయ్యడానికి వీల్లేక పోవడంతో, విద్యార్థులు పాఠశాల వదలి వెళ్లిపోయారు. 1926లో పాఠశాల పనిచెయ్యడం ఆగిపోయింది.

గోపబంధు సహచరుల్లో కొందరు ఆయున్ని వదలి పెట్టారు. గోపబంధు చలించలేదు. పాఠశాలను సంస్కృతీ కేంద్రంగా పునరుద్ధరించాడాయన. సాంప్రదాయిక హైందవ సంస్కృతికి సంబంధించిన శిక్షణ గరపే సంస్థగా, ప్రాచీన గురుకుల పద్ధతిలో రూపొందించాడు. ఈ స్థితిని గూర్చి వ్రాస్తూ, సి.ఎఫ్. ఆండ్రూస్ 1926 ఆగస్టు 7 తేదీ గోపబంధుకు వ్రాసిన లేఖలో యిలా సాంత్వనం పలికాడు. ''సత్యవాది పాఠశాల మూసివెయ్యవలసి వచ్చినందుకు మీరెంత మనోవ్యధకు గురి అవుతున్నారో నేనెరుగుదును. ఆ సంస్థ కోసరం మీజీవితంలో అధికభాగం అంకితం చేశారు. కాని ప్రభుత్వ సహాయం పొందే సంస్థగా అది మారడం మీకు దుస్సహం. ప్రభుత్వ సహాయంతో నడవడంకంటె, దాన్ని మూసి వెయ్యడమే మీకు తక్కువ బాధాకరమని నాకు తెలుసు. అన్ని జాతీయ విద్యాసంస్థల పరిస్థితీ యీ నాడు యిలానే ఉన్నది. శాంతినికేతన్, గుజరాత్ విద్యాపీఠం తప్ప. ఆరెండు సంస్థలూ నిలిచి ఉన్నాయంటే, వాటి వెనుక యిద్దరు మహనీయులు ఉండడమే అందుకు కారణం.''

ఉజ్జ్వలమైన సంప్రదాయాలను నిర్మించి, దేశమంతటా పేరు గాంచిన సత్యవాది పాఠశాల అలా మూతపడిపోవడం, అదీగాక జాతి స్వాతంత్ర్య యుద్ధంలో పాల్గొనడమే హేతువుగా ఆ సంస్థ అంతరించడం, అది ఒరిస్సా చరిత్రలోనే ఒక విషాదాంతము. అది ఒరిస్సాయిచ్చిన గొప్ప బలిదానం. దేశంలో దానికి తగినంత గుర్తింపు రాలేదనే చెప్పాలి. సంస్థను కొనసాగించవలె ననే ఉద్దేశంతో గోపబంధు, ఒరిస్సాలోనూ యితరత్రా ధనంకోసం అర్థించాడు. ఆయన చేసిన ఆ ప్రయత్నాలను గిట్టని వారు తీవ్రంగా విమర్శించారు. ఆయన మీద అపవాదాల దువారం లేపారు. ఆయున సహచరులే కొందరీ పనికి పూనుకున్నారు. ఏమైనప్పటికీ, పాఠశాల కొనసాగి ఉంటే అది ఒరిస్సా చరిత్రలో దివ్యంగా ప్రకాశించి ఉండేది. ప్రాచీన, ఆధునిక పద్ధతులు రెండింటి ద్వారానూ తేజో విజ్ఞానాలను ప్రస్తారం చేసే సంస్థగా అది రాణించి ఉండేది. పాఠశాల ప్రశస్తి, దాని పరిస్థితులు, మహాత్మాగాంధి దృష్టి నాకర్షించాయి. 1921 ఏప్రిల్ 13వ తేదీ 'యంగ్ ఇండియా' పత్రికలో ఆయన యిలా వ్రాశారు.

''ఒరిస్సాలో కార్యకర్తలున్నారు. పండిత్ గోపబంధు దాస్ శాసనమండలి మాజీ సభ్యుడు, మాజీ న్యాయవాది, యింకా ఎన్నో పదవుల నలంకరించిన వ్యక్తి ఆయన. నిస్స్వార్థ నాయకుడు. ఆయనా, ఆయన అనుచరులూ, అన్నమూ పప్పు మాత్రమే తిని బ్రతుకుతున్నారని తెలుస్తున్నది. నెయ్యి లేదు వాళ్ల భోజనంలో, సహాయనిరాకరణోద్యమం తర్వాత కార్యకర్తలు కనీసభృతి మీదే బ్రతుకున్నారు. అది పదిరూపాయలకు మించదు కూడ.

''అటువంటి శ్రద్ధాళువులైన వ్యక్తులుండటం వల్లనే స్వరాజ్యం యీ ఏడాదిలో లభించడం సాధ్యమేనని నేను విశ్వసించడం విడ్డూరం కాదు. పండిత్ గోపబంధు పూరీ కివతల వంద్రెండు మైళ్లలో సాక్షి గోపాల్ అనేచోట ఒక ఆరుబయలు పాఠశాలను నడుపుతున్నాడు. అది నికుంజ పాఠశాల. దర్శింపదగిన సంస్థ. అక్కడ విద్యార్థులతో, ఉపాధ్యాయులతో నేనొక రోజు ఆనందంగా గడిపాను. ఆరుబయట విద్యాబోధన అనే ప్రయోగం జరుగుతున్న దక్కడ. విద్యార్థుల్లో కొందరు మంచి క్రీడాకారులూ, బలశాలురూ ఉన్నారు.''

మధుసూదనదాస్ ఆ విద్యార్థులనే అగ్నిశిఖలుగా పేర్కొన్నారంటే ఆశ్చర్యం లేదు. సర్ ఎడ్వర్డ్ గెయిట్ అన్నారు. ''సత్యవాది పాఠశాల బాలురు పేలడానికి సిద్ధంగా ఉన్న బాంబులు.''

# 14

# పూరీజిల్లాలో బాధితులకు సహాయం

గోపబంధు జీవితంలోనే కష్టాలకు అనివార్యమైన స్థానం ఉన్నది. అయినప్పటికీ యితరుల కష్టాలు ఆయన్ని కదిలించేవి. ఆయన పూరీలో స్థిరనివాసం ఏర్పరచుకొన్న తర్వాత, బీహార్-ఒరిస్సా గవర్నరు. 1926 ఏప్రిల్ 22 తేదీ పూరీ వచ్చాడు. ఆ సందర్భంగా ఏమర్ మఠాధిపతి మహంతు మహారాజ్ ఒక ఉద్యాన వనంలో గవర్నరు గౌరవార్థం ఒక గొప్ప విందు ఏర్పాటు చేశాడు. ఆ విందు ఖర్చు వెయ్యిరూపాయలని అంచనా. కేవలం గౌరవార్థం చేసే లాంఛనం ఖర్చు అంత పెద్ద ఎత్తున ఉండటం పూరీ ప్రజలకు నచ్చలేదు. ఆ మొత్తాన్ని, క్షామం వల్ల వరదల వల్ల బాధితులైన ప్రజల సహాయం నిమిత్తం ఉపయోగిస్తే బాగుంటుందని వాళ్ల అభిప్రాయపడ్డారు. ఆ సాయంకాలమే సింహద్వారం దగ్గర ఒక అక్షేపణ సభ ఏర్పాటైంది. దాని మూలంగా శాంతి భద్రతలకు భంగం వాటిల్లుతుందని ఆదుర్దాపడి డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్ 144-సెక్షను క్రింద గోపబంధు నోరు విప్పకూడదనే ఉత్తర్వు జారీ చేశాడు. ఆయన సభలో మాట్లాడటం నిషేధింపబడింది. ఆ చిన్న విషయం మీద పట్టింపు అనవసరమనే ధోరణిలో ఉత్తర్వుని ఉల్లంఘించలేదు గోపబంధు. స్థానిక అధికారులు ఆయన ఉదార బుద్ధిని తప్పుగా అర్థం చేసుకుని, ఆయనేదో విదేశీ యుడైన ప్రభుత్వ ప్రతినిధిని అవమానించ దలచినట్లు భావించారు. వాళ్ళు అలా చెయ్యడం తెలివి తక్కువ తనం తప్పమరేమీకాదు.

## 1924 నాటి వరదు

1924లో వరదువల్ల క్షామం ఏర్పడింది. గాంధీ ఆ సమయంలో ఒరిస్సా దర్శించారు. ఆగస్టు 22 తేదీ ఆయన కటక్ వచ్చారు. గోపబంధు బాధితుల సహాయార్థం చేస్తున్న కృషి చూసి ఆమోదించారు. గోపబంధుతో కలిసి పల్లెలు తిరిగారు. ఆయన పర్యటన ఫలితంగా 'యంగ్ ఇండియా' 1924 నవంబరు 20 తేదీ సంచికలో యిలా వ్రాశారు.

''నేను ఒరిస్సా వెళ్ళినప్పుడు ఆ రాష్ట్రంలో బాధితులైన ప్రజల్ని చూసే

అవకాశం లభించింది. ఒక పరిశ్రమల శిక్షణా కేంద్రం తాలూకు అధికారిని కలుసుకోవడం తటస్థించింది. అక్కడ శిక్షణ పొందుతున్నవారు బలంగా, ఆరోగ్యంగా, ఉత్సాహంగా ఉన్నారు. వాళ్లు ప్రేముతో బుట్టలు అల్లుతూ ఉన్నారు. నేను సంతోషించి ఆ అధికారికి ధన్యవాదాలు తెలిపాను. కాని నూలు వడికేందుకు ఏర్పాటు లేక పోవడం నన్ను చకితుణ్ణి చేసింది. నూలు వడకటం ప్రజల దృష్టిని ఎక్కువగా ఆకర్షించిన పరిశ్రమ కదా! అక్కడ శిక్షణ పొందుతున్న వాళ్లైతే ఆరోగ్యంగానూ, ఉత్సాహంగానూ కనిపించారుగాని, క్షామ బాధితులైన ప్రజలెలా ఉన్నారో తెలుసా? వాళ్ళు కేవలం అస్థి పంజరాలు! చావుకోసరమే ఎదురు చూస్తూ కూర్చున్న వారి వలె కనిపించారు. వాళ్లంత దీనస్థితిలో ఉండటానికి కారణం వాళ్ళు చేతి పనులు చెయ్యడానికి ఆసక్తులు కాకపోవడమే. వాళ్లెంత సోమరులంటే, చేతి పనులు చెయ్యక పోతే మిమ్మల్ని కాల్చి చంపేస్తాము అని బెదిరిస్తే, వాళ్లు అలా చావడానికైనా సిద్ధమేకాని, చేతి పనులు మాత్రం చెయ్యరు. అలాంటి వాళ్ల చేత ఎలా పనులు చేయించేది? వాళ్లని నూలు వడకమని చెప్పడం కంటె మరో మార్గం లేదు.''

డిసెంబరు 26 తేదీ 'యంగ్ ఇండియా' పత్రికలో సి.ఎఫ్. ఆండ్రూస్, ఒరిస్సాలో తన అనుభవాల్ని గూర్చి, ''ఒరిస్సాదీనాలాపం'' అన్న శీర్షికతో యిలా వ్రాశాడు.

''చాలాకాలంగా ఒరిస్సా పేద ప్రజల దుఃస్థితి ఒక పీడకలవలె నామనస్సునీ హృదయాన్నీ వేదిస్తున్నది. భారతదేశ ప్రజలందరిలో పేదవారు ఒరిస్సా ప్రజలనే సత్యాన్ని నేను సాక్ష్యాదారాల ద్వారా గ్రహించాను. ఒక విషయం నన్ను నిరంతరమూ బాధిస్తున్నది. అదేమంటే, నిజంగా క్షామం ఏర్పడినప్పుడు ప్రభుత్వపు తాబేదార్లు నిజాన్ని కప్పిపుచ్చేందుకు ప్రయత్నించడం, పరిస్థితుల యాథార్థ్యాన్ని పరిశీలించడానికి కార్యాంతరాల వల్ల నేను అక్కడికి వెళ్లలేకపోవడం. నానిస్సహాయస్థితి నన్ను కలవర పెట్టింది.

''చైనా, మలయా, బర్మా, పర్యటించి తిరిగివచ్చిన తర్వాత నన్ను చూడటానికి వచ్చిన వారిలో గోపబంధు దాస్ ఉన్నారు. ఆయన అప్పుడే జ్వరంతో బాధపడి కోలుకుంటున్నారు. అస్వస్థత మూలంగానూ, జైల్లో చాలకాలం ఉండి నందువల్లనూ, ఆయన చిక్కిపోయి ఉన్నారు. ఒరిస్సాలో వరపు పరిస్థితుల్ని ఆయన వర్ణించి కళ్లనీళ్లు పెట్టుకున్నారు. ప్రజలు నిస్సహాయులై ఉన్నారనీ పశువుల్నీ పంటపొలాల మీద వదిలేశారనీ, పంటలు చేతికి వచ్చే అవకాశం లేదనీ ఆయన చెప్పారు. అనుకోకుండా వర్షమేమైనా పడితే , పంటలు కొంతవరకు దక్కుతాయన్నారు. ప్రధానమైన పంట, వరి, నాశనమై పోయిందనీ, అది చేతికి

వచ్చే అవకాశం లేదనీ చెప్పారు. క్షామ ప్రాంతాలన్నీ తిరిగి వచ్చారాయన. ఆయన్ని విశ్రాంతి తీసుకొమ్మనీ, పూర్తిగా ఆరోగ్యం పొందమనీ చెబితే, అలా వీల్లేదన్నారాయన. కర్తవ్యం మళ్లీ ప్రజల దగ్గరకు వెళ్లడమేనన్నారు. క్షామ ప్రాంతాల్లో ప్రజలు కష్టాల్లో ఉన్నారనీ అక్కడికి వెళ్ళి తీరాలనీ అన్నారు. సత్యావాదిలో ఆయన ఆశ్రమ వాసులు గడ్డు పరిస్థితిలో ఉన్నారనీ, అక్కడి విద్యార్థులు, ఉపాధ్యాయులు తనకోసం ఎదురు చూస్తారనీ చెప్పారు. ఆయన తిరిగి వెళ్ళిపోయారు. తర్వాత నేను గాంధీ గారిని ఢిల్లీలో కలుసుకొని ఈ విషయమై దీర్ఘంగా చర్చించాను. ఒరిస్సా ప్రజలు తన మనస్సులో నిరంతరమూ మెదులుతూన్నట్లు చెప్పారాయన. ఒరిస్సాలోని అస్థి పంజరాలు ఆకలి భరించలేక, ఏ క్షణంలో మృత్యువు వాత పడతారో అది తన కళ్లకు కనిపిస్తూనే ఉన్నదరు. ప్రభుత్వం ఈ నిర్భాగ్య ప్రజల్ని హింసించడానికి మనస్సెలా వచ్చింది? నేనా సంగతి ఊహించ లేకుండా ఉన్నాను. ఈ విషయమై విచారణ జరిపి యధార్థ పరిస్థితి ఏమిటో కనుక్కోవాలి అన్నారాయన. భగవంతుని దయవల్ల వర్షం పడింది. పంటలు కొంత భాగం దక్కాయి. నేను ఢిల్లీ నుంచి తిరిగి వచ్చి మళ్ళీ గోపబంధుని కలుసుకున్నప్పుడు ఆయన ముఖంలో కొంత ఉత్సాహం కనిపించింది. కాని ప్రజల పరిస్థితులు కలిగిస్తున్న ఆందోళనతో మనోవ్యథతో ఆయన క్రమక్రమంగా కృశిస్తున్నట్లు నేను స్పష్టంగా గమనించాను.''

## 1925 నాటి వరదలు

ప్రకృతి పోకడలు అనూహ్యంగా ఉంటాయి. పూరీజిల్లాలో విపరీతం వరదలు వచ్చాయి. 1925 జూన్ నుంచి ఆగస్టు దాకా, యించుమించు మూడునెలలు పర్యంతం జిల్లాలో చాల భాగాలు వరద నీటిలో మునిగి అలానే ఉండి పోయాయి. వరద బాధితులైన ప్రజల దైన్యస్థితి, వారి కష్టాలు వర్ణింపరానివి. వాళ్లకు సాయం చెయ్యడానికి గోపబంధు, ఆచార్య హరిహరదాస్‌తో, యితర స్వచ్ఛంద సేవకులతో కలిసి ఏర్పాట్లు చేస్తూనే ఉన్నాడు. గ్రామాలు నీటిలో మునిగి ఉండడం చేత, ఒక గ్రామంనుంచి మరో గ్రామానికి వెళ్లడమే అసాధ్యంగా ఉంది. పొలంలో పంట లేదు. ఇళ్లో తిండి లేదు. గ్రాసం లేక వేలాది పశువులు చచ్చిపోయాయి. ఆకులలములు తిని ప్రాణాలు నిలుపుకోవాలని ప్రజలు చూశారు కాని అవీ లభ్యం కావడంలేదు. ఆ పరిస్థితిలో సేవాదళం వారు సమకూర్చగలిగిన కొన్ని శేర్ల బియ్యంతో ప్రజలకు ఎటువంటి ఆధారం లభించగలదు? దుఃఖోపశమనానికీ, గుండె ధైర్యం కలిగించడానికీ మాత్రమే దాని ఉపయోగం.

గోపబంధు పల్లె పల్లెకూ తిరిగాడు. అక్కడి దారుణదృశ్యాలు ఆయన్ని స్తబ్ధుణ్ణి చేశాయి. పూరీలో బహిరంగ సభలో గ్రామీణ ప్రజల దుఃస్థితి వర్ణిస్తూ ఆయన చేసిన ప్రసంగం, శాసన మండలి సభ్యుల్లో సానుభూతి రేకెత్తించింది. ఆ సభలో తాను గ్రామాల్లో చూసిన విషయాలు చెబుతూ గోపబంధు భోరున ఏడ్చేశాడు. సహాయ కార్యక్రమాలు చేపట్టవలసిందని అర్థించాడు. మఠాలనుద్దేశించి, ఆకలితో అలమటిస్తున్న ప్రజలకు అన్నదానం చేసే బాధ్యత వహించవలసిందని విజ్ఞప్తి చేశాడు. ఆయన అభ్యర్థన ఫలితంగా ఏమార్ మఠం రెండువేల రూపాయల్ని విరాళం యిచ్చింది.

అటుపైన, పూరీ వరద సహాయ సంఘం ఆయన ఆధ్వర్యాన సమావేశమై, స్వచ్ఛందమైనవీ, ధనవ్యయంతో ఏర్పాటు చేసేవీ అయిన సహాయ కార్యక్రమాల్ని ఏర్పాటు చెయ్యడానికి పూనుకొన్నది. నూలు వడకుట, బట్టలు నేయుట వంటి పరిశ్రమల కేంద్రాల్ని వరదకు గురి అయిన గ్రామాల్లో ఏర్పాటు చేసే బాధ్యత గోపబంధుకి అప్పగించబడింది. ఈ పరిశ్రమలకు ఎక్కడైనా 'ఆచారం' అడ్డువచ్చి అభ్యంతరం ఏర్పడితే, ఇతర పరిశ్రమలూ, తగిన కార్యక్రమాలూ చేపట్టిన తర్వాత గోపబంధు, బెంగాల్ ఖాదీ ప్రతిష్ఠాన్ వారితో సంప్రదించి, నూలు, నేత కేంద్రాలు ఏర్పాటు చేసేందుకు వారి సాయం అర్థించాడు. ఈ ఏర్పాట్లు ఎలాంటివంటే - చరఖామీద తీసిన నూలు ఆ కేంద్రాల నుంచీ నేత కేంద్రాలకు పంపబడి, అక్కడ రకరకాల బట్టల తయారీకి ఉపయోగింపబడుతుంది. అలా చేత్తో తయారైన బట్టల అమ్మకం నుంచి లభించే ధనం సరికొత్త కేంద్రాలు అటువంటివే ఏర్పాటు చెయ్యడానికి వినియోగింపబడుతుంది. గోపబంధు పూరీ చర ఖాసంస్థను అలా చక్కని పునాదుల మీద నిర్మించాడు ఆసమయంలోనే, అది శాశ్వత సంస్థగా చాలా విజయవంతంగా అప్పటి నుంచి నడుస్తూనే ఉంది.

## 1925లో ఒరిస్సాకు ఆండ్రూస్ రాక

ఆండ్రూస్ ఒరిస్సాలోని పరిస్థితుల్ని గూర్చి వ్రాసిన మాటలుగా యిదివరకు ఉదాహరింపబడినవి, ఆయన 1924లో ఏర్పడిన వరపును గురించి వ్రాసినవి. 1925లో సంభవించిన వరదల తాలూకు నష్టం అంతకంటె గొప్పది కావడంతో, దానికి కావలసిన సహాయం ఒరిస్సాయే భరించడం, ఒరిస్సా తలకు మించిన పనిగా పరిణమించింది. గోపబంధు సాహాయ్యార్థం మహాత్మాగాంధీకి అభ్యర్థన పంపాడు. ఆయన పరిస్థితిని ప్రత్యక్షంగా పరిశీలించేందుకు సి.ఎఫ్. ఆండ్రూస్‌ను నియమించగా, ఆండ్రూస్ ఒరిస్సా వచ్చాడు. అక్టోబర్ 4 తేదీ ఆయన పూరీ

చేరాడు. రైల్వేస్టేషన్ దగ్గర పెద్ద జనసమూహం, గోపబంధు, వనమాలీ దాస్, జగబంధు సింగ్, రాధా నాథ్‌రథ్‌ల నాయకత్వంలో ఆయనకు స్వాగతం యిచ్చారు. వర్షం కుండపోతగా కురుస్తున్నప్పటికీ గోపబంధు వెంటరాగా ఆండ్రూస్ పూరీలో వరద ప్రాంతాలని దర్శించాడు. భార్గవీ తీరాన చందన్‌పూర్, సామగర్ తీరాన హరికృష్ణపూర్ గ్రామాలున్నాయి అందులో. వాళ్ల కొన్ని యిళ్లలో ప్రవేశించి చూశారు. ఆ కుటుంబాలకు చెప్పదగ్గ వస్తువులంటూ ఏమీలేవు! కళ్లల్లో నీళ్ల నిండగా ఆండ్రూస్ అన్నాడు. ''ఇంతటి నిప్పచ్చరం నేనెక్కడా ఎప్పుడూ చూడలేదు!'' సాయం అందుతుందన్న ఆశతో తనచుట్టూ మూగిన ప్రజల్ని చూశాడాయన. నిస్తేజమై చిక్కిన వాళ్ల ముఖాల్ని పరికించి, ఆయన దుఃఖంతో అన్నాడు. 'ఈబక్క చిక్కిన స్త్రీ పురుషుల ముఖంతీరూ, ముక్కుపరిమాణం పరిశీలిస్తే వీళ్ల పూర్వులు విద్యలో, నాగరికతలో ధైర్యసాహసాల్లో అత్యున్నత స్థాయికి చేరుకున్నారనీ, వీళ్లని పేదరికమే యిలా కుంగదీసిందనీ తెలుస్తోంది. వరదలూ క్షామాలూ వీరిని శిథిలం చేశాయి. ఇది తీరని నష్టం'' ఆండ్రూస్, సాదర్, బ్రహ్మగిరి, సత్యవాది ప్రాంతాలకు చెందిన చాలాగ్రామాల్ని దర్శించాడు. చందన పూర్ దగ్గర ఒక గ్రామానికి వెళుతున్న ఆండ్రూస్‌కి ప్రమాదం వెంట్రుక వాసిలో తప్పిపోయింది. ఆయన ప్రయాణం చేస్తున్న పడవ కొంతలో తల్లక్రిందులయి ఉండేది. అదేకాక, ఒకసారి వెదురు పొదల్లో వెడుతూ ఆయన క్రిందపడిపోవడంతో దేహానికి గాయాలయ్యాయి. పూరీకి తరిగి రావడం సాధ్యంకాక, ఆండ్రూస్, ఆయనతో వెళ్లిన వారూ, వసుదేవపూర్ గ్రామంలో ఒక పశువుల కొట్టంలో రాత్రిగడపారు. వారి కారాత్రి చిన్న రొట్టెముక్కా, అరటి పళ్లూ శరణ్యం అయ్యాయి. దారుణమైన అనుభవాలు ఆండ్రూస్‌ని కదల్చివేశాయి. వాతావరణం ఎంత భీభత్సంగా ఉన్నా, వ్యక్తిగతంగా ఎన్ని యిబ్బందులు ఎదురైనా, ఆయన వరద తాకిన గ్రామాల్లో తన పర్యటన కొనసాగించాడు. అక్టోబర్ 8తేదీ ఆయన బృందం సత్యవాది పాఠశాల చేరుకున్నారు. ఆ రోజు అక్కడ బసచేసి, ఆండ్రూస్ మహాత్మాగాంధీకి తదితరులకు లేఖలు పంపాడు. అందులో తాను చూసిన దంతా కళ్లకు కట్టేలా వర్ణించాడు. ఆ రాత్రి గోపబంధు దగ్గర సెలవు తీసుకుని వెళ్లిపోతూ ఆయన గోపబంధుని గట్టిగా కౌగలించుకొని అన్నాడు. ''కష్టాల్లో ఉన్న ప్రజలకు భగవంతుడు మేలు చేస్తాడు. మిమ్మల్ని భగవంతుడు ఆశీర్వదించుగాక!''

# 15

# శాసన మండలి ప్రవేశ కార్యక్రమం

1919 నాటి ఇండియా ప్రభుత్వ చట్టం క్రింద 1923లో నిర్వహింపబడిన ద్వితీయ సార్వత్రిక ఎన్నికల్లో కాంగ్రెస్‌కు చెందిన స్వరాజ్ పార్టీవారు దేశబంధు చిత్తరంజన్ దాస్, పండిత్ మోతీలాల్ గార్ల నాయకత్వంలో, అప్పటికే పాల్గొని ఉండినారు. తృతీయ సార్వత్రిక ఎన్నికలు 1926లో జరుగవలసి ఉండినది. ఒరిస్సాలో కొందరు కాంగ్రెస్‌కమిటీ సమావేశమై ఒరిస్సాలో కాంగ్రెస్‌వారు శాసన మండలి ప్రవేశ కార్యక్రమాన్ని ఆమోదించాలా, వద్దా, అనే నిర్ణయం చేయవలసి ఉండినది. గోపబంధు, స్వయంగా అందుకు వ్యతిరేకిస్తూన్నప్పటికీ, అధిక సంఖ్యాకుల అభిప్రాయం భిన్నంగా ఉండటం చేత, ప్రజాస్వామ్యవాదిగా, ఆయన అందుకు ఒడంబడి, కాంగ్రెస్ అభ్యర్థులను ఎంపిక చేశాడు. సార్వత్రిక ఎన్నికల తాలూకు కార్యభారాన్ని వహించవలసిందిగా రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ గోపబంధుని కోరింది. అంతేకాకుండా శాసనమండలిలో సభ్యుల ప్రవర్తనాది కాలను పర్యవేక్షించే బాధ్యత కూడా ఆయనకే అప్పగించింది. గోపబంధు వ్యక్తిగతంగా ఆ కార్యక్రమానికి విముఖుడై ఉండినందుచేత, మొదట్లో పర్యవేక్షణా బాధ్యతను స్వీకరించడానికి నిరాకరించాడు. కాని సభ్యుల అభ్యర్థనలు కారణంగా చివరకు ఆ బాధ్యతను స్వీకరించవలసి రావడంతో, గోపబంధు కొన్ని షరతులు రూపొందించాడు. అవి : 1. రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ తాలూకు ఎన్నికల సబ్ కమిటీ ఒకటి ఏర్పాటై ఎన్నికలబాధ్యత చూడాలి. 2. ఆసబ్- కమిటీయే ఎన్నికైన ప్రతినిధుల పనిని పర్యవేక్షించాలి. 3. రాష్ట్ర మండలికి ఎన్ని కైన ప్రతి సభ్యుడూ నెలకు పదిరూపాయల వంతునా, కేంద్రశాసన సభకు ఎన్నికైన ప్రతి సభ్యుడూ నెలకు ఇరవై రూపాయల వంతునా, రాష్ట్రకాంగ్రెస్ కమిటీకి చెల్లించాలి. 4. ప్రతి ప్రతినిధీ శాసన సభలోపలా బయటా తాను నిర్వహించిన కార్యక్రమాన్ని గూర్చి మూడునెలల కొకసారి నివేదికను సమర్పించాలి. 5. ప్రతి ప్రతినిధీ తన నియోజకవర్గంలో ఓటర్ల సంఘాన్ని ఏర్పాటు చేసి ప్రజాభిప్రాయాన్ని సేకరించి, సంఘటిత పరిచే బాధ్యత వహించాలి.

పైనిబంధనలన్నీ మండలికి శాసన సభకూ అభ్యర్థులుగా ఎంపిక చేయబడిన

వారందరికీ తెలియచెయ్యబడి, వారి ఆమోదాన్ని పొందిన తర్వాత కాంగ్రెస్ సంస్థ శాసనసభా ప్రవేశం చేసింది.

ఎన్నికలు జరుగుతూ ఉండగా గోపబంధు తన నిర్మాణ కార్యక్రమాన్ని వదలిపెట్టలేదు. గంజాంలో పట్టునేత బాగా స్థిరపడి అభివృద్ధిలో ఉన్న పరిశ్రమ. దేశంలో దానికి మంచి మార్కెట్ కూడా ఉండేది. బరంపురం నేతగాండ్రు చేతిమగ్గాలపైన దాన్ని తయారు చేసేవారు. ఇతరచోట్ల నూలుతీయడమూ, నేతా, ఎక్కువగా వ్యాప్తిలో లేకపోయినప్పటికీ, గంజాం పట్టునేతగాండ్రువారి సంప్రదాయ వృత్తిని వదలి పెట్టలేదు. ఆ పరిశ్రమను పునర్వ్యవస్థీకరించి, అభివృద్ధి చేసే ఉద్దేశంతో గోపబంధు, ఎన్నికలు ఒకవైపు జరుగుతూండగానే, గంజాం దర్శించడానికి వెళ్లాడు.

## 1926 నాటి వరదలు

ఎన్నికలు పూర్తి అయ్యాయో లేదో, వరదల భీభత్సం కటక్, పూరీ, బాలసూర్ జిల్లాల్లో చాల ప్రాంతాల్లో విలయతాండవం చేసింది. 1926 ఆగస్టులో సంభవించిన ఈ వరదలు పూర్వమెన్నడూ కనీవినీ ఎరుగనంత నష్టాన్ని కలిగించాయి. లేఖలూ, టెలిగ్రాములూ, ఈ వరద ప్రాంతాల నుంచీ కుప్పలు తెప్పలుగా రావడం ప్రారంభించాయి. కాని ప్రజల దురదృష్టం, గోపబంధు వ్యాధి గ్రస్తుడయ్యాడు. ఆయన వెంటనే వరద సోకిన గ్రామాలకు బయలు దేరి వెళ్లలేకపోయాడు. ప్రథమ చర్యగా ఆయన వివిధ ప్రాంతాలకు పూరీనుంచి స్వచ్ఛంద సేవా బృందాలను పంపించాడు. విశ్వసనీయమైన సమాచారాన్ని సేకరించేందుకు, కటక్, బాలసూర్ ప్రాంతాలలో వరద పరిస్థితుల్ని తెలుసుకునేందుకు, ఆయన కటక్‌లో భాగీరథీ మహాపాత్రకూ, బాలసూర్‌లో హరికృష్ణ మెహతాబ్‌కూ టెలిగ్రాము లిచ్చాడు. పూరీ జిల్లాలో తక్షణ సహాయం అందించేందుకు చరఖా కేంద్రాలను వివిధ ప్రదేశాల్లో ఏర్పాటుచేస్తూ, ఉచిత సాహాయ్యానికి కూడా వీలు కల్పించాడు.

మహాత్మాగాంధీ, సి.ఎఫ్. ఆండ్రూస్, ఏ.వి. ఠక్కర్ గార్లకు గోపబంధు వార్తలు పంపాడు. ఒరిస్సాలోనూ, యితరచోట్లా, వార్తా పత్రికల ద్వారా వరదలు కలగించిన నష్టాన్ని గూర్చి తెలిసేలా ఏర్పాట్లు చేశాడు. ధనం ధారాపాతంగా వచ్చింది. అనారోగ్యంతో బాధపడుతూ కూడా గోపబంధు చాల ప్రదేశాలకు వెళ్లి సాహాయ్యం అందజేశాడు. అటువంటి సందర్భాల్లో కారుణ్య మూర్తిగా గోపబంధు మహనీయత ఉజ్జ్వలంగా ప్రకాశించింది.

# 16

# లజ్‌పత్‌రాయ్‌తో గోపబంధు

'పంజాబ్‌కేసరి' అని పేరుగాంచిన లాలాలజ్‌పత్‌రాయ్‌ని గోపబంధు ప్రథమ పర్యాయం కలకత్తాలో 1920 సెప్టెంబర్‌లో జరిగిన కాంగ్రెస్ ప్రత్యేక సమావేశంలో కలుసుకొన్నాడు. ఆయన వ్యక్తిత్వం గోపబంధుని ఆకర్షించింది. ఏప్రిల్‌లో లాలాలజ్‌పత్‌రాయ్ పూరీ వచ్చి అక్కడ మూడు రోజులున్నాడు. పూరీలో లాలాజీ 'వ్యథిత భారతం' అనే గ్రంథరచనలో నిమగ్నుడై ఉండినాడు. బీహార్‌కు చెందిన జగత్‌నారాయణ్‌లాల్ ఆయనకు వ్రాయసగాడు. దేశంలో హిందూ మహాసభను ఏర్పాటుచేసే ప్రయత్నంలో ఉన్నాడు లాలాజీ ఆసమయంలో హిందూ సంఘటన్‌ని బలపరిచే నిమిత్తం దేశంలో వివిధ ప్రాంతాల్లో ఏజెంట్లను నియమించే ఆదుర్దాలో ఉన్నాడాయన.

1925 ఏప్రిల్ 19తేదీ పూరీలో లాలాజీ ఒక బహిరంగసభలో ప్రసంగించాడు. తాను కాంగ్రెస్ సభ్యుడై ఉంటూ, ప్రజా సేవక సమాజ్ అధ్యక్షుడై ఉంటూ, హిందూ మహాసభ నిర్మాణం ఎందుకు తలపెట్టవలసి వచ్చిందో ఆయన వివరించాడు. కాంగ్రెస్‌లో సభ్యులుగా కొనసాగుతూనే, హిందువుల్ని సంఘటిత పరచడం ద్వారా స్వరాజ్ భూమికను సుప్రతిష్ఠితం చేయవలసిందిగా ఆయన గోపబంధుకూ ఆయన సహచరులకూ సలహాయిచ్చాడు. లాలాజీ ప్రేరణవల్ల ఒరిస్సాలో ఒక హిందూ మహాసభ ఏర్పాటైంది. దాని అధ్యక్షుడు ధనపతి బెనర్జీ. కార్యదర్శి పండిట్ నీలకంఠదాస్.

ఈ సందర్భంగా లాలాజీ గోపబంధుల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. 1926 జనవరి 28 తేదీన వ్రాసిన లేఖలో లాలాజీ యిలా అన్నాడు.

''ప్రియమైన గోపబంధూ,

ఇకనుంచి మిమ్మల్ని గోపబంధు అని పిలవడానికి స్వతంత్రిస్తున్నాను. మీ లేఖ చేరి సంగతులు తెలిశాయి. హిందూ మహాసభకు సంబంధించిన కార్యభారం యావత్తూ ఆ రాష్ట్రంలో మీకు అప్పగించాలని ఉందినాకు. ఈ విషయమై మీకు త్వరలోనే ఒక అధికారికమైన లేఖ పంపుతాను. పనుల తొందరవల్ల ఈ సమయంలో మీకు యింతకంటె ఎక్కువగా వ్రాయలేక పోతున్నాను.

కొద్దిరోజుల్లోనే మళ్లీ వ్రాస్తాను.''

1926 ఫిబ్రవరిలో గోపబంధు లాలాలజ్‌పత్‌రాయ్‌ని మళ్లీ కలుసుకున్నాడు. అప్పుడు రాయ్, గోపబంధు ప్రజాసేవక సమాజ్ సభ్యత్వాన్ని తీసుకున్నట్లయితే యాభైఏళ్లుగా చేస్తూ వచ్చిన సేవనే ఆయన కొనసాగించవచ్చుననీ, సభ్యుడుగా ఆయన సేవలు అమూల్యమైనవిగా ఉంటాయనీ చెప్పాడు. అంతేకాకుండా సువ్యవస్థితంకాని ఆయన వైయక్తిక కృషి కంటె, సమాజ్ సభ్యుడైతే అది ఒక గట్టి ఆధారంతో రూపుదిద్దుకొంటుందనీ చెప్పాడు. ఆయన స్వేచ్ఛకూ, అభిమతానికీ ఎటువంటి అవరోధమూ జోక్యమూ ఉండబోదన్నాడు. లాలాజీ యిలా తనని అభ్యర్థించడం గోపబంధు మనస్సుమీద గట్టి ముద్రవేసింది. కొన్నాళ్ళు ఆలోచించుకొన్న తర్వాత సమాజ సభ్యుడు కావడానికి అంగీకరించాడు గోపబంధు. సువ్యవస్థితమైన కృషిలో అపార విశ్వాసంకల వాడు గోపబంధు. ఆయన తన జీవిత కాలమంతా బృందాలనూ, సంస్థలనూ ఏర్పాటు చేసి తన కార్యక్రమాలను కొనసాగించిన వాడే. ఒకసారి రైటానరబుల్ (శ్రీ) వి.ఎస్. శ్రీనివాస శాస్త్రితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, సత్యవాది పాఠశాలను పూనా సర్వెంట్స్ అఫ్ ఇండియా, సొసైటీకి అనుబంధ సంస్థ చెయ్యాలని ఉద్దేశించాడు కూడా. అందుచేత లాలాజీ కోరగానే అది దైవం నిర్ణయించిన అవకాశంగా భావించి లాహోరు ప్రజాసేవక సమాజ్‌లో సభ్యత్వాన్ని పొందాడు.

గోపబంధు సమాజ్ సభ్యుడైన పిమ్మట, లాలాజీ ఢిల్లీ, రైజీనా నుంచి ఒకలేఖ వ్రాశాడు.

''ప్రియమైన గోపబంధు బాబూ,

... హిందూ మహాసభ కార్యవర్గం వారు హిందూ సంఘటన్ కార్యభారమంతా మీకు అప్పగించడానికి నిర్ణయించారు... ఒరిస్సా సహాయనిధి విషయం అతా మీకే వదలి పెట్టాలని నా అభిమతం. నా దగ్గర సిద్ధంగా ఉన్న సొమ్ము పదివేల రూపాయలపైచిలుకు. కచ్చితంగా ఎంత ఉన్నదో చెప్పలేకున్నాను. ఆ సొమ్ము మీ రెప్పుడు కావాలన్నా మీ ఆధీనంలో ఉంటుంది. మీరు పంపిన 'అభ్యర్థన' ట్రిబ్యూన్ పత్రికకు ప్రకటన నిమిత్తం పంపుతున్నాను. దాని విషయమై 'పీపుల్' పత్రికలో కూడా ఒక విజ్ఞప్తి వ్రాస్తాను.''

గోపబంధు సమాజ్ సభ్యుడైన తర్వాత ఆయన ఒరిస్సాలో జీవకారుణ్యంతో చేస్తూ ఉండిన కార్యకలాపాలకు మంచి మద్దతు లభించిందని దీనివల్ల మనకు తెలుస్తూ ఉన్నది. సమాజ్ ఆయనకు కొండంత బలాన్ని సమకూర్చింది.

సభ్యత్వం స్వీకరించగానే ఆయన కటక్‌లో ఒక శాఖను నెలకొల్పి, దాని కార్యాలయం కోసం ఒక యిల్లు అద్దెకు తీసుకున్నాడు. అందులో ఒక

గ్రంథాలయం ప్రారంభించాడు. 'సమాజ్' అంతవరకు స్వతంత్ర పత్రికగానే ఉంటూ వచ్చింది. దాన్ని యిప్పుడు తను సభ్యుడైన సమాజ్ వాణిగా పరిగణించాడు. అంతే కాకుండా సమాజ్ తోడ్పాటుతో ఒరిస్సా సహాయనిధిని ప్రారంభించాడు. కటక్, పూరీ జిల్లాల్లో వరద సోకిన ప్రాంతాల్లో నాలుగు వడ్లుదంచే కేంద్రాలను నెలకొల్పాడు. సమాజ్ కార్యకర్తలు బలహీన వర్గాల అభ్యున్నతికి కృషి ప్రారంభించారు. (ఈ వర్గాలనే మహాత్మాజీ తర్వాత 'హరిజనులు'గా నామకరణం చేశారు.) కలకత్తాలో ఒరియా కార్మికుల్ని సంఘటిత పరచే కార్యక్రమాలూ, కాలస్వభాన్ని అధిగమించినట్టివీ, ఒక వ్యక్తి శక్తియుక్తులకు మించినట్టివీ, కావడంతో ఆయన తన సహచరుడు పండిత్ లింగరాజ్ మిశ్రాను సమాజ్‌లో ఒరిస్సా ప్రతినిధియైన రెండవ సభ్యునిగా చేర్చాడు. సమాజ్‌లో గోపబంధు ప్రతిష్ఠ అత్యున్నత స్థాయి నందుకొన్నది. 1928 ఏప్రిల్‌లో అనగా తనమరణానికి రెండునెలల ముందు, ఆయన సమాజ్ ఉపాధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ఒక అఖిల భారత సంస్థలో అదివరకెన్నడూ ఒరియా మాట్లాడే వ్యక్తి అంతటి ఉన్నత పదవి పొంది ఉండలేదు.

ఆయన అక్కడ పొందిన గౌరవ మర్యాదలూ, గోపబంధు లాలాజీలు సమాజ్‌లో సహవ్రతులు కావడం, వారి మధ్య పరస్పర గౌరవాభిమానాలకు దోహదం చేశాయి. తాను జీవించిన చివరి సంవత్సరంలో గోపబంధు లాలాజీకి వ్రాసిన లేఖల ద్వారా ఈ సంగతి మనకు స్పష్ట మవుతున్నది. 1927 డిసెంబరు 23 తారీఖున గోపబంధు వ్రాసిన లేఖ యిలా ఉన్నది.

''మా అన్నగారు మరణించినప్పుడు మీరు పంపిన సంతాప సందేశానికి ధన్యవాదాలు. నా కార్యకలాపాలను గూర్చిన వివరణాత్మక చరిత్ర వార్తా పత్రికల్లో ప్రచురించవలెనంటున్నారు మీరు. కాని అటువంటి ప్రాచుర్యాన్ని కోరడం నా ప్రకృతికి విరుద్ధం. దేశంలో పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోవాలనే కోరిక సుతరామూ లేదు నాకు. చేతనైన పని నిర్వహిస్తూ, చెయ్యగలిగినపని చెయ్యడానికి ఎప్పుడూ సిద్ధమే. దాన్ని గూర్చి ప్రజలకు తెలియపోతే వచ్చిన నష్టమేమీలేదు. జీవిత పర్యంతమూ ప్రజా సేవకుణ్ణని భావిస్తూ, భగవంతుని మార్గదర్శకత్వంలో నాకు తోచిన సేవ నేను చేశాను. నేను సమాజ్‌లో చేరానంటే, దానికి కారణం మీ సహకారంతో భగవంతుణ్ణీ మనుష్యుల్నీ యితోధికంగా సేవించేందుకు వీలవుతుందన్న విశ్వాసమే. ప్రజాసేవకుడు తన కాలాన్నీ, ఆలోచననూ, అధికారాన్నీ ఆస్తినీ, మేధా సామర్థ్యాలనూ ప్రజలకు చెందినవిగా భావించాలి. ప్రజాహిత కార్యం చెయ్యకుండా నిర్లక్ష్యం చెయ్యడమంటే అదినా దృష్టిలో దొంగతనం వంటిది. ఇటీవలి వరదను గురించి మీరు వినే ఉంటారు. వరద

విచారణా సంఘాన్ని ఏర్పాటు చేశాము. దానికి సంబంధించిన పత్రాలను సిద్ధం చెయ్యడంలోనూ, వివిధ ప్రాంతాల వాళ్లతో సంప్రదించడంలోనూ కార్యవ్యగ్రుణ్ణయి ఉన్నాను.''

తనమరణానికి ఒకనెల ముందు మరోలేఖలో గోపబంధు లాలాజీకి యిలా వ్రాశాడు.

''మీరు దక్షిణ భారత పర్యటన ముగించుకొని లాహోర్ తిరిగి వచ్చారని భావిస్తాను. మూడు వారాలుగా, జలుబు, జ్వరంతో నేను మంచందిగలేదు. లాహోర్ నుంచి తిరిగివస్తూ రైల్లోనే జబ్బు పడ్డాను. జబల్‌పూర్ నుంచి మీకు టెలిగ్రామ్ పంపాను. అది అందిందో లేదో తెలియదు. నా ఆరోగ్యమూ, ఉత్సాహమూ పూర్వంవలె లేవు. తరుచు జ్వరం వస్తూవుంది. రొమ్ములో, వీపులో నొప్పికూడా వస్తోంది. పూర్తి విశ్రాంతి అవసరమన్నాడు డాక్టరు. కాని అదెలా సాధ్యంనాకు? నాకెన్నో వ్యధలున్నాయి. జబ్బు పడ్డప్పటినుంచీ యిక్కడే ఉండవలసి వచ్చింది. ఎక్కడికీ వెళ్లలేక పోయాను. కాని చేతిలో ఉన్నపనిని ఎలా మరిచి పోగలను? త్వరలోనే సైమన్ కమీషన్ యిక్కడికి రాబోతున్నది. చాలా చోట్ల తిరిగి ప్రచారం చెయ్యవలసి ఉంది నేను. రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడుగా అది నా బాధ్యత. కాని తిరిగే శక్తి లేదు. ఆ బాధ్యత నిర్వహించలేనని చెప్పాలని పిస్తూ ఉంటుంది ఒక్కోసారి. ఇటీవలి వరదల్లో దెబ్బతిన్న యిళ్లను పునర్నిర్మించే కార్యక్రమం సాగుతూ ఉన్నది. అది పూర్తయ్యాక లింగరాజ్ బాబుని కలకత్తా వెళ్లి ఒరియా కార్మికుల మధ్య కార్యక్రమం నిర్వహించమని చెబుతాను. కలకత్తానుంచి ఒరియా కార్మికులు చాలమంది వచ్చి నన్ను కలుసుకున్నారు. పేదవారూ, అణగద్రొక్కబడిన వారూ అయిన ప్రజలకు సేవ చేయడం మనధర్మం. దోపిడీకి గురవుతున్న యీ ప్రజలే జాతికి వెన్నెముక. మనం వాళ్ల సేవకు లైనప్పుడు, ఆ మరణాంతం వారికి సేవచేస్తూ ఉండటమే ధర్మం కదా?''

సమాజ్ వ్యవహారాలను గూర్చి లాలాజీ, పండిత్ గోపబంధుదాస్‌ల మధ్య తరుచు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. లాలాజీకి గోపబంధు వ్రాసిన చివరి ఉత్తరం, ఆయన మరణించేందుకు తొమ్మిది రోజుల పూర్వం వ్రాసింది

''మీ పుస్తకం 'వ్యథిత భారతం'లో ప్రచురించేందుకు నా ఫోటో కావాలని వ్రాశారుమీరు. మీ లేఖ చేరిందిగాని నా ఫొటో ఏదీ పంపించే స్థితి లేనందుకు విచారిస్తున్నాను. నా దగ్గర ఫోటోలేదు. కేలండర్ల మీద ముద్రించేందుకు నా ఫోటో కావాలని చాలమంది అడుగుతూ ఉంటారు. కాని నేనివ్వను. ఇవ్వలేను. మీ కోరిక మన్నించలేక పోయినందుకు నన్ను క్షమించండి.''

# 17

# మళ్లీ వరద సహాయం

1927 భారత దేశానికి గడ్డు సంవత్సరం. ఆ ఏడు తూర్పు పశ్చిమ ప్రాంతాలు రెండూ, ఎన్నడూ ఎరగని రీతిగా, వరదల వల్ల నష్టపోయాయి. 1927 జూలై 27 తారీఖున ప్రారంభమైన కుండపోత వర్షాలు. ఏకధారగా, క్షణం విరామం లేకుండా, మూడు రోజుల పాటు అంతటినీ జలమయం చేశాయి. దేశంలో యించుమించు అన్ని నదులకూ వరదలు వచ్చాయి. వల్లభాయి గుజరాతూ, గోపబంధు ఒరిస్సా అత్యధికంగా నష్టపోయిన ప్రాంతాలు. వర్షాలు ఎడతెరపి లేకుండా కురుస్తూ ఉండటం వల్ల ఏ ప్రాంతంనుంచీ కూడా వార్తలు అందే అవకాశం లేకపోయింది. ప్రళయం సమీపించిందన్న భ్రాంతి కలిగింది. 1927 జూలై 29 తారీఖున హౌరా నుంచి రావలసిన రైళ్లు పూరీ చేరలేదు. వైతరణీరోడ్- మంజూరీరోడ్ స్టేషన్ల మధ్య రైలుమార్గం కొట్టుకొని పోయినందు వల్ల రైళ్ల రాక పోకలు నిలిచి పోయాయని కటక్ స్టేషను నుంచి వార్త అందింది. ప్రభుత్వ అధికారులు ఆ ప్రదేశానికి వెళ్లి చూస్తే వాళ్లకు ఎటు చూసినా అంతా జలమయంగా తప్ప మరేమీ కనిపించలేదు. గోపబంధు అప్పుడు సత్యవాదిలో ఉన్నాడు. వైతరణి వరదల్ని గురించి ఆయనకు టెలిగ్రాము అందింది. గోపబంధు కదిలే స్థితిలో లేడు. ఆయన స్వచ్ఛంద సేవకుల బృందాన్నొకదాన్ని పండిత్ లింగరాజ్ మిశ్రా నాయకత్వాన వరద ప్రాంతాలకు పంపాడు. వాళ్లు అక్కడికి వెళ్లి చూసిన దంతా వెంటనే గోపబంధుకి తెలియజేశారు. పెద్ద పెద్ద గ్రామలే నీటిలో మునిగి పోవడమో, దెబ్బతిని పోవడమో జరిగింది. వందలాది మనుష్యులు, పశువులు, కొట్టుకు పోయారు. చెట్ల పై కొమ్మలమీదా, యింటి కప్పుల మీదా కొందరు ప్రాణాలు అరచేత బట్టుకొని అలాగే ఉన్నారు. మనిషీ, పామూ, సహజవైరాన్ని మరచి ఒక్కచోటే ఆశ్రయం పొందారు. ప్రజల సర్వస్వమూ గంగపాలై పోయింది. మధ్యతరగతి కుటుంబాలు కూడా తిండికి లేక పస్తులుండి పోయారు. జాజ్‌పూర్, భద్రక్ సబ్-డివిజన్లు ప్రత్యక్ష నరకాన్ని అనుభవించాయి. 1925, 1926 సంవత్సరాల్లో వచ్చిన వరదలు నష్టాన్ని కలిగించాయి. కాని 1927లో వచ్చిన వరదలు కలగించిన నష్టం ఎన్నడూ కనివినీ ఎరుగనంతగా దిగ్భ్రమ గొల్పింది. కనీసం పదికోట్ల రూపాయల నష్టం సంభవించి

ఉంటుందని ఒక అంచనా.

## కేంద్రశాసనసభ సందేశం

సరిగ్గా ఆ సమయంలోనే వైస్రాయ్ లార్డ్ ఇర్విన్ ఒరిస్సా సందర్శించే కార్యక్రమం ఉండినది. రైళ్ల రాకపోకలకు అంతరాయం కలగడం వల్ల, ఆయన వచ్చే ప్రత్యేక రైలు కూడా ఆగిపోయింది. ఆయన బీహార్-ఒరిస్సా గవర్నరుకు తనపర్యటన రద్దయినట్లు ఒక సందేశం పంపుతూ కష్టాల్లో ఉన్న ప్రజలకు సానుభూతి వ్యక్తం చేశాడు. ఒరిస్సాలో వరదలు కేంద్ర శాసన సభలోకూడా ప్రసక్తమయ్యాయి. శాసన సభ ఆమోదించిన తీర్మానం, ఒరిస్సా రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడైన పండిత్ గోపబంధు దాస్‌కు అధ్యక్షుని హోదాలో పంపబడింది. అందులో యిలా ఉంది ''ఈ శాసనసభ, గుజరాత్, ఒరిస్సా, సింధు రాష్ట్రాలలో సంభవించిన వరదల మూలంగా బాధితులైన ప్రజలకు సానుభూతి వ్యక్తం చేస్తూ అధ్యక్షుణ్ణి ప్రజలకు యీసందేశాన్ని అందజేయవలసిందిగాకోరుతున్నది. ప్రజలూ, సంస్థానాధీశులూ, ప్రజానీకమూ ఈ విపత్తు నెదుర్కొనేందుకు తమ శక్తి కొలది సాహాయ్యం అంద జేస్తారని ఈ సభ ఆశిస్తున్నది.'' గోపబంధు దీనికి సమాధానం యిలా వ్రాశాడు. ''కేంద్ర శాసన సభ వారి సానుభూతి తీర్మానానికి నా ధన్యవాదాలు. ఇది ప్రజలకు ఊరడి కలిగిస్తున్నది. వారి కృతజ్ఞతాభివందనాల్ని సభకు అందజెయ్యండి. వరదల వల్ల కలిగే నష్టాలకు శాశ్వత పరిష్కారాన్ని ఒరిస్సా కోరుతున్నది.''

## వరద సహాయం

1927 ఆగస్టు 12 తారీఖున కటక్ టౌను హాలులో, జనం క్రిక్కిరిసిన సమావేశం ఒకటి జరిగింది. పండిత్ గోపబంధు ప్రధాన కార్యదర్శిగా వరద సాహాయ్యం సంఘం ఏర్పాటు నిర్ణయింపబడింది. వార్తా పత్రికల్లో ప్రకటించిన విజ్ఞప్తుల ఫలితంగా, దేశంలో వివిధ ప్రాంతాలనుంచి ధనం ధారాపాతంగా వరద సాహాయ్యార్థం వచ్చింది. గోపబంధు సాటిలేని నేర్పుతో స్వచ్ఛంద సేవా బృందాలను ఏర్పాటు చేసి, వరద ప్రాంతాలకు సహాయం అందజేశాడు. స్వయంగా కాలి నడకను పల్లె పల్లెలకూ తిరిగాడు. బీహార్ - ఒరిస్సా శాసన మండలిలో ఒరిస్సా వరదల్ని గూర్చి చర్చలు జరిగాయి. అందుమూలంగా దేశమంతటి దృష్టి వరదల మీద కేంద్రీకృతం అయింది. మరికొంత ధనం లభించే అవకాశమూ ఏర్పడింది. మొదట కొన్ని రోజులు ఉచిత సహాయం, వస్త్రాలూ, దుప్పట్లు, దాతల నుంచి వచ్చినవి పంచి పెట్టారు. అవసరమైన వైద్య సహాయం కూడా వరద సోకిన

ప్రాంతాలకు అందజేశారు. ధాన్య కేంద్రాలను నెలకొల్పి, మద్దతు నిచ్చిన తక్కువ ధరలకు ఆహార పదార్థాలను సరఫరా చేశారు. వడ్లు దంచే కేంద్రాలను, సాహాయ్య కార్యక్రమాల్లో భాగంగా ఏర్పాటుచేశారు. వరదల్లో కూలిపోయిన యిండ్లు మళ్లీ కట్టుకోవడానికి ధన సాహాయ్యం కూడా అందజేశారు. కడగండ్లు పడే ప్రజలకు సేవ చెయ్యడంలో గోపబంధు అందెవేసిన చెయ్యి. 1927 నాటి వరదలు ఆయన ఈ ఉదాత్త వ్యక్తిత్వాన్ని గొప్పగా నిరూపించాయి.

చేపట్టిని కార్యక్రమాలన్నీ అప్పటి దుఃస్థితిని గడిచేందుకే ఏర్పాటైనవి. మరి వరదల వల్ల జరిగే హాని మళ్లీ మళ్లీ జరగకుండా నివారించేందుకు శాశ్వతమైన ప్రక్రియలు ఉండవద్దా? అఖిల ఒరిస్సా వరద నివారణ సంఘం కటక్‌లో సమావేశమైంది. తర్వాత ప్రతి జిల్లాలోనూ, ప్రతి ఠాణాలోనూ అటువంటి సమావేశాలు జరిగాయి. గోపబంధు యించుమించు ప్రతి సమావేశంలోనూ పాల్గొన్నాడు. వరద నివారణ చర్యలను గూర్చి చర్చలు జరుపుతూనే, వరదలు కలిగించే నష్టాన్ని గూర్చిన వివరాలూ, సమాచారమూ ఆయన సేకరించాడు., రాష్ట్రమంతటా వరదనివారణ సంఘాలు ఏర్పాటయ్యాయి. ఆయన ఆహ్వానం మీద భారతదేశంలోని ప్రముఖ నాయకులు ఒరిస్సా వచ్చి ప్రజల కడగండ్లను తిలకించారు. ఈ సంరంభమంతా బీహార్-ఒరిస్సా ప్రభుత్వాన్ని మేల్కొల్పింది. ప్రభుత్వం వరద నిపుణుల కమిటీ నొక దాన్ని నియమించి, వరద నివారణకు తీసుకోవలసిన శాశ్వత చర్యలను సూచించమని ఆదేశించింది. ఈ కమిటీ ఎదుటు గోపబంధు స్వయంగా తాను సేకరించిన సమాచారాన్ని యిచ్చాడు. ఒరిస్సా యథార్థస్థితి గతుల్ని గురించి ఆయనకు క్షుణ్ణంగా తెలుసు. ఆయన వివరించింది విని, ఆయన నిర్వహించిన కార్యకలాపాలు తెలుసుకొని, కమిటీ వారు చాల మెచ్చుకొన్నారు. గోపబంధు తన జీవితంలో మిగిలిన పది నెలల కాలాన్నీ ప్రత్యేకించి యీ కార్యానికే వినియోగించాడు. కమిటీ తన చివరి నివేదిక సమర్పించక పూర్వమే గోపబంధు మరణించాడు.

## అన్నగారి మృతి

హృదయావేదన కలిగించే కష్టాలతో సతమతమవుతూ ఉండగానే ఆయన్ని విధి మరో తీవ్ర ఆఘాతానికి గురి చేసింది. అన్నగారైన నారాయణ దాస్, గోపబంధు సంసార తాపత్రయాలన్నింటిని తనమీదనే వైచుకుని, ఆయన ప్రజాసేవ చేసేందుకు వీలు కల్పించినవ్యక్తి. ఆయన 1927 నవంబరు 22 తేదీన చనిపోయాడు. ఆయన మరణ వార్త గోపబంధుకి భరించరానిదైంది. ఆ

సమయంలో కుటుంబ సమస్యల్లో తలదూర్చడమంటే ఆయనకు దుస్సాధ్యంగా ఉంది. కటక్‌లో ఉంటూ తను చేస్తున్న ప్రజా సేవలోనే యిదివరకు మల్లే పూర్తి కాలాన్ని వినియోగించడం వీలుకాదని ఆయన గుర్తించాడు. తనకు ప్రియస్థావరమైన సాక్షి గోపాల్‌లో కొన్ని రోజులూ, స్వగ్రామంలో కొన్ని రోజులూ గడుపుతూ పైతృకమైన ఆస్తి తాలూకు వ్యవహారాలు ఆజమాయిషీ చేయవలెనని అనుకున్నాడు. అప్పటికి సత్యవాది పాఠశాల మామూలు విద్యాసంస్థగా పని చెయ్యడం ముగిసింది. ప్రజా సేవకు యువకుల్ని తయారు చేసే బ్రహ్మచర్యాశ్రమంగా అదిమారింది.

# 18

# ప్రజాసేవ చివరి ఘట్టం

విశ్వాసం లేని పై వేషాలు గోపబంధుకు నచ్చవు. ఆయన ఏ కార్యభారం వహించినా, దాన్ని దీక్షతో నిర్వహించాడు. ప్రజా సేవక సమాజ్ సభ్యత్వాన్ని స్వీకరించిన మరుక్షణమే ఆసంస్థను ప్రజల ఉపయోగార్థం వినియోగించడం ప్రారంభించాడాయన. ఆ కార్యక్రమంలో ప్రధానమైనది సంఘసంస్కరణ. పూరీకి చెందిన బ్రాహ్మణకుల స్థుడుగా ఆయనకు, చిన్న వయస్సులో భర్తలు మరణించి వితంతువులైన యువతులు సంఘంలో చాలమంది ఉన్నారన్న సంగతి తెలుసు. పునర్వివాహం వితంతువులకు నిషిద్ధం. వాళ్ళు వ్యర్థజీవులు. దేశానికీ నిర్భాగ్యురాండ్రొక శాపం. 'ఏమంటే, క్రూరమైన సామాజిక నిబంధనలకు కట్టుపడి వాళ్ళ జీవితాలు వెళ్లబుచ్చుకోవాలి. తల్లి దండ్రులమీదా, బంధువుల మీదా, వీరు పెద్ద భారంగా ఉండేవారు. పూరీ వితంతువులకు కేంద్ర స్థలంగా ఉండేది. భర్తలను కోల్పోయిన అభాగ్య స్త్రీలందరూ అన్ని ప్రాంతాల నుంచీ, దేశంలో యితర రాష్ట్రాల నుంచీ కూడా, యాత్రాస్థలమైన పూరీ చేరేవారు. కొందరు వితంతువులు ఒరిస్సాలోనూ, యితరచోట్లా నీతి బాహ్యమైన జీవనం గడిపేవారు. అది మనసామాజిక జీవితానికి మాయని మచ్చగా ఉండేది. గోపబంధు రెండు మార్గాలలో వీరిని ఉద్ధరించే ప్రయత్నం చేశాడు. విద్యావంతులైన యువకుల్ని, ఈ వితంతు స్త్రీలను పెళ్లాడమని ప్రోత్సాహించాడు. ఆవిధమైన ప్రయత్నాలు ఎక్కువగా సఫలీకృతం కాలేదు. అందువల్ల ఆయన ఆ స్త్రీలకు ఒకకొత్త జీవన మార్గం చూపే ప్రయత్నం చేశాడు. వారికోసం 'జగన్నాథ్ వితంతు ఆశ్రమం' అనేదాన్ని స్థాపించాడు. 1926లో పూరీలో అది ప్రారంబింపబడింది. ఈ ఆశ్రమంలో అభాగ్యవితంతువులు చేతి వృత్తుల్లో శిక్షణ పొందేవారు. అక్కడ వారి జీవన సరళిని క్రమబద్ధం చేసి, ఆయన వారిని దేశసేవా కార్యక్రమాల్లోకి స్వచ్ఛంద కార్యకర్తలుగా ప్రవేశ పెట్టారు. కులవర్గ వివక్షతలు లేకుండా వితంతువుల్ని ఆశ్రమంలో చేర్చుకునేవారు.

ప్రజా సేవక సమాజ్ లాహోరులో 1928 ఏప్రిల్‌లో వార్షిక సమావేశం జరుపుకొన్నది. పండిత్ గోపబంధు దాస్, పండిత్ లింగరాజ్ మిశ్రా 1928 ఏప్రిల్

12 తారీఖున ఒరిస్సా నుంచి లాహోరు బయల్దేరారు. వారు లాలాజీని ఢిల్లీలో కలుసుకున్నారు. అందరూ కలిసి 22 తారీఖున లాహోరు చేరారు. లాహోరు నుంచి తిరుగు ప్రయాణం బయలు దేరిన రోజున గోపబంధు కొంత అస్వస్థుడుగా ఉన్నాడు. ఆయన అస్వస్థత 29 తేదీ హౌరా చేరేప్పటికి ఎక్కువైంది. స్టేషన్ ప్లాట్‌ఫారం మీద ఆయనకు పండిత్ లింగరాజ్ మిశ్రా ప్రథమ చికిత్స చేశాడు. ఆయన్ని సాక్షి గోపాల్‌లో స్వగృహానికి తీసుకు వెళ్ల వలెనని లింగరాజ్ నిశ్చయించాడు. కాని కొంత స్పృహ రాగానే గోపబంధులింగరాజ్‌తో తనని బాల సూర్‌లో దించమనీ అక్కడ 1927 వందల్లో దెబ్బ తిన్న గృహాల పునర్నిర్మాణం ఎలాజరుగుతున్నదో చూడవలెననీ చెప్పాడు. ఆయనకు ప్రజా కార్యాలమీద అంతటి పట్టుదల. కాని ఆయన ఆరోగ్య పరిస్థితిని చూచి పండిత్ లింగరాజ్ అలా చెయ్యడానికి అంగీకరించలేదు. బలవంతాన ప్రయాణం కొనసాగించి 13వ తేదీ ప్రొద్దున ఆయన్ని సాక్షి గోపాల్ చేర్చాడు. అది టైఫాయిడ్ జ్వరం కావడంతో, జబ్బు తగ్గి కోలుకోవడానికి ఇరవై అయిదు రోజులు పట్టింది.

కలకత్తా కార్మికులు గోపబంధును అక్కడికి రమ్మన్నారు. ఆయన 1928 జూన్ 2వ తేదీ కలకత్తా బయలు దేరాడు. ఒరియా కార్మికులు పెద్ద సమూహంగా హౌరా స్టేషన్‌లో ఆయనకు రాజ స్వాగతం యిచ్చారు. బారాబజారు లోని ఒరియా కార్మికులు తామొక కార్మిక సంఘాన్ని ఏర్పాటుచేశామనీ, దాని కార్యకలాపాలు ఆయన తిలకించ వలెననీ కోరారు. కలకత్తాలో అన్ని సౌకర్యాలూ గల చోటున ఆయన బసఏర్పాటైంది. కాని ఆయన అక్కడికి వెళ్లనన్నాడు. ఒరియా కార్మికులతో, వాళ్లు నివసించే ప్రేమచంద్ బోరల్ వీధిలో అక్కడ పరిసరాలు అపరి శుభ్రంగా ఉండినప్పటికీ, అక్కడే ఉంటానన్నాడు. ఒక్కొక్కగది పరిమాణం ఏడడుగుల పొడవు ఏడడుగుల వెడల్పు. అలాంటి గదికి పదిహేను మంది దాకా ఉండేవారు. కరకత్తాలో మకాం చేసిన రోజుల్లోనే ఆయన అక్కడి ఒరియా కార్మిక సంఘాన్ని పటిష్టం చేసే పునాదులు వేశాడు. వారిని దగ్గరుండి నడిపించడానికి లింగరాజ్ మిశ్రాని అక్కడే ఉంచాడు.

జూన్ 11వ తారీఖున ఆయన సత్యవాదికి తిరిగి వచ్చాడు. రాగానే జ్వరం వచ్చింది. మరుసటి రోజు అనగా 12వ తారీఖు బార్డోలీ సత్యాగ్రహంలో సర్దార్ వల్లభభాయ్ పటేల్ పొందిన విజయాన్ని దేశమంతటా పండుగ జరుపుకున్నారు. ఆ సందర్భంలో గోపబంధు పూరీలో పెద్ద బహిరంగ సభలోనూ యితర సమావేశాల్లోనూ ప్రసంగించవలసి ఉంది. కాని జ్వర తీవ్రత వల్ల ఆయన పూరీ వెళ్లలేక పోయాడు. ఆయన చాల నీరసించి పోయాడు. ఆయన అస్వస్థతను గూర్చి వార్త తెలియగానే, కార్యకర్తలు వివిధ ప్రాంతాల నుంచి ఆయన్ని చూడటానికి

వచ్చారు. వాళ్లను చూసి ఆయన కళ్ల నీళ్లు నించాడు. ఆ సమయంలోనే సత్యవాది ఆస్పత్రి వైద్యాధికారి ఆయున్ను చూడటానికి వచ్చాడు. జరగబోయేది తెలిసినట్లుగా ఆయన డాక్టరుతో అన్నాడు. ''డాక్టర్, అనారోగ్యం విషయమై నేను దుఃఖించడం లేదు. అయితే ఉన్నట్లుండి ఈ కన్నీరెందుకు? అంటారా, వాలో కవిహృదయం ఉన్నది. ఒక పద్యపాదం జ్ఞాపకం వస్తోంది. 'ఈజీవన సాగరం మీద ఎన్నాళ్లీ పడవ నడపగలను? దీన్ని నువ్వు కాచుకో. నాగుండె జారిపోతున్నది.'' అక్కడున్నవారందరూ ఆయున్ని సమాశ్వాసించారు. అదికేవలం మలేరియా జ్వరమేననీ, ఆదుర్దా పడనవసరం లేదనీ ఊరడించారు.

అస్వస్థతలోనైనా ప్రజా సేవకునికి విరామం అంటూ లేదు. 'సమాజ్' పత్రికా సంపాదకుడుగా ఆయనమీదా, ముద్రణ ప్రచురణ కర్తగా పండిత్ లింగరాజ్ మిశ్రామీదా, మాన నష్టందావా ఒకటి దాఖలైంది. అది పారికుడ్‌ను గురించి వార్త ప్రచురించి నందుకు, ఈ విషయం ఆయనమంచం పట్టి ఉండగా తెలిసింది. ఆ సమయంలో ఆయన మనఃస్థితి ఎలా ఉన్నదో ఒక లేఖ ద్వారా మనకు తెలుస్తున్నది. 'సమాజ్' కార్యాలయంలో ఒక సహచరుని పేర 1928 జూన్11 తేదీ ఆయన యిలా లేఖ వ్రాశాడు. ''నాకు మళ్లీ జ్వరం వచ్చింది. మంచం మీదే ఉన్నాను. మాన నష్టం దావా 14 తేదీ విచారణకు వస్తుంది. వనమాలి (శ్రీవనమాలీదాస్, న్యాయవాది, పూరీ) ఒకరోజు ముందుగా నన్ను పూరీ రమ్మన్నారు. లింగరాజ్ ఈరోజు తిరిగి రావలసి ఉంది. కాని ఆయన వచ్చినట్టులేదు. 'సమాజ్' పత్రిక కోసం నేను జబ్బు పడక పూర్వం వ్రాసిన రచన యీ పూటే పంపాను. ఈ లేఖ మరొకరికి చెప్పి వ్రాయిస్తున్నాను. ఈ నా ఆరోగ్యం పాడైపోయింది. ఈ వయసులో ఆరోగ్యం పాడైతే దాన్ని మళ్లీ బాగు చేసుకోవడం జరిగేపనికాదు. ఇక నుంచి నేను ఏదో ఒక్కచోటే ఉండిపోవాల్సి వచ్చేట్లు ఉంది. ఏదేమైనా, అంతా భగవదిచ్ఛ. దుఖిశ్యాముకు, నేను ఆయనతో కలిసి వరద ప్రాంతాలకు వెళ్లే అవకాశం లేదని తెలియ జెయ్యవలసింది.''

## పత్రికల్లో దుర్విమర్శ

ఒరిస్సాలో ఏ ప్రజాసేవకుడూ సాటి వారి చేత ప్రశంసింపబడే అదృష్టానికి నోచుకోలేదేమో! గోపబంధు విషయంలో కూడా అలానే జరిగింది. తన జీవిత సర్వస్వమూ ఆయన ప్రజలకు సేవచేయడానికే వినియోగించాడు. ఆస్తి తాలూకు, కుటుంబం తాలూకు బాధ్యతల్ని ఆయన మానవాతీత ధోరణిలో త్యాగం చేశాడు. అయితేనేం, దేశంలో ద్రోహులకు కరవులేదు. 1928 జనవరిలో 'యంగ్ ఉత్కళ్'

అనే కటక్ పత్రిక, పేరు లేని విలేఖరి వ్రాసినట్లుగా, గోపబంధు చేతా ఆయన పేరు మీదా సేకరింప బడిన ధనం దుర్వినియోగం అయిందనే ఆధారంలేని ఆరోపణల్ని ప్రకటించింది. ఆరోపణల్లో బలం లేదు, కాని వెనుక ఉద్దేశాలు మాత్రం సామాన్యమైనవి కావు. పెద్దమొత్తాలు ఒరిస్సా వరద సహాయ కమిటీ వారి ఆధీనంలో డిపాజిట్‌గా మూలుగుతున్నప్పటికీ, గోపబంధు ఆ నిధుల్ని ఉచిత సాహాయ్యం రూపేణా పంచి పెట్టలేదనీ, ఆ నిధుల్లో చాలభాగం ఇండ్ల నిర్మాణానికే మరలించాడనీ ఆరోపణ. ఎముకల గూళ్ళుగా మిగిలిపోయిన మనుష్యులకు యిండ్లు కట్టి ఏం ప్రయోజనం? తిండీ తీర్థమూ లేక వాళ్ల జీవితాలు మసైపోతుంటే, యిళ్లవల్ల వాళ్లకు ఒరిగేదేమి? టని వాదం. ఈ ఆరోపణలు గోపబంధు స్నేహితులకూ, సహచరులకూ ఆందోళన కలిగించాయి. అటువంటి నిందా పూర్వకమైన విమర్శలకు గట్టిగా సమాధానం చెప్పేందుకు వాళ్లు కటక్‌లో పెద్ద బహిరంగ సభ ఏర్పాటు చేశారు. సత్యనారాయణ సేన్‌గుప్త అనే కటక్ న్యాయవాది ఆ సభకు అధ్యక్షత వహించాడు. ఒరిస్సా వరద సహాయ కమిటీ ఒక పత్రాన్ని ప్రచురించారు. అందులో యిండ్ల నిర్మాణానికి నిదుల్ని వినియోగించడం ఎలా అత్యవసరమో సమర్థించి చూపారు. బయటి సంస్థలు ఎన్నో వరద సహాయం పంచి పెడుతూ పని చేస్తున్నప్పుడు, మరోపని చేపట్టడంలో గల ఔచిత్యాన్ని వివరించారు. పండిత్ లింగరాజ్ మిశ్రా, గోపబంధు చౌధురి, సత్యనారాయణ సెన్‌గుప్త మున్నగు వారు సంతకం చేసిన ప్రకటన కూడా వెలువడింది. 'ఉత్కళ దీపిక' అనే వార్తా పత్రిక (ఇప్పుడులేదు) ఒరిస్సా వరద సాహాయ్యకమిటీ వారినీ, ముఖ్యంగా గోపబంధు దాస్‌నీ దుమ్మెత్తి పోయడానికి తన పుటల్లో అవకాశం కల్పించింది. ఒకవైపు గోపబంధు ప్రాణజ్యోతి కొడిగట్టి అంతరించి పోతూ ఉంటే, కారుణ్య బుద్ధితో ఆయన చేపట్టిన పరోపకార కార్య భారంతో శరీరం వ్యాధిగ్రస్తమై కృశిస్తూ ఉంటే, మరోవైపు ఆయన దేశీయులు ఆయన మీద అభాండాలు వెయ్యడం ఎంత విషాదకరమైన సగంతి! ఈ క్రూరమైన దాడి గోపబంధు నాలుగు నెలలు మాత్రమే భరించ గలిగాడు. అటుపై ప్రజా సేవకుల గౌరవ మర్యాదల్ని కాపాడే భారం తన దేశీయులకే వదలి పెట్టి ఆయన నిష్క్రమించాడు.

# 19

# చివరి క్షణాలు

మరణశయ్య మీద కూడా గోపబంధు తన దేశాన్ని మరచి పోలేదు. స్నేహితులకూ, సహచరులకూ, ప్రజాహిత కార్యాలను గురించి వివరంగా సూచనలిస్తూ ఎన్నో లేఖల్ని వ్రాయసగాణ్ణి పెట్టుకుని వ్రాస్తూనే ఉన్నాడు. 'సమాజ్' పత్రికకు కూడా క్రమం తప్పకుండా రచన చేస్తూనే ఉన్నాడు. 1928 జూన్ 16వ తేదీ ఆయన ఆరోగ్య పరిస్థితి ఆందోళన కలిగించేలా ఉండటంతో, పూరీనుంచి సివిల్ సర్జనుని టెలిగ్రామిచ్చి పిలిపించారు. ఆయన వచ్చి చూసి, సత్యవాది ఆస్పత్రి వైద్యాధికారికి వివరంగా సూచనలు చెప్పి, ఒక చికిత్సా పద్ధతిని నిర్దేశించాడు. ''రోగి గుండె బలహీనంగా ఉంది. ఆయన్ని కూర్చోనివ్వగూడదు.'' అని చెప్పాడాయన. కటక్‌లో ఉన్న శ్రీ రాధానాథ్ రథ్‌కి టెలిగ్రాము పంపి, పండ్లు తీసుకొని సత్యవాదికి రమ్మన్నారు. గోపబంధు పెద్దల్లుడైన ప్రొఫెసర్ రత్నాకర్ పతికి కూడా సమాచారం అందజెయ్యవలసిందిగా శ్రీ రథ్‌కి తెలిపారు. పండిత్ నీలకంఠదాస్, ఆచార్య హరిహరదాస్, పండిత్ లింగరాజ్ మిశ్రా, పండిత్ రామచంద్ర ఆచార్య, యితర స్నేహితులూ, బంధువులూ, సహచరులూ ఆయన మంచం చుట్టూ చేరారు. గోపబంధు అన్నాడు. ''నీలకంఠా, నీవెప్పుడూ నా ప్రక్కనే ఉండాలి.'' 16వ తేదీ అర్ధరాత్రి వేళకు ఆయన గుండె మరీ బలహీన పడింది. శ్వాస అందక బాధపడ్డాడు. మరుసటి రోజు మళ్లీ పూరీ సర్జనును పిలిపించారు. ఆయన రోగిని పరీక్షించి బయటికి వచ్చి, ''ఆశలేదు. చివరి క్షణాలు వచ్చాయి.'' అన్నాడు. కొన్ని యింజక్షన్లు యివ్వమని చెప్పి, హెచ్చరిక చెప్పాడు. ''రాత్రి ఏడుగంటలు, పదకొండుగంటలు, తెల్లవారు జామున నాలుగు గంటల సమయంలో పరిస్థితి ప్రమాదకరంగా ఉంటుంది.'' బాబూ జగబంధుసింగ్, బాబూ వనమాలిదాస్ (పూరీన్యాయ వాదులు వీరు), యింకా చాలమందీ సత్యవాదికి వచ్చారు. ఆయన పూర్తి చైతన్యంతో ఉన్నాడు. ముఖం యథా ప్రకారం కళగానే ఉన్నది. మాటలు స్పష్టంగా దృఢంగా, మామూలుగానే ఉన్నాయి. జగబంధు బాబు వైపు చూసి ఆయన అన్నాడు. ''మనమధ్య అభిప్రాయబేధాలు కాలాన్ని బట్టీ, కార్యాన్ని

బట్టీ ఎన్నో వచ్చాయి. అదంతా మనసులో ఉంచుకోకు. క్షమించి మరచిపో''
మధ్యాహ్నం ఒంటిగంటకు పండిత్ లింగరాజ్ మిశ్రా, యితరుల సలహామీద, ఆయన్ని ప్రశ్నించాడు. ''మీకు చెందిన భూవముల విషయం ఏమైనా సెలవిస్తారా?'' గోపబంధు అన్నాడు. ''అవును. నేనా విషయమై చెప్పవలసింది చాలా ఉంది. అందర్నీ రమ్మను. కలం కాగితం తెచ్చి నేను చెప్పేది వ్రాయి.'' అక్కడున్న వాళ్లందరూ చుట్టూ చేరారు. లింగరాజ్ కలం, కాగితం పట్టుకుని కూర్చున్నాడు. గోపబంధు ఆస్థితిలో కూడా, నాలుగు అరఠావు పేజీలు ఇంగ్లీషులో డిక్టేషన్ చెప్పాడంటే ఆశ్చర్యంగా ఉంటుంది. సంపూర్ణ స్పృహతో, మతి మరుపులేకుండా, విస్పష్టమైన కంఠంతో చెప్పాడు. తనసొంత ఆస్తులకూ, ఇలవేల్పు వినోద్ విహారికి అంకితమైన దేవోత్తర భూములకు ఆయన ట్రస్టీలను (ధర్మకర్తలను) నియమించాడు. సత్యవాది ముద్రణాలయం, 'సమాజ్' పత్రిక, సత్యవాది పాఠశాల, వితంతువుల ఆశ్రమం, వరద సాహాయ్య నిధులు, తదితర సంస్థలకూ ఆస్తిపాస్తులకూ యాజమాన్యం విషయమై అన్ని ఏర్పాట్లూ చేశాడు. ఆ సమయంలో ప్రొఫెసర్ ఆర్. పతి, శ్రీ రాధానాథ్‌రథ్ కటక్ నుంచి అక్కడకు వచ్చారు. వాళ్లతో అన్నాడాయన. ''మరణించే ముందు నాచివరి అభిమత పత్రాన్ని (విల్) యిప్పుడే డిక్టేట్ చేశాను.''

సాయంకాలం 5.30 అయింది. విల్ డిక్టేట్ చెయ్యడం పూర్తి అయ్యాక ఆయన అన్నాడు. '' మీరు భద్రంగా ఉండండి. నాకు కాలం ఆసన్నమైంది. నన్ను పోనివ్వండి.'' స్నేహితుల్నీ సహచరుల్నీ తనచుట్టూ కూర్చుని భగవన్నామ స్మరణ చెయ్యమని కోరాడు. అందరూ నామ భజన ప్రారంభించగానే, గోపబంధుకూడా వారితో కంఠం కలిపాడు. నామస్మరణ చేస్తూ గోపబంధు అన్నాడు. ''నాశ్వాస పైకిలాగుతున్నది, ఎందుకు? దానివల్ల నడుము నొప్పి పెడుతున్నది.'' ఆచార్య హరిహరదాస్ నడుము ఒత్తడం ప్రారంభించాడు. నాడి అప్పటికే పడిపోయింది. ఇంజక్షన్లు మీద మీద యిచ్చినా ఫలితం కనిపించలేదు. పూర్తి తెలివి మాత్రం అలానే ఉంది. హృదయం మీద చేయి ఉంచుకుని ఆయన అన్నాడు. ''ఈ ఎగశ్వాస నిలిచపోతే బావుండుననిపిస్తుంది.'' రెండు నిమిషాల తర్వాత అదీ ఆగిపోయింది. సాయంత్రం 7.25 గంటలకు, 1928 జూన్ 17వ తేదీ గోపబంధు తనువు చాలించాడు. పూరీ రథోత్సవానికి ముందటి రోజు ఆవేళ. ఒరిస్సాలో ఆరోజుని నవయౌవన దర్శన్' అంటారు. అనగా పూరీలోని ముగ్గురు దేవతామూర్తుల యౌవన శోభను దర్శించే వేళ అన్నమాట.

ఆయన మరణ వార్త వెంటనే అన్నిదిక్కులా వ్యాపించింది. రెండు గంటలు వ్యవధిలో జనం గుంపులుగా వచ్చి చేరారు. ఆయన మృత దేహాన్ని పువ్వులతో,

మాలలతో, కర్పూరంతో అలంకరించి, జాతీయ పతాకను పైన అచ్ఛాదించి, గొప్ప ఊరేగింపుగా, ఆయన ప్రేమించిన వకుళనికుంజానికి తరలించారు. ఆస్థలం సాక్షి గోపాల్ దేవాలయం వెనుక భాగాన ఉన్నది. ఆయన మృత దేహానికి నెయ్యితో చందనం కొయ్యలతో అగ్ని సంస్కారం చేశారు.

గోపబంధు మరణించినా ఆయన స్మృతి లక్షలాది భారతీయుల హృదయాల్లో సజీవంగానే ఉన్నది. సాక్షిగోపాల్‌లో ఒక స్మృతి స్తంభం ఉంది. ఇక్కడా అక్కడా అన్ని చోట్లా చలువరాయి, కంచు విగ్రహాలు వెలిశాయి. వందలాది సంస్థలకు ఆయన పేరు పెట్టారు. ఇవన్నీ కూడా నశ్వరాలే, మానవ దేహంలాగ. కాని జాతి హృదయంలో ఆయన ఆక్రమించుకున్న స్థానం అది చివరస్థాయి. ఆయన 'ఆధునిక ఉత్కళకు జాతి పిత?'

# 20

# సాహితీ పరుడుగా గోపబంధు

గోపబంధు జీవితంలో సాహిత్యం ప్రధానమైన అభినివేశంకాదు. తన అభిప్రాయాలనూ, ఆశయాలనూ ప్రస్తారం చెయ్యడానికి, ప్రజల్లో దేశాభిమానం రేకెత్తించడానికి, ఆయన దాన్ని సాధనంగా ఉపయోగించాడు. సాహిత్యాన్ని సొంత కృషిగా అవలంబించలేదాయన. సత్యవాది పాఠశాలలో సహచరులుగా ఉండిన పండిత్ నీలకంఠదాస్, పండిత్ గోదావరీశ్ మిశ్రా, పండిత్ కృపాసింధు మిశ్రా వంటి వారు తమ రచనల ద్వారా ఒరియా ప్రజలను ఉత్తేజితులను చేసేందుకు ఆయన ప్రేరణ కల్పించాడు. నీలకంఠ కృపాసిందులు తత్త్వ శాస్త్రంలో మాస్టర్ డిగ్రీ పొందినవారు. గోదావరీశ్ ఆర్థిక శాస్త్రంలో ఎం.ఏ. కానీ గోపబంధు ప్రేరణ మూలంగా వాళ్ళ దేశాభిమానం పెంపొందించేందుకు చరిత్రకారులై రచనలు చేశారు. కోణార్కలోని ప్రసిద్ధ సూర్యదేవాలయం, 'నల్లపెగోడా' అని పేరు పొందడమే కాకుండా, ప్రపంచంలోని ఏడువింతల్లో ఒకటిగా పరిగణింప బడుతున్నది. దీని గురించిన ఐతిహ్యం ప్రకారం- అక్కడ పనిచేసిన 1200 మంది మే స్త్రీలు ప్రయత్నించినా దేవాలయ గోపురం చివరి భాగం మూత వెయ్యడం పూర్తికాలేదట. అప్పుడు మేస్త్రీలకు పెద్ద అయిన విశూ మొహరాణా కొమారుడు ధర్మ పాదుడు పండ్రెండేళ్ల వయసువాడు, దాన్ని పూర్తి చేశాడట! అలా జరగడంతో దేవాలయ నిర్మాత నరసింఘ దేవమహారాజు మే స్త్రీల నందరినీ అవమానం పాలు చేస్తాడో లేక ఉరితీస్తాడో అన్న భయం కలిగి, ధర్మపాదుడు బంగాళాఖాతంలో దూకి మరణించాడట! ఈ కోణార్క పురాణ గాథ ఒరియా వాళ్ల నందర్నీ ఉత్తేజ పరచే గాథ. నీలకంఠ 'కోణార్క' అన్నపేరుతో కోణార్కలోనే తన కావ్యాన్ని రచించాడు. గోపబంధు 'ధర్మపాద' శీర్షికతో ఒక లఘు కావ్యాన్ని వ్రాశాడు. కృపాసింధు కోణార్క చరిత్రను వచనంలో వ్రాశాడు.
కృపాసింధు కోణార్క చరిత్రను వచనంలో వ్రాశాడు. అలాగే కటక్‌లోని బారాబతి కోటలో ముకుందదేవుడు నిర్మించిన 12 అంతస్థుల రాజసౌధం ఉండేది. ముసల్మానులు ఒరిస్సా పాలనను కైవసం చేసుకోక పూర్వం పరిపాలించిన హిందూ రాజుల్లో చివరివాడు ముకుంద దేవుడు. ఆకోట కూడా

ఒరియా ప్రజలకు ప్రియమైన శిథిలం. కృపాసింధు బారాబతి చరిత్ర రచించాడు. గోదావరీశ్ 'ముకుంద దేవ' అనే నాటకం వ్రాశాడు. గోపబంధు కూడా ఒక ఖండ కావ్యం వ్రాశాడు. గోదావరీశ్, పురుషోత్తమ దేవుడు నాయకుడుగా ఒక నాటకం నిర్మించాడు. దండెత్తి వచ్చిన ముసల్మానులుతో పోరాడి గెల్చిన హిందూరాజా పురుషోత్తమ దేవుడు. 'ఒరిస్సా చరిత్ర' అనే అసంపూర్ణ గ్రంథం కూడా కృపాసింధు రచనల్లో ఒకటి. తర్వాత జీవితంలో గోదావరీశ్ గేయకవిగా పేరు ప్రతిష్ఠలు పొందాడు. నీలకంఠ తాత్త్విక రచనలకు ఒరియా సాహిత్యంలో ప్రముఖ స్థానం ఉన్నది. ఆయనకు సాహిత్య విమర్శకునిగా కూడా చాల ప్రసిద్ధి ఉన్నది. శ్రీమద్భగవద్గీత మీద ఆయన వ్రాసిన వ్యాఖ్యానం ఆయన రచనల్లో శ్రేష్ఠమైనదిగా భావిస్తారు. గోదావరీశ్ నీలకంఠలు రచించిన స్వీయచరిత్ర గ్రంథాలకు, సాహిత్య అకాడెమీ బహుమతి, వారి మరణానంతరం లభించింది. తదుపరి పరిణామం ఎలా ఉన్నా, సత్యవాది పాఠశాలతో సంబంధం కలిగి ఉండిన రోజుల్లో, పై రచయితలు చేసిన రచనల్లో వస్తువూ, భాషా, శైలీ ఒక ప్రత్యేకతను సంతరించుకున్నందువల్ల, ఆ రచనలను ఒరియా సాహిత్య చరిత్రలో 'సత్యవాది యుగం' రచనలని ప్రత్యేకంగా పేర్కొంటారు.

కుటుంబ సంప్రదాయం రీత్యా, గోపబంధుకు శ్రీమద్భాగవతం క్షుణ్ణంగా తెలుసు. జగన్నాథ దాస్ రచించిన ఆ పురాణంలో ప్రతి పద్య పాదానికీ తొమ్మిదేసి అక్షరాలు ఉంటాయి. దానిలోని భాష ఎంత సరళంగా ఉంటుందంటే, నిరక్షరాస్యులైన వాళ్లు కూడా దాన్ని యితరులు చదవగా విని అర్థం చేసుకోవచ్చు. అంతేకాదు, పద్యపాదాన్ని కంఠతాకూడా పెట్టవచ్చు. గ్రామ సీమల్లో ఈ కావ్యంలోని పద్యపాదాల్ని అన్ని వర్గాల మనుష్యులూ మాటల సందర్భంలో వల్లించడం చూడవచ్చు. ఈ కావ్యమంటే గోపబంధుకు ఎంతో ప్రీతి. అందులోని పద్యపాదాలు ఆయనకు విరివిగా నోటికి వచ్చు. ఆ వరవడిలో ఆయన తన పద్యరచన ప్రారంభించాడు. స్కూల్లో కాలేజిలో చదువుకునే రోజుల్లో కూడా ఆ అభ్యాసాన్ని ఆయన వదలిపెట్టలేదు. అలా వ్రాసిన పద్యాల్లో కొన్నింటిని ఎంపిక చేసి 1899లో 'అవకాశ్-చింతా' (తీరికవేళ ఆలోచనలు) అనేశీర్షికతో ప్రచురించాడు. అదే ఆయన పుస్తకాల్లో మొదటిది. అది కాక అయిదు కవిత్వ రచనల్ని ఆయన ప్రచురించాడు. 'గోమాహాత్మ్యం' (గోవు ప్రాధాన్యాన్ని గూర్చి), 'ధర్మపాద', 'బందీర్ ఆత్మకథ' (బంధితుని ఆత్మకథ,) 'కారాకబిత' (కారాకార కవిత) 'నాచికేత - ఉపాఖ్యాన' (నాచికేతోపాఖ్యానము).

గోపబంధు వచన రచన చక్కగా ఉంటుంది. ఆయనశైలి అనితర సాధ్యం. ఆయన వచనంలో గ్రంథమంటూ ఏదీ వ్రాయలేదు. 1915 నుంచీ 'సత్యవాది'

అనే మాసపత్రికనూ, 1919 నుంచీ 'సమాజ్' వార పత్రికనూ ప్రారంభించాడు. ఆరెండు పత్రికలకూ క్రమం తప్పక వ్రాసేవాడు. ఆ రెండు పత్రికలూ ఆయన ఆలోచనలకూ ఆశయాలకూ వాహికలై, యిప్పటికీ ఒరియా సారస్వతంలో నిధి నిక్షేపాలుగా పరిగణించ బడుతున్నవి. వాటిలోని గోపబంధు వచనరచనల్ని ఒకటిగా కూర్చి, పుస్తక రూపంలో యింతదాకా ప్రచురించక పోవడం మన దురదృష్టమే.

'లీజర్ టైమ్- థాట్స్' (తీరిక వేళ ఆలోచనలు) గ్రంథంలోని పద్యాల్లో ఆయన ఉదాత్త భావాలు మనకు లభిస్తాయి. సాహిత్యంలో లబ్ధ ప్రతిష్ఠులైన సరళాదాస్, జగన్నాథదాస్, బలరామ్‌దాస్, ఉపేంద్ర భంజ, ఒరిస్సా నేలిన ప్రభువులు అనంగభీమ దేవుడు, పురుషోత్తమ దేవుడు, వీరిని గూర్చి కథా కథన రీతిలో వ్రాసిన ఖండికలున్నాయి అందులో. ఖండగిరి కొండల్లో ప్రవహించే కట్జూరీ నదీ ప్రాంతాన్ని వర్ణించేవీ, కటక్‌లోని శిలానిర్మాణాల్ని గూర్చి, బారాబతి కోటను గూర్చి వ్రాసినవీ ఉన్నాయి. గంజామ్ జాతీయ మహాసభ మీద వ్రాసిన పద్యాలున్నాయి. ప్రేమ, ఆగ్రహం వీటిని గూర్చి ఆలోచనాత్మకంగా వ్రాసినవి. రేవన్ షా కాలేజీకి వీడ్కోలు, ఇరవై ఆరో సంవత్సరంలో అడుగు పెట్టిన వేళ, నిర్వేదంలో అనే శీర్షికలు గల రచనలున్నాయి. ఈ పద్యాలు వ్రాసేనాటికి గోపబంధు మనస్సు పరిణతం కాలేదు. కాని తర్వాత రూపు దిద్దుకున్న భావాల స్వరూపాన్ని 'అండస్థితి'లో మనం ఈ రచనల్లో చూడవచ్చును. ఉదాహరణకు:

''లెక్కలేని పథకాలు మొగ్గ దొడుగుతున్నవి నా హృదయంలో, కాని ఒకటీ వికసించలేదు యిందాక.''

''దూరాన ఉన్న గుడిలోకి వెళ్లడం కంటె, తన హృదయంలోకి తాను తొంగి చూడడమే మెరుగు.''

''మనమంతా భగవంతుని సంతానం. మానవసేవా, అహంకార త్యాగమూ మన కర్తవ్యం.''

''స్వతంత్రేచ్ఛ గలవారు యితరుల పాదసేవ చేసి, ధనం, అధికారం పొందడం బదులు మృత్యువునే ఆహ్వానిస్తారు.''

''ప్రపంచ భీషణ రణ రంగంలో ఉత్కళ పుత్రులారా! వెనుకంజ వెయ్యకండి! ఓ భగవాన్ వీరిని ఆజ్ఞాపించండి. ఒరియా దేశాభిమానం, భారత జాతీయతా వాహినిలో విలీనం కావాలి!''

ఇవి యిర్వై ఏళ్ల యువకుని భావాలకు మచ్చుతునుకలు.

'కారాగార కవిత', 'బంధితుని ఆత్మకథ', 1923-24లో ఆయన హజారీబాగ్ జైల్లో ఉండగా వ్రాసినవి. మొదటి దానిలో పదమూడు ఖండికలున్నాయి. స్నేహితుని మరణవార్తవిని, మాతృదేశాన్ని గూర్చి బంధితుని

ఊహలు, బంధితుని సాయం సమయ పూజలు, అనంత నీలాచల్, మొదలగువని. 'బంధితుని ఆత్మకథ' నాలుగువందలు పంక్తుల దీర్ఘకావ్యం. తాను జైల్లో ఉండటం వల్ల పీడిత ప్రజలకు ఉపయోగపడలేకపోతున్నందుకు ఆయన పొందిన నిర్వేదం యీ కావ్యంలో వ్యక్తమైంది. ఒరిస్సా ప్రజలు వరదలో వరపోవచ్చి, ఏటా కడగండ్ల పాలవుతున్నారు. కనికా రైతులు నిరంకుశత్వం క్రింద నలిగి పోతున్నారు. గాంధీజీ స్వాతంత్ర్యం వచ్చేస్తుందన్న ఆశాభావాన్ని చూపుతూ ఉంటే, ఆయనలో ఉత్సాహం ఉప్పొంగి యిలా వ్రాశాడు.

''నాదేహం ఈ దేశం మట్టితో ఏకం కావాలి
ప్రజలు నా వీపున నడవాలి
స్వరాజ్య మార్గంలో గోతులు
నారక్తం, మాంసం, ఎముకలు పూడవాలి.

''ఇంటింట కదురు తిరగాలి
పల్లె వ్యాజ్యాలు పల్లెలో తీర్పు కావాలి
ఇంటిలో కదురు, ఊరిలో పంచాయితీ
పల్లెవాసుల్లో మాట కట్టు బాటు
కలిగితే ఉత్కళ కడగండ్లు కడతేరినట్లే.

''జాతీయతా, విశ్వజనీనతా,
ఉత్కళ ప్రజకు మార్గదీపికలు కావాలి
హైందవుడాశించడు స్వసుఖాన్ని
హైందవరక్తం ప్రతి బిందువూ లోకహితార్థమే.''

'ధర్మపాద' కావ్యంలో శిబైసామంతుని త్యాగాన్ని గూర్చి ఆయన యిలా వ్రాశాడు.

''ఈలోకంలో ఎవరూ ఎవరికీ సంతానంకాదు,
అంతా వట్టిమాయ
పరోపకారార్థం జీవితం గడిపిన వాడే
నిజంగా జీవించి నట్లు లెక్క.''

ఈచిన్న గేయకవిత దేశాభిమానంతో, ప్రాచీన వారసత్వం మీది గౌరవంతో, భగవద్భక్తితో, ఉరకలు వేస్తున్నది. దీని ఉపోద్ఘాతంలో కవి యిలా అంటాడు.

''అత్యధిక సంఖ్యాకులకు అత్యధిక శ్రేయాన్ని సమకూర్చే కార్యాచరణమే మానవుని విధ్యుక్త ధర్మం.''

''గోవు మాహాత్మ్యం' 1922లో ప్రచురింపబడింది. అందులో గోపబంధు, మనిషి గోజాతికి ఎలా ఋణపడి ఉన్నాడో వివరించేందుకు ఒక ఉపాఖ్యానం చెబుతాడు. వస్తువు శ్రీమద్భాగవతం, మహాభారతం గ్రంథాలనుంచి సేకరింపబడింది. కవిపేరు గోపబంధుదాస్ అయినప్పటికీ, ఈ గ్రంథంలో ఆయన తనని 'గోపదాస్' గా, గోపాలకులకు దాసునిగా, వ్యవహరించుకున్నాడు. అందులో యిలా అంటాడు.

> ''పశుగణ రక్షణ లోకానికి శ్రేయస్సు
> గోగణమే మనుష్యుల్ని పోషించు
> గోప విన్నవించు
> ఈ సత్యాన్ని గ్రహించు.
> ''గోగణ రక్షణమే మతాల సారం
> ప్రతి మనిషికీ యిది తెలిస్తే
> ఈలోకం అవుతుంది స్వర్లోకం
> అప్పుడు వస్తుంది అందరికీ మోక్షం.''

ఇది 21–ఆశ్వాసాల మహాకావ్యం. గోవుకి సంబంధించిన సమస్త విషయాలూ యిందులో ప్రసక్తమయ్యాయి.

'బ్రహ్మతత్త్వం' లేక 'నాచికేతో పాఖ్యానం' అనే రచనకు కఠోపనిషత్తులోని కథ ఆధారం ఇందులో రెండు అధ్యాయాలు, ఒక్కొక్కటీ ఏడు విభాగాలతో ఉన్నాయి. ఉపనిషత్తుల్లో వచ్చే పాత్ర అయిన నాచికేతుని గూర్చిన కథనం యిది. గోపబంధుకి గోవు మీదగల అభిమానం ఈ గ్రంథంలో కూడా కనిపిస్తుంది.

> ''గోదానం చేస్తే స్వర్గసుఖం లభిస్తుంది
> గోదానాన్ని మించిన దేదీ లేదు
> అందరూ గోరక్షణ చేయాలి
> గోరక్షణ, గోదానం
> ఇహపర సుఖాలకు మూలం
> గోగణాభివృద్ధి అందరి కర్తవ్యం.''

ఈ గేయాలూ, కావ్యాలూ, పద్యాలూ కాక, ఆయన వచన రచనలు ఒరియా సాహిత్యంలో వజ్రపుతునుకలు. ఆలోచన ప్రేరేపించేవి. ఉదాహరణకి తనమాసపత్రిక 'సత్యవాది' ప్రారంభ సంచికలో ఆయన వ్రాసింది చూడండి.

''ఒరిస్సా మనకార్యరంగం అయినప్పటికీ అది భారత దేశంనుంచీ, విశాల విశ్వంనుంచీ భిన్నమైందికాదు. ఒరియావాళ్ళూ, భారతీయులూ మానవజాతిలో

భాగం. మాతృదేశసేవలో శ్రద్ధాళువులై ఉంటే, మనం ప్రపంచసేవ చేసిన తృప్తి పొందవచ్చును. దేశాభిమానం విశ్వమానవతకు విరుద్ధంకాదు. విశ్వమానవతా భావం హృదయంలో లేని వ్యక్తి జాతీయత, దేశాభిమానమూ కూడా లేనివాడే. అందువల్ల ఉత్కళను సేవిస్తే భారతాన్ని, ప్రపంచాన్ని సేవించినట్లే. ఒరియావాళ్ల అభ్యుదయం ద్వారా మనం మానవాభ్యుదయం దర్శిస్తాము. ఒరియా వ్యక్తిగత జీవితంలోమనం విశ్వమానవతను అనుభవించాలి. అప్పుడు మానవజాతి హృదయరాగాన్ని ఉత్కళ హృదయంతో ఆలకించవచ్చు.''

భాషను గూర్చి ఆయన యిలా వ్రాశాడు.

''పరిపాలన సాగించే భాష ప్రజలకు అర్థమయ్యే భాషగా ఉండాలి. ప్రభుత్వం అవలంబించే పద్ధతులూ, దాని యంత్రాంగమూ, ప్రజలకు అతీతంగా ఉండటం మంచిదికాదు. బారతదేశంలో రాష్ట్రీయ స్వయం ప్రతిపత్తి ఏర్పడి, ప్రజలు పరిపాలనలో పాల్గొంటూ, దాన్ని నిర్వహించవలెనంటే, రాష్ట్రంలోని భాషే ఇంగ్లీషు కంటె ఉపయుక్తంగా ఉంటుంది.''

ప్రజలసాహిత్యాన్ని గూర్చి ఆయన అభిప్రాయాలు ఆయనకున్నవి.

''ప్రజా సాహిత్యం లేకుండా జాతి పురోగమించదు. సమాజంలో పైతరగతి మనుష్యులు మాత్రమే ఉండినట్లయితే, ప్రజా సాహిత్యమంటూ అవసరం ఉండేదికాదు. సమాజం అట్లా లేదు. సమాజంలోసగం చదువుకున్నవాళ్లూ, అసలు చదువుకోని వాళ్లూ ఉన్నారు. పొలందున్నేవాళ్లు, తోటల్లో నీళ్ళు పెట్టేవాళ్లు, నదిలో బోటు నడిపే వాళ్లు, కట్టెలు కొట్టేవాళ్లు, బట్టలు నేసేవాళ్ళు ఎందరో. పైతరగతుల వాళ్లు సమాజానికి మెదడు లాంటి వారైతే సామాన్య ప్రజ దాని హృదయం. అక్కడే జాతి ఆత్మ ఉండేది. వాళ్లకూ సౌందర్యం మీద ఆసక్తి, సుఖసంతోషాలపట్ల తృష్ణ, అభివృద్ధి పొందాలనే ఆకాంక్ష ఉన్నాయి. ఆ ఆకాంక్షల్నీ, ఆశయాల్నీ తృప్తిపరచేందుకు తగిన సాహిత్యం వారికీ అవసరమే. వారికి సవ్యమైన సాహిత్యం లేకపోతే వారి ఆశయాలు నశించడమే కాదు, అవిదుష్టమార్గాల్లో పయనించే ప్రమాదమూ ఉన్నది.''

అక్షరాస్యతను గూర్చి గోపబంధు యిలా అన్నాడు.

''అక్షరం అంటే దైవం, ఆత్మ, రెండూ. అందువల్ల మనిషి నిరక్షరుడుగా ఉండిపోవడం పాపం. ప్రతి ఒక్కరికీ కనీసం అక్షరాలైనా వచ్చి ఉండాలి. లేకపోతే ఈ జాతికి మోక్షం లేదు.''

(ముద్రణ) భాషా లిపిని గూర్చి ఆయన స్వీయాభిప్రాయం యిలా వెలిబుచ్చాడు.

''బెంగాలీ, దేవనాగరి లిపులు (ముద్రణకు) పదిరకాలున్నాయి. ఒరియా

విషయంలో చిన్న 'పైకా' లిపి ఒక్కటే వాడుకలో ఉంది. అదెప్పుడో మిషనరీలు మొదట్లో ముద్రణాయంత్రాలను ప్రవేశ పెట్టినప్పుడు తయారైనది. రచయితలు, ముద్రాపకులు, పాఠకులు, ఆకర్షణీయమైన అలంకృతమైన లిపులు వివిధ పరిమాణాల్లో ఉండవలసిన ఆవశ్యకతను తరుచు గుర్తిస్తూనే ఉన్నారు. కాని ధనమూ, శ్రమా, వెచ్చించి ఆలోపాన్ని పూరించేందుకు ఎవరూ ముందుకు రావడం లేదు. ముద్రణ లిపిలో ఉన్న ఈ యిబ్బంది వల్ల పుస్తకాలు విరివిగా చలామణీ కావడం కష్టంగా ఉన్నది. ప్రజల్లో పాఠకుల సంఖ్య క్రమంగా పెరగడం, అందానికీ అభిరుచికీ ఎక్కువ ప్రాముఖ్యం యిస్తూ ఉండడం, పుస్తకాలను చౌకధరలకు అందుబాటులో ఉండేట్లు చెయ్యవలసి రావడం, ఈ కారణాల దృష్ట్యా, వివిధ రకాల్లో ముద్రణలిపిని తయారు చేసి వాడవలసిన అవసరం తప్పకుండా ఉన్నది.''

ఈ రీతిగా గోపబంధు సాహిత్యంలో ప్రతి అంశంలోనూ మెరుగులు దిద్దడమే కాకుండా, ఉన్నతాశయాలనూ, గంభీరమైన భావాలనూ, రచన ద్వారా దేశీయులకు పంచిపెట్టాడు. సాహిత్యాధికారం గల వర్గాల్లో ఈ నాటికీ అంగీకరిస్తారు ఆయన్ని కవిత్వంలో అధిగమించిన వారున్నారుకాని, వచన శిల్పంలో నేటికీ ఆయన్ని మించి వారు లేరు.

Printed at Shivam Offset Press, A-12/1 Naraina Indl. Area, Phase-I, New Delhi-110 028